


వికృతి
కార్తికము

# భారతి

సంపుటము 27
సంచిక 11


# తపోభంగము

●


శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి


అద్రితటంబునం బిహితమై పులితోలున, నిస్సపత్న ని
ర్నిద్రరుచిప్రరోహముల నిర్మలమై యొసలారు దేవదా
రుద్రుమవేదిపై దృఢనిరూఢసమాధిపరుం ద్రియంబకున్
రు[illegible] గాంచె నయ్యెడ స్మరుం డొగి జేరువమైన మిత్త్రితోన్.

పేరిమి మీఱి లోగొని గభీరసమాధిబలంబునన్ నవ
ద్వార నిషిద్ధవృత్తి విశదంబు మనంబు హృదంతరంబునం
జేరిచి, అక్షరం బనుచు క్షేత్రవిదుల్ వచియించు నాత్మ నెం
తే రహి నాత్మయందు దిలకించుచు నుండె హరుండు నిష్ఠతోన్.

భావజు డిట్లు నిశ్చలతపఃపరిణిక్తు లలాటనేత్రునిన్
భావమునందునే ననభిభావ్యు భవుం గని యంతికంబునం,
గావగ లేక ధైర్య, ములుకంబడి, సాధ్వసనన్న హస్తుడై,
వేవిడి చేయిజాఱి పృథివిం బడు విల్లు నెఱుంగ డింతయున్.

నిలువెల్లన్ ధృతి దక్కి యట్లలుకునన్ నిర్వాణభూయిష్ఠు న
య్యలరుం బూవులవిల్తు, వెండియు ననన్యంబైన స్వీయాద్భుతో
జ్జ్వల లావణ్యరసంబుతోడ బ్రదికింపంబోలె, వేంచేసె ని
మ్ములఁ, బ్రాలేయగిరీంద్రకన్య, యనుఁగుం బూబోండ్లు సేవింపగాన్.

సురుచిరలీల, దాలిచె, నశోకతిరస్కృత పద్మరాగమై,
పరమ మనోజ్ఞమై, కనకవర్ణ సవర్ణక కర్ణికారమై,
స్ఫురదురులోలతారమణిసుందర సుందరసిందువారమై,
సరస రుచిప్రరోహము, వసంతసుమాభరణంబు నార్య తాఁ.

పౌరయు పయోధరద్వితయ భూరిభరంబున వంగి సుంత, సుం
దరతరుణార్కరాగమగు నవ్యతరాంబరముఁ ధరించి, ది
వ్యరుచి దలిర్చె నారి, సుసమగ్ర సుమస్తబకావనమ్రమై,
అరుణ నవప్రవాళసుసమంచిత జంగమవల్లికైవడిఁ.

సరియగుచో నెఱింగి సుమచాపు డమర్చిన స్వీయకార్ముకా
పరవర మౌర్వివోలెఁ, బృథుభారనితంబవిలంబమాన కే
సరసుమదామకాంచి జెలువం గొనుచుం గరపల్లవంబునఁ
గిరిసుత కన్నువిందు లెసఁగించె క్వణన్మణినూపురాఢ్యయై.

పాసి యొకింతయుం జనదు, పన్నడు సంభ్రమలోలదృష్టితో,
ద్రోసి కరప్రవాలమున, ద్రోలిన నెంతయు దమ్మిపూవుతో,
డాసి గిరీంద్రజామృదుసటన్మధురాధరముఁ, సుగంధిని
శ్వాస వివృద్ధతృష్ణ మయి, పల్మఱు మూఁగుచు గండుతేటి తాఁ.

అతిసుకుమార సుందరతరాంగలతారుచిరాద్భుత ప్రభా
జితనవహేమవల్లియయి, సిగ్గున దారుచుచుఁ రతిఁ, సమా
గతయగు సర్వమంగళను గాంచి, మనఃప్రభవుండు, దైవయో
చిత మిక దీఱెనట్ల యని సింగడు బూరడు నయ్యె నయ్యెడఁ.

ప్రాతి భవిష్యదాత్మహితవల్లభుఁడౌ భవుద్వారభూమి సం
ప్రీతిని జేరె బార్వతి; హరిం బరమాత్మసమాఖ్యమౌ పరం
జ్యోతిని గాంచి లోన, బరిశుద్ధసమాధిని బాసి, చిత్స్వయం
జ్యోతి శివుండు నత్తఱిని నొందె బహిర్ముఖమైన వైఖరిఁ.

అడుగున దూలి పోలుచు, ఫణాగ్రతలమ్ముల నెట్టిలెట్టులో
పుడమిని మోయుచుఁ, భుజగపుంగవు డించుక తెప్పిరిల్లుకో
దొడఁగ, శశాంకశేఖరుడు, దోకొని యాయుతపూర్వకాయుడై,
పొడవగు పెద్ద యూరువులు పుచ్చుచు విప్పె దృఢాంఘ్రిబంధముఁ.

అంత నమస్కరించి వినయంబున నంతకశాస్త్రపాదకం
జాంతికమందు నంది, తుహినాచలరాజకుమారిరాక న
త్యంతము విన్నవించుకొని, యవ్విభు కూరిమికన్నుసన్నన
భ్యంతరభూమి జేరిచె, యువన్యలు రా వెనువెంట నంబికఁ.

గిరవరకన్యయుం బ్రియసఖీసహితంబుగ బూవుదోటలో
దిరమగు భక్తి గోసికొని తెచ్చిన కమ్మని జాజిపూలు, సుం
దరకరపల్లవాంజలి నుదారత బూని, నపల్లవంబుగా
బురహరు పాదపద్మములముంగల జల్లె బ్రదక్షిణించుచున్.

పొలుపు లెసంగగా, నలనిముంగురులం గయిసేసికొన్న కో
మల నవకర్ణికారకుసుమంబు మనోహరకర్ణపల్లవం
బులు జతగాగ జాతి, పదపూజనమున్ జరిపింప, గౌరి, ని
శ్చలమగు భక్తిభావమున జాగిలి మ్రొక్కె శశాంకశేఖరున్.

భువననమస్కృతుం డయి, అపూర్వమహామహిమానుభావవై
భవుడగు వల్లభుం బడసి, బ్రాతి జగమ్ముల కన్నతల్లివై,
మిపుల యశంబు గాంచు మని, మీఱిన కూర్మి, ననత్యదోషముల్
దవులని నిండుదీవనలు దా నొసగెన్ శివు డద్రికన్యకున్.

ఇదియె యుమామహేశ్వరుల నేకము సేసి, త్రిలోకసౌఖ్యసం
పద పెనుపొంద జేయ, దగుపట్టని పొంగి మదమ్ముతోడ, న
మ్మదనుడు, మీటి లాగి పలుమా ర్మొరయించె ధనుర్గుణంబు ; న
య్యదియును మాఱుమ్రోసె దుహినాద్రితటంబున దేటిపాటలోన్.

జ్వలనముఖంబునందు శలభంబువలెం బడి మాడిపోవ, బూ
విలుతుడు, తీయవింట, గుఱివెట్టి త్రియంబకు నెమ్మనం, బుమా
లలితతనూలతాకలితలావణికంబున మంతరించుచున్,
బలువున నెక్కుపెట్టి పఱవం దలపెట్టె శిలీముఖంబులన్.

యమినై లోగొని యెల్ల యింద్రియము, లాత్మానందలీలానిమ
గ్నమనోవృత్తి దపమ్ము గొన్న విధురేఖామౌలికిన్ శూలికిన్,
హిమభూభృద్వరకన్య, కెందలిరుచేయిం జాచి, మందాకినీ
విమలాంభోరుహబీజమాలిక సమర్పించెన్ మహాభక్తితోన్.

తనపైనిం బ్రణయమ్ము సేయు జనులన్, దైవారగా గూరుముల్,
తిన కౌవారలుగా గ్రహించు శివు డద్దానిం గొనం గోరె ; ద
త్క్షణమే లెన్సయటం చమోఘముగ నాకర్ణాంతమున్ లాగి, అ
న్నసవిల్కాడును దీయవింట దొడిగెన్ సమ్మోహనాస్త్రం బొగిన్.

నడలంజాతి యొకింత ధైర్యము, మహేశానుండు, డెందంబులో,
నుడురాజోదయవేల వారినిధియ ట్లుప్పొంగుచుం, గ్రొత్తపో
కడలన్, బింబఫలాధరోష్ఠమగు శ్రీగౌరీముఖంబందు బ్రే
ముడి నిండారిన చూపులం బఱపె సమ్మోదంబు దీపింపగాన్.

శైలజ, మోవిపైని సరసస్మితముల్ దళుకొత్తగా స్ఫుర
ద్బాల కదంబకల్పసుఖద ప్రసితావయవాళితో రసో
ద్వేలసలీలభావమును వే వెలిబుచ్చుచు, నిల్చె, సాదరన్
వాలిచి, ఘోరమోహమున, త్రపాభరలోలవిలోచనాంతయై.

ఫణికులరాజభూషణుడు ఫాలవిలోచనుడా హరుండు ద
త్క్షణమ యడంచివైచి కలకంబడు డెందమునుం, దదీయకా
రణము నెఱుంగగోరి, గిరిరాజవనాంతరభూమి దత్పరా
యణుడయి చూపులం బఱపి నంతలపొంతల దిగ్విదిక్కులన్.

కాంచె హరుండు మ్రోల గుడికంటికొనం గదియించి ముష్టి, న
కుంచితవామపాదు డయి, కొంకక స్వాంసయుగంబు వంచి యొ
క్కించుక, మండలీకృత మహేక్షుధనుర్వరమందు లెస్స సం
ధించుచు బుష్పబాణములు, తీవలమాటున నున్న కామునిన్.

అనుపదమే, మహోగ్రమగు నాసనసీమముతో సుదగ్రమై,
కనలి, తపోవిఘాతమున గావలుడా వలరాజుపైని, బె
ల్చన నుదుకత్తి విచ్చు పురసంహరు మూడవకంటినుండి, వే
గనగన మండుచుం బ్రలయకాలమహానలకీల పెల్వడిన్.

అడలి భయంబునం, గినుక నాగుమ యాగుమ దేవ! శాంతినిం
దొడుగు మంటచు వేలుపుల తొట్రునోడుల్ దివి బాఱునంతలో,
నుడుగక, ఫాలవహ్నిశిఖ, ఒక్క క్షణంబున బూవువిల్తునిం
బొడ వడగించి కాల్చె వెలిబూడిద ప్రోవొనరించె నయ్యెడన్.

తొడరి సుదుస్సహాభిభవదోషవశంబున సంభవించి, పే
ర్పడి, సకలేంద్రియంబులను బట్టిన స్తబ్ధములం బొసర్చుచున్,
గడుగడు గ్రమ్ముమోహమున, గాముని పత్ని, మొఱంగదయ్యె బ్రే
ముడి చెలికానిపాటు నొక మూర్తము, పన్పడి బొమ్మపోలికన్,

అటులు తపోంతరాయ మనయమ్మున గూరిచినట్టి మన్మథుం,
బటపట విచ్చి పెచ్చరిలి పాఱిన కంటి కడిందిమంటలో
చిటచిట గాల్చి, శంకరుడు, ఛీ యని స్త్రీజనసన్నికర్ష మిం
కిట వలదంచు, దాటి చనె నెక్కటి నెల్లరచూపుజాడలన్.

తనకుం బ్రేముడి భంగపాటు, రతికిన్ దైన్యంబునుం, గాంచి పెం
చిన గారాముల తండ్రి కోరికలకుం జేడ్పాటు వాటిల్లె ని
ట్లని దుఃఖంబు, సఖిసమక్షమని యొయ్యన్ సిగ్గు, గ్రమ్మన్ మనం
బున శైలాత్మజ, చేరె నెట్లొ భవనంబున్ దీనయై శూన్యయై.

---

# కాళిదాస మహాకవి - చారిత్రిక సమస్యలు

శ్రీ పి. గణపతిశాస్త్రి

ఒక కవి కావ్యసమీక్ష చెయ్యవలసివచ్చినప్పుడు అతని జీవిత చరిత్ర కొంతవరకు ఆ సమీక్షకు సహాయకారి అవుతుంది. కాళిదాసువంటి మహాకవి కావ్యాలు పరిశీలించ దలుచుకొన్నవారికి ఈజీవిత చరిత్ర మరింత ఎక్కువగా సహాయకారి కాగలదు. ఈమహాకవి ఏ శతాబ్దంలో ఏ దేశంలో జన్మించాడు? తలిదండ్రు లెవరు? ఎక్కడ, ఎవరిదగ్గర చదువు కొన్నాడు? అతని జీవితం ఎల్లాగ నడిచింది? అని అనేక విధాలుగా మన కీ కవినిగురించిన ప్రశ్న పరంపరలు బయలుదేరతాయి. బహుశః ప్రాచీనులకు ఇలాంటి ప్రశ్నలు తోచలేదేమో!

ప్రాచ్య నాగరికతతోను, భాషలతోను పరిచయం కనిగినప్పటినించీ పాశ్చాత్య విద్వాంసు లనేకులు కాళిదాస మహాకవి చరిత్రాన్వేషణ సాగించారు; క్రమంగా భారతీయ విద్వాంసులు కూడా ఈ విషయమైన పరిశోధనలు జరిపారు. ఇంకా కొంద రీ విషయంలో తీవ్ర పరిశోధనలు చేస్తూనే ఉన్నారు. అయినా కాళిదాసకవి జీవితచరిత్రకు సంబంధించిన సమస్య లన్నీ చాలావరకు ప్రశ్నార్థకాలలాగే నిలిచిపోయాయి! బహుశః తన జీవిత చరిత్ర విషయంలో ఇంత తటస్థభావం వహించిన ఈ మహాకవి ఉదాసీనభావంలోనే జీవన చరిత రహస్యం ఇమిడిఉన్నదేమో? ఎవరు చెప్పగలరు! ముందుగా ఇప్పుడు కాళిదాసు మహాకవి కాలానికి సంబంధించిన సమస్యలన్నిటినీ వరసగా పరిశీలిద్దాము.

క్రీస్తుపూర్వం ఎనిమిదవ శతాబ్దం మొదలు కొని ఇంచుమించుగా క్రీస్తుశకం ౧౧ వ శతాబ్దివరకు జరిగిన ఆ యా శతాబ్దాలలో కాళిదాస మహాకవి జీవించిఉన్నాడని వేర్వేరు చరిత్రవిమర్శకులు వాదిస్తున్నారు. వీరు తమ తమ వాదాలకు అనుగుణమైన బలమైన ఉపపత్తులు కూడా చూపిస్తున్నారు.

బల్లాలసేనుడు తాను రచించిన భోజప్రబంధంలో కాళిదాసు, దండి, భవభూతి మొదలైన మహాకవు లందరూ ధారానగరాధిపతియైన భోజుని ఆస్థానంలో ఉన్నారని వర్ణించాడు. భోజుడు క్రీస్తుశకం ౧౧ వ శతాబ్దంలోనివాడు. బల్లాలసేనుని భోజప్రబంధవాక్యాలే నిజమైతే కాళిదాసు క్రీస్తుశకం ౧౧ వ శతాబ్దిలో జీవించి ఉండాలి.

కాని ఈపుస్తకం వట్టి పుక్కిటి పురాణం అనీ, దీనిలో చారిత్రిక సత్యా లంతగా లేవనీ చరిత్రకారులు నిశ్చయించారు.

బాణుడు. తన హర్ష చరిత్ర ప్రారంభంలోనే కాళిదాసుకవిత్వం ప్రశంసిస్తూ ఒకశ్లోకం రచించాడు

"నిర్గతాసు నవా కస్య కాళిదాసస్య సూక్తిషు
ప్రీతి ర్మధుర సాంద్రాసు మంజరీ ష్వివ జాయతే"

ఈ బాణభట్టు కనౌజ్ ను పరిపాలించిన హర్ష చక్రవర్తికి సమకాలీనుడు. ఈహర్షుడు క్రీస్తుశకం ౭ వ శతాబ్దిప్రారంభంలోని వాడని విశ్వసనీయమైన శాసనాధారం ఉన్నది. అందుచేత కాళిదాస మహాకవి ఆరవశతాబ్ది తరవాత కాలంవాడు కావడానికి వీలులేదు. ఈ కారణంచేతనే భోజప్రబంధంలోని గాథలన్నీ పట్టికట్టుకథ లని కొట్టివేయవలసి వచ్చింది.

## గుప్త సిద్ధాంతము

ఇంక ప్రాచ్య పాశ్చాత్యపరిశోధకులు చాలామంది కాళిదాసు విక్రమాదిత్యబిరుదం ధరించిన రెండవ చంద్రగుప్త చక్రవర్తి కాలంలో జీవించి ఉన్నాడని నమ్ముతున్నారు. ఈ చక్రవర్తి సుప్రసిద్ధమైన గుప్తవంశానికి చెందినవాడు.

ఇతడు తన రాజధానిని పాటలీ పుత్రాన్నించి ఉజ్జయినికి మార్చాడు. ఈచక్రవర్తి క్రీస్తుశకం ౩౭౫

మొదలుకొని ౪౧౩ దాకా తన సామ్రాజ్యం పరిపాలించాడు. కాళిదాస మహాకవి విక్రమాదిత్యుని ఆస్థానంలో ఉండేవాడనీ, అతని నివాసం ఉజ్జయిని అనీ శతాబ్దాల తరబడిగా ఒక జనశ్రుతి ఏర్పడింది. ఈ చంద్రగుప్త విక్రమాదిత్యుని పరిపాలనలో గుప్త సామ్రాజ్యప్రాభవం మహోజ్జ్వలంగా వెలిగింది. హైందవధర్మం అన్ని విధాలా దేశంలో నలుమూలలా విస్తరిల్లింది. తన కావ్యాల్లో ఎక్కువగా హైందవధర్మ ప్రాభవాన్నీ, సంప్రదాయాన్నీ అభివర్ణించిన కాళిదాస మహాకవి ఇంచుమించుగా ఈ చక్రవర్తి కాలంలోగాని, ఇతని కుమారుడైన కుమారగుప్తుని కాలంలోగాని జీవించి ఉండాలని చరిత్రకారు లూహాగానం చెయ్యడం ప్రారంభించారు. వీరే ఊహాగానాలకు తగినట్లుగా కాళిదాసగ్రంథాలనుండి కొన్ని కొన్ని స్ఫురణలుకూడా ఎత్తిచూపడం ప్రారంభించారు

కాళిదాసుని మేఘసందేశంలో యక్షుడు, మార్గం కొంచెం చుట్టుతిరుగుడు అయినా ఉజ్జయినీ నగరం దర్శించడం మానవలదని మేఘునికి ఆదేశిస్తాడు. అందుచేత కాళిదాసునికి ఉజ్జయినిమీద ప్రత్యేక పక్షపాతం ఉన్నదనీ, ఈ ఉజ్జయిని రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుని రాజధానిఅయిన ఉజ్జయినే అనీ చరిత్రకారులు స్థిరీకరించడం మొదలుపెట్టారు. కాళిదాసకావ్యాలలో అక్కడక్కడ కనబడే 'గోప్తా' మొదలైన శబ్దాలు కూడా తమ వాదాన్నే స్థిరపరుస్తున్నాయని ఈ 'గుప్తసిద్ధాంతవాదులు' విశ్వసిస్తున్నారు. కుమారసంభవం అనే కావ్యనామధేయం కూడా కుమారగుప్తుని జన్మసూచకం అయి ఉండవచ్చునని కూడా వీరు నమ్ముతున్నారు. కాళిదాసుని కావ్యాల్లోని అర్థ సంప్రదాయాలు, అశ్వమేధయాగాది వర్ణనలు సముద్రగుప్తుని అర్థధర్మ నిరతికీ అశ్వమేధయాగ నిర్వహణకు సూచకాలయి ఉండవచ్చునని వీరి వాదం.

ద్వితీయ చంద్రగుప్త విక్రమాదిత్యుడు తన రాజ్యం సుప్రతిష్ఠితం చేసిన తరవాత తనకు పూర్వం సుప్రసిద్ధుడయిన విక్రమాదిత్యుని బిరుదం ధరించాడనీ, కొన్నివందల ఏళ్లు వెనకకు జరిపి తనబిరుదంతో విక్రమశకం ప్రారంభించాడనీ ఈ గుప్త సిద్ధాంత వాదులు ప్రతిపాదిస్తున్నారు.

అదీగాక, కాళిదాసు తనకావ్యాలలో జామిత్రాది జ్యోతిశ్శాస్త్రపదాలు వాడాడు. ఈ జ్యోతిశ్శాస్త్రపదాలు గ్రీకుభాషా పదాలనీ, గ్రీకులనుండి మనవారీపదాలు స్వీకరించారనీ, అందుచేత కూడా కాళిదాసు బాగా ఇటీవలి కాలంవాడై ఉండాలనీ, కనకనే కాళిదాసమహాకవి గుప్తసామ్రాజ్యానికి సమానకాలీనుడై ఉండాలనీ, గుప్త సిద్ధాంత వాదులు విశ్వసిస్తున్నారు.

కాళిదాస మహాకవి కాలనిర్ణయంకోసం ఎక్కువగా శ్రమపడి ఈ గుప్త సిద్ధాంతం ప్రతిపాదించినవారు, జోన్స్, ఫెర్గూసన్, బెరిడేల్ కీత్ మొదలయిన పాశ్చాత్య సంస్కృత విద్వాంసులు. భారతీయ సంస్కృత విద్వాంసులు కూడా చాలామంది వీరి మార్గమే అవలంబించి యథాతథంగా దీన్ని విశ్వసిస్తున్నారు.

## విక్రమాదిత్య సిద్ధాంతము.

కాని కాళిదాసు ద్వితీయ చంద్రగుప్త విక్రమాదిత్యునికి సమకాలికుడై ఉండాలన్న వాదం సర్వులు అంగీకరించలేదు. కాళిదాసు విక్రమాదిత్యునికి ఆస్థానంలోని వాడనీ, అతడు ఉజ్జయినిని అలంకరించిన మహాకవి అనీ జనప్రవాదము, శతాబ్దాల తరబడిగా వచ్చే కవిపండిత ప్రవాదము, అనుశ్రుతం గావినిపిస్తున్నాయి. ఈ విక్రమాదిత్యుని శకం క్రీస్తు పూర్వం ౫౭ వ సంవత్సరంతో ప్రారంభం అవుతున్నది. కాళిదాసు ఈ విక్రమాదిత్యునికి సమకాలీనుడైతే అతడు క్రీస్తుపూర్వం ఒకటవ శతాబ్దానికి చెందినవాడై ఉండాలి. కాని చరిత్ర ప్రసిద్ధుడైన ఇలాంటి విక్రమాదిత్యు డెవడూ కనబడలేదని చరిత్రకారు లంటున్నారు. అందుచేతనే వీరిలో కొంతమంది చంద్రగుప్త విక్రమాదిత్యుడే ఈ విక్రమాదిత్యుడనీ, ఇతడే విక్రమశకం ప్రారంభించి దానిని కొన్ని వందల ఏళ్ల వెనకనించీ ఏర్పాటుచేశాడనీ ఊహింపసాగారు. కాని సుప్రసిద్ధుడయిన విక్రమాదిత్యుడనే వాడొక డుండకపోతే గుప్తవంశీయుడైన ద్వితీయ చంద్రగుప్తు డతని బిరుదం స్వీకరించడం ఎలాగ జరుగుతుంది? అందుచేత చరిత్రలో దొరకకపోయినా విక్రమాదిత్యు డనే సుప్రసిద్ధచక్రవర్తి ఒక డుండితీరాలనీ, అతని కాలంలోనే కాళిదాసు జీవించి ఉండాలనీ విక్రమాదిత్య సిద్ధాంతవాదులువాదిస్తున్నారు.

కాళిదాసకాలనిర్ణయంతో ఇంకొక క్లిష్ట సమస్య ఏర్పడింది. కుమారసంభవంలోని ౭వ సర్గలో పరమేశ్వర సందర్శనోత్సుకలైన స్త్రీలవర్ణనం కనిపిస్తుంది. ఇది చాలా మనోహరమైన వర్ణన. కాళిదాసు సరిగా ఈ వర్ణనశ్లోకాలే రఘువంశం అరవ సర్గలో కూడా వాడాడు. దీనినిబట్టి కాళిదాస మహాకవి కీ శ్లోకాలపైగల ఆదరం గ్రహించవచ్చును. అయితే ఈశ్లోకాలతో బాగా దగ్గిర పోలికలు కలిగిన శ్లోకాలు కొన్ని అశ్వఘోషుని బుద్ధచరితంలోని తృతీయసర్గలోకూడా కనిపిస్తున్నాయి. ఈ శ్లోకాలనుబట్టి కొందరు చరిత్రకారులు కాళిదాస కాలనిర్ణయం చెయ్యడానికి ప్రయత్నించారు.

సౌందరనందనము, బుద్ధచరితము మొదలైన కృతులు రచించిన ఈ అశ్వఘోషుడు, కనిష్కునికి సమానకాలికుడని చరిత్రకారులు స్థిరీకరించారు. అందుచేత అశ్వఘోషుని కాలనిర్ణయంలో అనుమానం ఏమీ లేదు. అయితే అశ్వఘోషుని కాళిదాసు అనుకరించాడా? కాళిదాసును అశ్వఘోషుడు అనుకరించాడా? అన్న ఒక ప్రశ్న వచ్చింది. కాళిదాసునే అశ్వఘోషుడు అనుసరించినట్లయితే కాళిదాసు అశ్వఘోషునికి సమకాలికుడో, అంతకు ప్రాచీనుడో కావాలి. అయితే ఈ విషయంలో కూడా చరిత్రకారులు వాదోపవాదాలు సాగిస్తూనే ఉన్నారు. కాళిదాసు గుప్తకాలంలోని వాడన్న గుప్తసిద్ధాంతవాదులు అశ్వఘోషుని శ్లోకాలు చూసి కాళిదాసీ ఈ శ్లోకాలు వ్రాశాడని అంటున్నారు. ఈ సిద్ధాంతం అంగీకరించని విక్రమాదిత్య సిద్ధాంతివాదులు కాళిదాసును చూసే అశ్వఘోషుడీ శ్లోకాలు వ్రాశాడని చెబుతున్నారు. దీనికొక బలవత్తరమైన కారణం ఉన్నది. కాళిదాసీ వర్ణనశ్లోకాలు తన కావ్యాల్లో రెండు చోట్ల వ్రాశాడు. అదీగాక ఈశ్లోకాలు కాళిదాస వర్ణనాఫణితికి చాలా దగ్గరగా ఉన్నాయి. అశ్వఘోషుని బుద్ధచరితంలో ఇవి అంతగా అతికినట్లు కనబడడం లేదు. అదీగాక కాళిదాసువంటి మహాకవికి శ్లోకాలలో అశ్వఘోషుని అనుసరించవలసిన అవసరం ఏమీ లేదు. అందుచేతనే విక్రమాదిత్యసిద్ధాంతవాదులు అశ్వఘోషుడే కాళిదాసును అనుసరించాడని గట్టిగా వాదిస్తున్నారు. కాని ఈ పోలికలు నిర్ణయించడంలో ఇద మిత్థమని గట్టిగా చెప్పడాని కేమీ వీలు లేకుండా ఉంది. అందుచేతనే గుప్తసిద్ధాంతవాదులు కాళిదాసే అశ్వఘోషుని అనుసరించాడని వాదించడం జరుగుతున్నది.

అయితే గుప్తసిద్ధాంతవాదులలో ఒక వాదదౌర్బల్యం కనిపిస్తున్నది. వీరు ద్వితీయ చంద్రగుప్త విక్రమాదిత్యుడే విక్రమశకం ప్రారంభించిన వాడని అంటున్నారు. ద్వితీయ చంద్రగుప్తుని తాత ప్రథమ చంద్రగుప్తుడు గుప్తశకం ప్రారంభించాడు. అలాంటప్పుడు ద్వితీయ చంద్రగుప్తుడు కొత్తగా వేరే ఒకవిక్రమశకం ప్రారంభించవలసిన అవసరం ఏమి కలిగింది? ఇతడు ప్రసిద్ధుడయిన తన తాతగారి ఎడల అంతభక్తి లేనివాడా? ఒకవేళ ఏదైనా కొత్తశకం ప్రారంభించదలుచుకున్న చక్రవర్తి తన పేరుతో శకం ప్రారంభం చేస్తాడుగాని ఎవరో ప్రాచీన చక్రవర్తి పేరుతో శకం ప్రారంభం చేస్తాడా?

పోనీ ఇదంతా ఇల్లాగే జరిగిందని అనుకుందాము. ద్వితీయచంద్రగుప్తుడే విక్రమాదిత్యుని పేరుతో శకం ప్రారంభించినప్పుడు అతని సమనంతర కాలీనులైనా ఈ విక్రమశకం వాడి ఉండాలి. కాని ఆ తరువాతి కాలపు స్కందగుప్తుని గిర్నార్ శిలాశాసనాలలో గుప్తశకమే కనబడుతున్నది. ఇంత సమీపకాలంలో ఇలాగ విక్రమశకం కనబడకపోవడం ఆశ్చర్యకరం కాదా? ఇంతేకాదు. ఈ విక్రమశకం క్రీస్తుశకం ౯వ శతాబ్దానికి పూర్వం శాసనాలలో ఎక్కడా కనబడడం లేదు. ద్వితీయ చంద్రగుప్త విక్రమాదిత్యుడే విక్రమశకం ప్రారంభించి ఉంటే తొమ్మిదవ శతాబ్దం దాకా ఇది ఉపయోగించక పోవడానికి కారణం కనబడదు. ఇక కాళిదాసు గ్రీకుపదాలకు సన్నిహితంగా ఉన్న పదాలు వాడినాడన్న సమస్య పరిశీలిద్దాము. భారతీయులకు క్రీస్తుకు బాగా పూర్వమే గ్రీకులతోను, వారిసంస్కృతితోను పరిచయం కలిగిందనీ,అందుచేత క్రీస్తుకుపూర్వం ఒకటవ శతాబ్దిలోని కాళిదాసీ పదాలు వాడడంలో వైరుధ్యం ఏమీ లేదనీ విక్రమాదిత్య సిద్ధాంతవాదులు చెబుతున్నారు.

ఇక విక్రమాదిత్యుని చారిత్రిక సమస్య. ఈ విషయంలో విక్రమసిద్ధాంతవాదులు ఇల్లాగ చెబుతున్నారు. విక్రమాదిత్యుడు అనే చక్రవర్తి ఒకడున్నాడని చారిత్రిక ప్రమాణాలు దొరకక పోవచ్చును. కాని ఇటు

వంటి వ్యక్తి లేడనే వ్యతిరేక చారిత్రిక ప్రమాణాలేవీ లేవు. అదీగాక కథాసరిత్సాగరంలో ఈవిక్రమాదిత్యుని అద్భుత కథ లనేకం కనిపిస్తున్నాయి. ఇతని ఉజ్జయినీ పరిపాలనను మొదలైన అద్భుతచర్యలు కూడా కథా సరిత్సాగరకథలలో కనిపిస్తున్నాయి. ఈకథా సరిత్సాగరము గుణాఢ్యుని బృహత్కథ ననుసరించి వ్రాయబడిన గ్రంథము. ఈ గుణాఢ్యుడు క్రీస్తుశకం ప్రథమశతాబ్దిలోని వాడని చరిత్ర చెబుతున్నది. అందుచేత కథా సరిత్సాగరంలోని విక్రమాదిత్య వృత్తాంతము చరిత్రమీద ఆధారపడి రచించినదే అయిఉండవచ్చును. ఈ విక్రమాదిత్యుడు పరమార వంశీయుడనీ, ఇతడు ఉజ్జయినిలో శోభాయమానంగా పరిపాలన సాగించాడనీ, గొప్ప శివభక్తుడనీ మ్లేచ్ఛ వినాశానికై భూమిమీద అవతరించాడనీ, అవైదిక మతా లన్నిటినీ నాశనం చేసి ఆర్షమతం తిరిగి ఉద్ధరించాడనీ, ఈయన పరిపాలనలో వేదమతం సురక్షితంగా ప్రబలిందనీ కథా సరిత్సాగరం పేర్కొంటున్నది. అందుచేత శైవాభిమానియైన మహాకవి ఈవిక్రమాదిత్యుని ఆస్థానంలో నివసించి ఉండవచ్చును. అదీగాక గుప్తవంశీయులు వైష్ణవ భక్తులని చరిత్ర నిరూపిస్తున్నది.

కాళిదాస కావ్యాలలో "అపాణినీయా లైన ప్రయోగా లనేకం కనిపిస్తున్నాయి. అందుచేత పాణినీయవ్యాకరణం బాగా ప్రచారానికి రానికాలంలో—అంటే క్రీస్తుపూర్వం ప్రథమశతాబ్ది ప్రాంతంలో—కాళిదాసమహాకవి జీవించి ఉన్నాడనే వాదమే సముచితంగా కనిపిస్తుంది. విక్రమోర్వశీయంలో విక్రమపదం కూడా ఈవిక్రమాదిత్యుని స్ఫురణకే ఎక్కువ ప్రోద్బలం ఇస్తున్నది. పరమార విక్రమాదిత్యుడు సూర్యవంశీయుడు. అందుచేతనే కాళిదాసు సూర్యవంశీయులైన రఘువంశ రాజుల చరిత్రరచన కుపక్రమించి ఉండవచ్చును. ఈ కారణా లన్నిటిచేత కాళిదాసమహాకవి క్రీస్తుపూర్వం ప్రథమశతాబ్దంలో ఉజ్జయినీ పాలకుడైన పరమార విక్రమాదిత్యుని కాలంలో జీవించి ఆచక్రవర్తి ఆస్థానం అలంకరించి ఉంటాడు.

సంగ్రహంగా ఇదే విక్రమాదిత్య సిద్ధాంత వాదుల వాదము. ప్రస్తుతం గుప్తసిద్ధాంతము, విక్రమాదిత్యసిద్ధాంతము ఇంకా వాదోపవాదాలు రేపుతూనే ఉన్నాయి. ఇంకా కొంత పరిశోధన జరిగితే తప్ప ఈవిషయంలో ఇదమిత్థమని నిర్ణయించడానికి వీలు లేదు.

## కాళిదాస నివాస దేశము

కాళిదాస కాలనిర్ణయంలో వాదోపవాదాలు ఏర్పడినట్లే అతని జన్మదేశ నిర్ణయంలో కూడా అనేకమైన చర్చలు బయలుదేరాయి. ఎక్కువగా కాశ్మీర పరిసరాల వర్ణన ఉండడంచేత కొందరు కాళిదాసు కాశ్మీరదేశీయు డంటున్నారు. గొప్పవారంతా తమ దేశంలోనే పుట్టాలి కాబట్టి వంగదేశీయులు మహాకవి మాదేశీయుడే అని బల్లగుద్ది చెబుతున్నారు! విదర్భ మాళవ దేశీయులుకూడా కాళిదాసు తమదేశీయుడే అని వాదిస్తున్నారు. కాళిదాసు మేఘదూతంలో ఉజ్జయినీ నగరం పైన, తత్పరిసర దేశంపైన కొంచెం పక్షపాతం చూపించి వర్ణించిన మాట వాస్తవమే. అంతకంటె కాళిదాస నివాసదేశం గాని, అతని చరిత్రకాని కొంచెమైనా నిర్ణయించే ఆధారాలేవీ కనబడవు. ఇదీ గాక సంస్కృతవాఙ్మయంలో కాళిదాస కవి నామంతో తొమ్మండుగురు కాళిదాసులు కనిపిస్తున్నారు. వీరివల్ల కాళిదాససమస్య మరింత క్లిష్టతర మైంది. ఈకాళిదాసులను గూర్చి ఇక్కడ వరసగా పేర్కొంటున్నాము.

౧. సేతుబంధకర్త. ఇతనికి మాతృగుప్త డనే నామాంతరం కూడా ఉన్నది. ఇతడు క్రీస్తుపూర్వం అరవ శతాబ్దపు వాడు.

౨. రఘువంశాది కావ్యాలు వ్రాసిన కాళిదాసు. ఇతడు క్రీస్తుపూర్వం ౫౬ లో ఉన్నవాడని ఊహింప బడుతున్నది.

౩. కోటిజిత్ అనే నామాంతరంగల మరి ఒక కాళిదాసకవి. ఇతడు కామకోటి పీఠాధిపతి శిష్యుడు. క్రీస్తుశకం ౫వ శతాబ్దిలోని వాడని తెలుస్తున్నది.

౪. పద్మగుప్తు డనే పేరుగల పరిమళకాళిదాసు. ఇతడు ధారానగర భోజునికి సమకాలీనుడు. నవసాహసాంక చరిత్ర మనే కావ్యం రచించాడు.

౫. నలోదయ మనే యమకకావ్యకర్త అయిన కాళిదాసు.

౬. చంపూ భాగవత కర్త నవకాళిదాసు.

౭. అక్బరీయ కాళిదాసు. అక్బర్ చక్రవర్తి సమకాలీనుడు.

౮. లంబోదర ప్రహసనకర్తగా ప్రసిద్ధిచెందిన కాళిదాసు.

౯. సంక్షేప శంకరవిజయ కర్త యైన అభినవ కాళిదాసు.

ఇంతమంది కాళిదాసులు ఉండటంవల్లనే కాళిదాస కాలనిర్ణయంలోను, చరిత్ర నిర్ణయంలోను క్లిష్టత ఏర్పడింది కాని, కాళిదాస రచిత కావ్యాల నిర్ణయంలో అంతగా క్లిష్టత లేదు. కాళిదాసు ప్రపంచ ప్రసిద్ధి గన్న మహాకవి. ఇతని రచనా పద్ధతికీ, సామాన్య కవుల రచనాపద్ధతికీ హస్తిమశకాంతరం కనిపిస్తుంది. అందుచేత లంబోదర ప్రహసనం వంటి అసభ్యవర్ణనలతో నిండిన గ్రంథం రచించిన కాళిదాసు మహాకవికాళిదాసు కానేరడని అతి సులభంగా నిర్ణయించవచ్చును. ఈవిధంగా కాళిదాసమహాకవి రచించిన వని పరిశోధకు లూ, పండితులు నిర్ణయించినవి ౭ కృతు లున్నాయి.

## కాళిదాస రచనలు

వీటిలో ౧ ఋతుసంహారము, ౨ రఘువంశము, ౩ కుమారసంభవము ౪ మేఘసందేశము. కావ్యాలు. ౫ విక్రమోర్వశీయము, ౬ మాళవికాగ్నిమిత్రము ౭ అభిజ్ఞానశాకుంతలము రూపకాలు.

వీటినిగురించి కూడా కొన్ని చిన్న చిన్న వివాదా లున్నాయి. మల్లినాథుడు మొదలయిన వ్యాఖ్యాతలు కొంతమంది కాళిదాసకావ్యాలను మూడింటికి వ్యాఖ్యలు వ్రాసి ఋతుసంహారానికి వ్యాఖ్యానం వ్రాయడం మానివేశారు. దీనినిబట్టి ఋతుసంహారం కాళిదాసకృతం కాదేమోనని కొందరికి అనుమానం. కాని శ్రీఅరవిందులవంటి ప్రఖ్యాతవిమర్శకులు ఈ కావ్యశైలి పరిశీలించి ఇది కాళిదాసమహాకవికృతమే ననీ, బహుశః ఇది ఆకవి ప్రాథమికరచన అయి ఉండవచ్చుననీ నిర్ణయించారు. ఇల్లాగే ప్రస్తుతం కుమారసంభవంలో కనిపించే ౧౭ సర్గలు కాళిదాసు రచించలేదనీ, వీటిలో ౮వ సర్గాంతంవరకు మాత్రమే మహాకవి రచించాడని ఒక వాదం ఉన్నది. విమర్శకులలో చాలామంది ఈ అభిప్రాయంతోనే ఏకీభవిస్తున్నారు. రఘువంశాన్నిగురించి కూడా ఇది అసంపూర్ణమనే అనుమానం ఒకటి ఉన్నది. కాని విమర్శకులందరు సంపూర్ణమనే అంగీకరిస్తున్నారు.

భోజప్రబంధంలోను, పండితులు చెప్పే ప్రాస్తావిక శ్లోకాలలోను కాళిదాసును గురించిన కట్టుకథలనేకం కనిపిస్తున్నాయి. ఈకట్టుకథలు నమ్మితే కాళిదాసు వేశ్యాలోలుడనే అభిప్రాయం కలగవచ్చును. కాని కాళిదాసరచనలు పఠించిన వారికా మహాకవి నిశితనైతికదృక్పథం స్పష్టంగా కనిపిస్తుంది. కాళిదాసు కవితలో ఎక్కడా సభ్యతావధులు దాటిన శృంగారాది వర్ణనలు కనబడవు. అందుచేత ఆలాతోకాలేని ఈకట్టుకథలన్నీ కొట్టి పారవేయవలసినవేగాని నమ్మవలసిన వేవీ వీటిలో కనబడవు.

అయితే ప్రపంచ మహాకవులలో పరిగణనీయుడైన కాళిదాసమహాకవి లేశమైనా తన చరిత్రస్మరణ కలగనీయక చరిత్రకారు లందరినీ ఇంతగా వేధించడానికి కారణమేమై ఉంటుంది? ఒకవిధంగా దీనికి సమాధానం చెప్పవచ్చును.

అసలు మన భారతీయ సంస్కృతిలో ఈ రోజుల్లో కనిపించే వ్యక్తి ప్రాధాన్య సమస్యఉన్నట్లే కనబడదు. మనవారు ధర్మాన్ని అతిక్రమించనంతవరకే వ్యక్తిస్వాతంత్ర్యము, ప్రాధాన్యము గౌరవించారు. ఏదైనా సంఘమర్యాదకు, ధర్మానికి ఇచ్చినంత గౌరవము మనవారు వ్యక్తి కీయలేదు. ప్రాచీనకాలంలో శిల్పులు, కవులు మొదలయినవా రెక్కువగా ఈ మర్యాదే అవలంబించినట్లు కనబడుతుంది. అందుచేతనే అజంతాగుహలలో మహాచిత్రాలు చిత్రించిన శిల్పులెవరూ ఆ శిల్పాల దగ్గర తమ నామసంకేతా లయినా లిఖించుకో లేదు.

అల్లాగే కాళిదాసమహాకవికూడా తన వృత్తాంతం వ్రాసికొని ఉండకపోవచ్చును. ఇక కాళిదాసమహాకవి ఉదాత్తగంభీరప్రకృతి కలవాడు కావడంచేత ఈవిషయంలో ఉపేక్ష వహించి ఉండవచ్చును. మన ప్రాచీనులకు చారిత్రక దృష్టి లేకపోవడం కూడా దీనికి ప్రోద్బలం ఇచ్చి ఉండవచ్చును.

## కుంతేశ్వర దౌత్యము

అయినా కాళిదాసమహాకవిని గురించిన విశ్వసనీయ విషయాలు ఒకటిరెండు లభిస్తున్నాయి. వీటిని

బట్టి ఆ మహాకవి జీవిత చరిత్రము, స్వభావము అతి స్వల్పంగా ఊహించవచ్చును. కుంతేశ్వరదౌత్య మనే కావ్యం కూడా కాళిదాసమహాకవి రచించాడని క్షేమేంద్రుడు తన ఔచిత్యవిచారచర్చలో వ్రాస్తున్నాడు. అయితే ఈకుంతేశ్వరదౌత్యం మన కిప్పుడు దొరకడం లేదు. విక్రమాదిత్యుడు కాళిదాసమహాకవిని కుంతలేశ్వరునిదగ్గరకు రాయబారిగా పంపించడమే దీనిలోని ఇతివృత్తమని ఊహించడానికి వీలవుతున్నది. అయితే ఇందులోని శ్లోకాలు రెండుమాత్రమే క్షేమేంద్రుని ఔచిత్యవిచార చర్చలోను, భోజదేవుని శృంగార ప్రకాశికలోను కనిపిస్తున్నాయి. వీటినిబట్టి కాళిదాసచరిత్రము, స్వభావము అతి స్వల్పంగా స్ఫురిస్తున్నవి.

విక్రమాదిత్యచక్రవర్తి కాళిదాసును కుంతలేశ్వరుని దగ్గరకు రాయబారిగా పంపించినప్పుడు కుంతలేశ్వరుడాకవి నెంతో గౌరవించి చక్రవర్తిరాయబారికి చెయ్యవలసిన రాజమర్యాదలు చేశాడట. కాని కార్యార్థియైన కాళిదాసకవి భూమిమీదనే ఆసీనుడైనాడట. అప్పైన కుంతలేశ్వరుడు ఇదేమని ప్రశ్నింపగా ఆమహాకవి ఈ క్రింది విధంగా సమాధానం చెప్పాడట.

"ఇహ నివసతి మేరుః
శేఖరః క్ష్మాధరాణాం
ఇహ వినిహిత భారాః
సాగరాః సప్త చాన్యే
ఇద మహిపతి భోగ
స్తంభ విభ్రాజమానం
అవనితల మిహైవ స్థాన
మస్మ ద్విధానాం!"

మేరువు, సప్తసాగరాలు ధరణీతలం మీదనే ఆసీనములైన వనిన్నీ, అహిపతి భోగ స్తంభ విభ్రాజమానమైన ఈ అవనితలమే అస్మదాదులకు స్థానమనీ మహాకవి సమాధానం ఇచ్చాడు! ఇదీ ఈ శ్లోకతాత్పర్యము. ఈశ్లోకాన్ని బట్టి అతని వినయము, గమయుడవము, సంభాషణ చాతుర్యము చక్కగా గ్రహించవచ్చును.

రాయబారం ముగించుకొని తిరిగివచ్చిన తరవాత విక్రమాదిత్య చక్రవర్తి కుంతలేశ్వరు డేమి చేస్తున్నాడని కాళిదాసును ప్రశ్నించాడట. దానిపై కాళిదా సీ విధంగా సమాధానం చెప్పాడట.

"అసకల హసితత్వాత్
క్షాళితా నీవ కాంత్యా
ముకుళిత నయనత్వాత్
వ్యక్త కర్ణోత్పలాని,
పిబతి మధుసుగంధీ
న్యాననాని ప్రియాణాం
త్వయి వినిహిత భారః
కుంతలానా మధీశః

"నీపై భారం మోపి కుంతలాధీశ్వరుడు మధువుచే పరిమళించే ప్రియురాంద్ర ముఖపానంతో మైమరచివాడు" అని దీని తాత్పర్యము.

ఈ రెండు శ్లోకాలలో మొదటిది క్షేమేంద్రుని ఔచిత్యచర్చలో ఉదాహృతమైనది. రెండవది భోజదేవుని శృంగార ప్రకాశికలోను, రాజశేఖరుని కావ్యమీమాంసలోను కూడా కనిపిస్తున్నది.

ఈ శ్లోకాల రచనాశైలి పరిశీలిస్తే ఇవి కాళిదాస శ్లోకాలనే అనిపిస్తున్నాయి. అయితే ఇంతమంది చరిత్రకారులు పరిశ్రమించినా కాళిదాసమహాకవిని గురించి మనకు లభించిన వ్యక్తిగత విషయాలీరెండు శ్లోకాలలోనే ఉన్నాయి!

ఎప్పటికైనా కుంతేశ్వరదౌత్యం లభిస్తే అది కాళిదాసచరితాన్వేషణకు, చరిత్ర పరిశోధకులకు బాగా సహాయకారి కాగలదేమో!

వ్యక్తి చరిత్ర మనకు లభించకపోయినా, అజరామరమైన ఆ మహాకవి దివ్యాత్మ సప్తర్షిగణంలా మెరిసే అతని సప్తకృతులలోను జాజ్వల్యమానంగా ప్రతిఫలిస్తూనే ఉన్నది!

# కొరియా - గతచరిత్ర

●

శ్రీ జి. ఆంజనేయశర్మ

ఈనాడు, మొన్న మొన్నటి దాకా లోకచరిత్రలో అజ్ఞాతంగా వున్న కొరియా వైపు మళ్లింది ప్రజ దృష్టి. మూడవ మహా ప్రపంచ సంగ్రామ నిర్ణయం కొరియా భవితవ్యంపై ఆధారపడిన మాట నిర్వివాదాంశం.

మొదట కొరియా దేశాన్ని పరిశీలిద్దాం. ఉత్తరాన మంచూరియా, సైబీరియాలు, తూర్పున జపాను సముద్రము, దక్షిణాన కొరియా జలసంధి, పడమట పసుపు సముద్రముగా గల కొరియా దేశ వైశాల్యం ౮౫,౨౮౬ మైళ్లు. జనసంఖ్య ౨ కోట్ల ౪౩ లక్షలు. సూర్యుడు జపాను దేశంలో ఉదయించి, తన ప్రాతః కాలపు అరుణ కిరణాలను కొరియా మీద ప్రసరింప జేస్తాడు. కొరియాని "ప్రశాంత ప్రాతః కాలపు దేశము" అంటారు. మొదటి సారిగా రోడ్లు, రైళ్లు ౧౯౨౮ సంవత్సరంలో పెంపొందినవి. పది వేల మైళ్ళ పొడవున రోడ్లు, పదునెనిమిది వందల యిరువది ఒక్క మైళ్ళ రైలు మార్గము, యిరువది ఒక్క వేల అయిదు వందల తొంబది మూడు మైళ్ళ పొడవున తంతి మార్గములతో దేశము కోర్కెల్లతున్నది. అయినను దేశాంతర్భాగంలో ప్రయాణ సౌకర్యములు తక్కువ అనియే చెప్పవలెను. ఇంకా దేశంలోని పెద్దనదులకు ఆనకట్టలు కట్టగాలేదు. ఇటీవలి పట్టణాల అభివృద్ధి జరుగుతూంది. గ్రామీణ జీవితం సుఖ భూయిష్టమని చెప్పలేము. నాగరికత ప్రాచీనమైన దగుటచే దాని ప్రాబల్యము ఇంకనూ దేశాన్ని వీడ లేదు.

కొరియా నాగరికతలో చీనా సంస్కృతి చిహ్నాలు ఎక్కువగా గోచరిస్తాయి. కొరియా శిల్పంలో కూడ చీనా నీడలు లేక పోలేదు. అయినా కొరియా ప్రత్యేకత సుస్థిరంగా వుంది. ఈ నాడు కొరియా ప్రజలలో రాజకీయ, వైజ్ఞానిక, సామాజిక చైతన్యం ఒక విప్లవ రూపం దాల్చ బోతూంది. నివురు గప్పిన అజ్ఞానము తనపట్టును ఇంక సాధించలేదనే చెప్పాలి. నేడు కొరియా కవులు జాతిపునరుజ్జీవనానికి అంజలి ఘటించి కావ్యనిర్మాణం కొనసాగిస్తున్నారు. కొరియా యువకులు నూతన చైతన్యంతో తమ ప్రతిపత్తిని, హక్కుల్ని సాధిస్తున్నారు. కొరియాలో ఇటీవలవరకు కన్‌ఫూషియన్ సంప్రదాయపీడితులైన రాజకీయ వాదులను, అభ్యుదయ వాదులు సవాలు చేస్తున్నారు ఈనాడు, చోయినాయ్‌సన్, స్వాతంత్ర్యపుహక్కును ప్రకటించిన వీరుడు. పీక్యాంగ్ మూ అనే నవలాకారుడు, పార్కు యన్ సిక్ అనే చరిత్రకారుడు. నూతన కొరియా భాషా వికాసానికి కారకులు. క్రైస్తవ మత ప్రచారకులు కొరియా విద్యా బోధనలో ప్రాముఖ్యత వహించారు. కాని వారి ముఖ్యోద్దేశం మతప్రచారం అయినంత కాలం వారు కొరియా ప్రజాభ్యుదయాన్ని జయించలేరని ఋజువైంది. కొన్ని ప్రాంతీయ జిల్లాలలో మత ప్రచారకుల పాఠశాలలు వినా గత్యంతరం లేని సమయాలు వున్నవి. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం, నూతన విద్యాబోధన ప్రవేశ పెట్టబడింది. ద్వితీయ ప్రపంచ యుద్ధానికి పూర్వమే దాదాపు అయిదు లక్షల మంది క్రైస్తవులు దేశంలో ఉండేవారు. జపానీయులు వారికి చాలా ఆటంకాలను నిబంధనలను విధించి బాధించారు.

పది పదునాలుగవ శతాబ్దముల మధ్య బౌద్ధ మతము కొరియాలో ప్రజల వ్యాప్తి గాంచినది. తరువాత మూడు శతాబ్దముల వరకు దాని ప్రాబల్యము విశేషంగా ఇనుమడించలేదు. తరువాత కన్‌ఫ్యూషియన్ సిద్ధాంతము బాగా అమలు లోకి వచ్చి, రాజ ప్రాముఖ్యతని పొందినది. ఇప్పటికి కొరియా నైతిక విశ్వాసానికి ఆ సిద్ధాంతము ఆధార భూతమని యే విశ్వసించ వలయును. పాశ్చాత్య పు హక్కులు దాదాపు మన వున్నటు వంటివే. వారిలో దయ్యాల విశ్వాసము లేక పోలేదు. అయినా కాలం తెచ్చే మార్పుల్ని ఆనందంగా ఆహ్వానిస్తూ తమ వికాసానికి అయత్త పడుతున్నారు.

కొరియా విశిష్ట నాగరికత, మూఢులైన

మంగోలు వారి దురాక్రమణకు ౧౩ వ శతాబ్దంలో గురి అయింది. మరు శతాబ్దంలో మంగోలుల నిర్గమ నాంతరము 'యి' రాజ్యం ఏర్పాటైనా, చాల కాలం 'మింగ్సు' చైనా ప్రభుత్వ ప్రాబల్యం వల్ల ౧౯ వ శతాబ్దం వరకు కొరియా తేరుకొన లేదు.

కొరియా వారు శారీరకంగా అటు చీనావారిని గాని, జపానువారినిగాని, పోలియుండరు. వారి శరీరనిర్మాణానికి ఒక ప్రత్యేక విశిష్టత వున్నది. జుట్టు, కండ్లు నలుపు, కంచును బోలిన రంగు జాతి సాంప్రదాయము. కాని ఇటీవల వరకు స్త్రీలు హక్కులు లేక హీనస్థితిలో వున్నారు. బహు భార్యాత్వము ఆమలులో లేకపోయినా, వ్యభిచారము దేశంలో వుందని చెప్పాలి. వారి భాషని "అన్‌మన్" అని అంటారు. ఉత్తమ సాహిత్యము, ప్రభుత్వ పరిభాష ౧౮౯౪ దాకా చైనా భాషలో జరిగినా, ఆ తరువాత ఒక రకమైన మిశ్రమ భాష ఆధారంగా వ్రాయబడుతున్నది.

ఇంక కొరియా రాజ్యాంగ చరిత్ర పరిశీలిద్దాం. ఏడవ శతాబ్దంలో, అంత వరకు జపానుల అధీనంలో వున్న కొరియా రాజ్యాన్ని షిల్లా చక్రవర్తి, చైనా టాంగ్ రాజ్యమద్దత్తుతో స్వాధీనం చేసుకున్నాడు. తరువాత పదవ శతాబ్దంలో, ఉత్తర కొరియా రాష్ట్రమైన "కొరాయ్" లో బయలు దేరిన విప్లవంద్వారా ఒక నూతన రాజ్యాంగం ఉద్భవించింది. క్రీస్తుశకం (౯౧౮—౧౩౯౨) దాకా ఈ రాజ్యాంగం నిలిచి వున్నది. ఈ కాలంలో శిల్పం, విశిష్ట స్థానాన్ని ఆక్రమించింది. పదునైదవ శతాబ్దం అంత్యకాలంలో చైనీయులు కొరియాని స్వాధీనం చేసుకొన్నారు. "శిటజ" అనే రాజకీయ వేత్తను పరిపాలకునిగా నియమించి నామ మాత్రమైన పరిపాలన కొనసాగించారు. తరువాత కొరియా ఒక విచిత్రమైన స్వపరిపాలన అనుభవించిందనే చెప్పాలి. కొరియా రాజుల పాలనలో మొట్టమొదట ఉత్పన్నమైన కన్‌ఫ్యూషియ నిజం, అటుపిమ్మట వచ్చిన బౌద్ధమత ప్రాబల్యానికి క్షీణించి పోయింది. ఫలితంగా అనేక విహారాలు దేశంనిండా వెలిసినవి. తిరిగి పదునారవ శతాబ్దంలో జపానీయుల ఆక్రమణకు కొరియా పాలైంది. ఇది దాని ప్రాచీన నాగరికతని చిన్నాభిన్నం చేసింది. జపానీయుల ప్రాబల్యం రాను రాను తగ్గిపోయినా చైనా వారి రాజకీయ ప్రాబల్యం కొరియాకి ఎక్కువైంది. చీనా, జపాను, రష్యాల మధ్య ఉండటం చేత దానికి రాజకీయ ప్రాముఖ్యత ఎక్కువై ఒక 'బఫర్' రాజ్య ప్రాధాన్యత పొందినది. అందువలననే తన భద్రతకు ఒక తాటస్థ్యవిధానాన్ని కొరియా అనాదిగా అనుసరిస్తూ వచ్చింది. ఈ విధానం ౧౮౯౪-౯౫ చీనా జపానుల మధ్య జరిగిన యుద్ధం వల్ల అంతమొందింది. కొరియా జపాను వైపు మొగ్గాల్సి వచ్చింది, అనివార్యంగా. ఎందుకంటే అంతకు పూర్వమే కొరియాలో జపాను వాణిజ్యాదులు సుస్థిరంగా పాతుకొని పోయాయి. రష్యా, జపానుల మధ్య ౧౯౦౪-౧౯౦౫ లలో జరిగిన యుద్ధంలో జపాను వారు విజయం పొందారు. కొరియా పూర్తిగా జపాను అధికారం క్రిందకు వచ్చింది. ఒక జపానీస్ గవర్నర్ జనరల్ కొరియా పాలనకి నియోగింప బడినాడు. అప్పుడు కొరియా ఇంపీరియల్ హౌస్ లోని సభ్యులకు జపాను బిరుదులు యివ్వబడినాయి. ౧౭ నవంబరు ౧౯౦౫లో సియోలు లో జరిగిన సంధి ప్రకారం కొరియనులకు కొంత అధికార ప్రదానం జరిగి, విదేశాలలో కూడ కొరియా ప్రాతినిధ్యం నెలకొలప బడింది. అప్పుడు సియోలులో 'రెసిడెంట్ జనరల్' ప్రతిపత్తితో ఒక జపాను అధికారి నియమింప బడినాడు. ౧౯౦౭ లో అతడి అధికారాలు ఇనుమడించబడి, కొరియా ప్రభుత్వం, అతడి సంప్రదింపులకు చెవి ఒగ్గాల్సి వచ్చింది. ఆగస్టు ౨౨, ౧౯౧౦ లో జరిగిన సంధి ప్రకారం, కొరియా ప్రభువు తన అధికార, రాజరికాలను జపాను ప్రభువుకు ధారా దత్తం చేయటం జరిగింది. కాని మొదటినుంచీ, స్వాతంత్ర్య ప్రియులైన కొరియనులకు ఇతరుల పీడిత పాలన యెడల వైముఖ్యము, ద్వేషము వుంటనే వున్నాయి. ఆపీడిత జనితప్రతీకారం ఈ నాడు. కొరియనులను విప్లవ వీరులను చేసినది. పదు నెనిమిదవ శతాబ్దంలో, తరువాత జపాను వారు జరిపిన కిరాతక కృత్యాలవలన వారిలో ఒక ద్వేష భావము ప్రజ్వరిల్లుతునే వుంది. ౧౮౯౫ లో జపానువారు కుతంత్రంచేసి కొరియా రాణి 'మిన్' ను హత్యచేశారు. తదుపరి౧౯౦౭,౧౯౧౯ సంవత్సరాలలో జరిగిన విప్లవాలు నిర్దాక్షిణ్యంగా అణచి వేయబడినవి. కొరియా ప్రభువును యువరాజు ప్రతిపత్తికి తగ్గించి వేసినారు. జపాను గవర్నరు జనరల్ పూర్తి అధి

కారం తీసుకొనుట జరిగినది. కొరియాని అంత ర్భాగాలు చేయటం, తద్వారా రాష్ట్రాలు ఏర్పడటం జరిగింది. రాష్ట్రాధిపతులుగా జపానీయుల నియామకం జరిగి పూర్తిగా స్వాతంత్ర్యం కొరియాలో విలయ నృత్యం చేసింది.

౧౯౧౯ లో శాంతియుతంగా కొరియాలో విప్లవం జరిగింది. వారి స్వాతంత్ర్యపు హక్కును జపాను ప్రభుత్వానికి సమర్పించారు. అప్పుడు జరిగిన పారిస్ సభలో ఈ ప్రస్తావన తేబడ్డది. ఫలితంగా వేలకొలది కొరియనులు జైళ్ళకు పంపబడ్డారు. రాజ్యాంగ చట్టాలలో మార్పులు తీసుకు రాబడ్డవి. స్కూలు ఉపాధ్యాయులు యూనిఫారం ధరించటం కాని, కత్తులు అవీ ఉంచుకోవటం కాని నిషిద్ధం చేయబడ్డాయి. దినపత్రికలకు మాత్రం డిసెంబరు ౧౯౧౯ లో నుంచి జనవరి ౧౯౨౦ దాకా ప్రచురణకు అనుమతిచ్చారు. తరువాత జరిగిన ఆందోళన ఫలితంగా జపానీయులు తమ నిరంకుశ పాలనని కొంత సడలించాల్సి వచ్చింది. కొంతమంది కొరియా విద్యార్థులు ఇతర దేశాలకువిద్యాభ్యాసనకై పంపబడ్డారు.

౧౯౨౩ లో ఒక పెద్ద భూ కంపము కొరియాని కలచి వైచింది. కొరియాలో దరిద్రం తాండవించి విప్లవ చిహ్నాలు జపాన్ అధికారులకు గోచరించాయి. అప్పుడు జపాను వారికి గలిగిన ద్వేషభావ ఫలితంగా టోకియోలోను, ఇతర జపాను ప్రాంతములలోను దాదాపు తొమ్మిది వేల మంది కొరియనుల దారుణ హత్యాకాండ జరిగినది. జపాను పరిపాలనలో ఇట్టి దారుణ ఫలితాలు ఎన్నో వున్నా కొంత మేలు జరగక పోలేదని చెప్పాలి. విద్యా న్యాయశాఖల్లో కొన్ని ఉత్కృష్టమైన మార్పులు అమలులోకి వచ్చాయి. రోడ్లు రైల్వేలు నిర్మించబడినాయి. పారిశ్రామిక పురోభివృద్ధి జరిగింది. కాని ఈ పురోభివృద్ధి జపానువారి స్వలాభంతో కూడుకొనినది కావడంతో దాని ప్రాముఖ్యత కించపడింది. కొరియా వారిని అజ్ఞానాంధకారంలో వుంచి, వారి జీవనానికి తగ్గఆదాయాన్ని సైతంపొందనీయకుండా చేయడంజరిగింది. ఆ నాడు జపాను వారు అమలు జరిపిన ప్రచారాన్ని తమపై విశ్వాసం పెంపొందించుకోమని చేసిన ప్రచారాన్ని కొరియా పెడచెవిని బెట్టింది. రష్యా, అమెరికాల వంక ఆశాజనకంగా చూసి అసంతృప్తి చెందింది. ఇతర రాజ్యాలకి కొరియా ఒక అంతర్గత సమస్యగా గోచరించింది. ద్వితీయ సంగ్రామానంతరం, కొరియాకి స్వాతంత్ర్యప్రదానం "కొరియా ప్రణాళిక" ప్రకారం జరిగింది. దానిలో రష్యా, అమెరికా, బ్రిటన్, చైనాలు పాల్గొన్నాయి.

ఇటీవల ౧౯౪౫ లో కొరియాలో కొంతభాగం రష్యా ఆక్రమణ క్రిందకి వచ్చింది. కొరియా ఉత్తరాన రష్యా ప్రాబల్యం క్రిందకి దక్షిణాన అమెరికా ప్రాబల్యం క్రిందకి వచ్చింది. అమెరికా ప్రాంతంలో రెండు రాజకీయ పక్షాలు ఉద్భవించాయి. వారిలో వామ పక్షీయులైన ప్రజానాయకులు, ధనికులైన కన్సర్వేటివ్‌లు వున్నారు. కాని ఈ రెండు పార్టీలు స్వాతంత్ర్యం తమహక్కుగా ఆదిలో ప్రకటించారు. ౧౯౪౭ లో ఒక కమీషన్ అమెరికా, రష్యా ప్రతినిధులతో ఏర్పడి రాజ్యాంగ నిర్ణయ హక్కు విషయం చర్చించింది. ఒక ప్రాంతీయ రాజ్యపాలన తాత్కాలికంగా నెలకొల్పబడి అయిదు సంవత్సరాలలో సంపూర్ణ స్వాతంత్ర్య ప్రదానం జరగాలని నిర్ణయించబడింది. కాని స్వాతంత్ర్య ప్రియులైన కొరియనులకు ఈ విలంబన ఆశనిపాతంగా తోచి, సత్వరస్వాతంత్ర్యానికి ఆందోళన జరిపారు. ౧౯౪౫ లో రష్యా ఉత్తరకొరియాని ఆక్రమించి నప్పటినుండి అచ్చట రాజకీయ చైతన్యం మిన్నుమిక్కిలిగా వృద్ధి చెందింది. "కిమ్ ఇల్ సంగ్" అనే జాతీయ వీరుడు కొరియా విప్లవ నాయకు డయ్యాడు. మాస్కో అడుగు జాడల్లో నడిచే యాబాంగ్ అధ్యక్షు డయ్యాడు. వామ పక్షీయులకు ఈ ప్రజా ఉద్యమం రష్యా ప్రోద్బలంతో దక్షిణ కొరియా యుద్ధానికి కారణమైంది. దానికి తోడు సింగ్మన్ రీ దక్షిణ కొరియాలో సాగించే రాక్షస పరిపాలన మరింతగా యుద్ధాన్ని వుసి గొల్పింది.

ఈ నాడు ఏ ప్రజానాయకులకు విజయంకలుగుతుందో నిర్ణయించ లేని సమస్య ఉత్పన్నమైంది. రష్యా, అమెరికా ప్రపంచాధిపత్యం కోసం చెరోవైపు శాంతి దేవతని లాగు తున్నంతకాలం సుస్థిర శాంతికి అవకాశం లేదు. నిజమైన ప్రజాస్వామ్య నిర్ణయం ఆ రాజ్య ప్రజలకి కారణ రహితంగా వదిలి వేయనంత కాలం అశాంతి, అంతః కలహాలు తప్పవని, చరిత్ర ఋజువు చేస్తోంది. ఈ మహో పరిశోధన కొరియాపై జరుగుతోంది. ఈ నాడు ఆ పరిశోధనా ఫలితాల కోసం మనం ఎదురు చూడాల్సిన సమయం ఉత్పన్నమైంది. ఎందుకంటే ఒక నాడు ఆ సమస్య మనం ఎదుర్కోవాల్సిన అవసరం వస్తుంది కనుక.



# జార్జి బెర్నార్డు షా అస్తమయం

విశ్వవిఖ్యాత కవి, జార్జి బెర్నార్డుషా, 94 వ ఏట, నవంబరు రెండవతారీఖున, తెల్లవారుఝామున, ఎయొట్ సెంటులారెన్సుపల్లెలోని తన స్వగృహంలో, ప్రశాంతంగా అసువులు విడిచాడు.

ఆంగ్లరచయితలలో షేక్సుపియర్ తర్వాత ఇంతటి నాటకరచయిత లేడన్న కీర్తి నార్జించుకొన్నాక, ఉజ్జ్వలంగా ప్రపంచరచయితల కగ్రస్థానంలో నిలిచి, అర్థ శతాబ్దకాలం, నిత్యచైతన్యంతో మనసులు

కొంటూ, తన నోట వచ్చిన మాటల్లా, పసిడి పలుకుగా, సారస్వతంలో శిలాక్షరంగా నిలిచిపోయేటట్టు, సరస్వతీప్రసన్నమయిన, ధన్యజీవితం గడుపుకొన్నాడు.

“రచన లేని దినమంటూ జీవితంలో ఉండకూడదనే సూత్రానికి చాలా సమీపస్థంగానే నా జీవితం గడుపుకోగలిగాను”, అని సత్యసమ్మతంగా చెప్పుకోగలిగాడు.

1856 జూలై 26న జన్మించాడు, 1950 నవంబరు 2న తనువు చాలించాడు. ఒక శతాబ్దపు మానవజీవితపు ప్రౌఢవయః కాలంనుంచి, మరుచటి శతాబ్దపు మానవ జీవితం నడిమింటి నందుకొనేదాకా, మానవజాతి ఏగతిని పురోగమిస్తుందో, ప్రత్యక్షంగా గమనించగలిగాడు. ఆ పురోగమనానికి, బాట వేసి, నడిపించటంలో, తన కృషిని నిమగ్నం చేసి, ఆ కృషిలో, సఫలీకృతుడు కాగలిగాడు.

షా తన నాటకాలద్వారా సంఘాని కిచ్చిన సందేశాలను, వేళాకోళాలుగా అందుకొన్న సమాజము, నిజంగా ఆ బోధకు అనుగుణ్యంగా, తనకు తెలియకుండానే, తనను దిద్దుకొన్నది. ఏ ఫలితాలను ఉద్దేశించి, తన నాటకాలను, రచనలను షా సాగించాడో, తన సంఘంలో ఆ ఫలితాలు చాలమటుకు, షా తన జీవితకాలంలోనే కంట చూడగలిగాడు.

దుర్భరదారిద్ర్యంలో జీవితం గడిపి, మానవప్రకృతిని ఆమూలంగా అవగతం చేసికోగలిగాడు. సౌభాగ్యవంతమైన పరిస్థితులను స్వయంకృషిచే సిద్ధింపచేసుకొని, కలకదేరిన నిండుమనస్సుతో కూడా మానవ ప్రకృతిని, అర్థంచేసికోగలిగాడు. మానవ స్వభావంలోని స్వర్గపాతాళాలను రెంటినీ తరచి చూచాడు. ఆ మానవతత్వాలనన్నిటినీ, ఆకర్షణీయంగా, ప్రతిభావంతంగా, తన నాటకాలలో సృష్టించి, నాటకాలాడించి చూపి, సాటిమానవుని అవగాహన చేసుకోటంలో, సౌహార్ద్రతను అలవర్చుకోవటం, సంఘానికి నేర్పాడు. సంఘజీవులలో సౌజన్యస్వభావం పెంపొందటానికి, తన రచనలతో సోపానాలు నిర్మించాడు.

ఎంతటి భీషణసత్యాన్నైనా, సునిశిత హాస్యధోరణిలోనే, ప్రజలకు అర్థమయేటట్లు చెప్పి, కావ్యఆనందం కల్పిస్తూనే, సంఘవిషయంలో నూతనదృక్పథాన్ని ప్రేక్షకులకూ, శ్రోతలకూ, పఠితలకూ, సర్వులకూ కల్పించాడు.

షా వేదాంతి, వ్యాసుడు, నాటకకారుడు. సంఘసంస్కర్త, ఆర్థికవేత్త, మహావక్త, చతురవచోవిలాసి, సర్వ లలితకళా విమర్శకుడు. ప్రతిఒక్క రంగంలోనూ ప్రముఖుడై, అగ్రేసరుడై కీర్తి గడించాడు. ఇంతటి బహుముఖమైన కీర్తి కూడా, కాలవశమై చెక్కుచెదరకుండా, లోకంలో శాశ్వతంగా నిలువగలిగిన మహాపురుషత్వాన్ని 94 ఏండ్ల జీవితంలోనూ సుస్థిరంగా సాధించగలిగి, కాలాతీతజీవుడయ్యాడు.

ఈశ్వరుని, ఉత్కృష్టస్వరూపంలో భావించి, తన సాహిత్య కృషిద్వారా ఈశ్వరుని ఆరాధించగలిగాడు షా. ఈశ్వరుడాతని ఆత్మకు శాంతి గల్గించుగాక.

కథానిక :

# ఆహుతి



మూలం : శ్రీ ప్రమథ్ చౌదరి
అనువాదం : శ్రీవేలూరి తారకం

ఇప్పటి కింకా మా ఊరిమీద పాశ్చాత్యనాగరికత దూము చెయ్యలేదు. రైలుమార్గంకూడా మా ఊరిచాయల రాకుండా బహుదూరాన్నుంచే పక్కకు తొలగిపోయింది. నేటికీ, కలకత్తానుంచి మా ఊరికి వెళ్లాలంటే ఇక్ష్వాకులనాటి వాహనాల మీదనే చాలాభాగం ప్రయాణం చేయవలసి ఉంటుంది– వర్షాకాలంలో పడవప్రయాణం, శీత గ్రీష్మాల్లో మేనాసవారి. ఈ భూమార్గ జలమార్గాలు రెండూ ఎదురుబదురుగా గాక, వేరువేరు దిక్కులు పట్టిపోతాయి. నాకు మామూలుగా మా ఊరు పడవ చేసుకుని పోవటమే అలవాటు. అందుచేత ఈ భూమార్గంతో చాలాదినాలవరకు గాని పరిచయం కలగలేదు. నేను బి. ఏ. ప్యాసయిన సంవత్సరం జ్యేష్ఠమాసంలో ఏదో జరూరుపనిమీద ఒకసారి దేశం వెళ్లవలసి వచ్చింది. ఆఋతువులో మా ఊరికి భూమార్గాన ప్రయాణంచేయటం వినా గత్యంతరం లేదు. ఈ ప్రయాణంలో జరిగిన విచిత్రసంఘటనలనే యిప్పుడు చెప్పబోతున్నాను.

పొద్దున ఆరుగంటలబండికి స్టేషన్లో దిగి చూసేవరకు, నాకోసం ఓ మేనా బోయీలు సిద్ధంగా ఉన్నారు. మేనా చూడబోతే, ఎప్పుడెందులోకి వెళ్లి కూచుందామా అన్న ఆరాటం కలిగేఅంత సౌఖ్యాయని కంగా లేదు. కంటితో ఉజ్జాయిస్తే, ఆ మేనా ఒక చిన్నరమూరల వెడల్పు, మూడుమూరల నిడివీ కన్న, ఎక్కువ ఉన్నట్లు కనిపించలేదు. దీనికితోడు బోయీల వాలకంచూతును గదా వాళ్లమీంచి చూపులు తిప్పుకోలేక పోయినాను. ఇంత అస్థిచర్మావశిష్టులైన మనుష్యులు ఇంక ఏదేశంలోనైనా అయితే అనుపత్రుల్లోనే గాని కనిపించరను కుంటాను. ఇంచుమించు పంజరంలో ప్రతిఎముకా బయటకి కనిపిస్తూనే ఉంది. కాళ్లూచేతులూ, మాంసం ఎండిపోయి, తాళ్లుబారి ఉన్నాయి. వీళ్ల శరీరాల్లో ఒకేఒక అంగం—అంటే మరేమీ కాదు వాళ్లపొట్టలు—విపరీతంగా ఊరిపోయి విచిత్రమైన తళ తళలుపోతూ ఉన్నాయి. నేనుపయానా డాక్టర్ని కాకపోయినా వీళ్లపొట్టల్ని చూడగానే ప్లీహమూ పిత్తకోశమూ భయంకరంగా పెరిగిపోయాయని గ్రహించాను.

బృహదారణ్యకోపనిషత్తులో, అశ్వమేధంలో బలియిచ్చే అశ్వంగురించి "యకృచ్చ క్లోమానశ్చపర్వతాః" అని వ్రాసిఉన్న మాటలు జ్ఞాపకం వచ్చినై. ప్లీహము, యకృత్తూ, అనే మాంసపిండాల్ని, పర్వతాల్తో ఉపమించటంఅ సంగతం కాదని ఆవేళ మొదటిసారిగా నాకు ప్రత్యక్ష ప్రమాణం కనిపించింది. మనుష్యునిశరీరం జవసత్తువలుడిగిపోయి అందహీనంగా తయారవటంలో ఏపరాకాష్ఠకి పోవటానికి వీలుందో ఆ తుదిమేరను కళ్లారా చూసి లోలోపల సిగ్గులో కుంగిపోయాను. ఈ రకమైన దేహం మానవత్వానికి మూర్తీభవించిన అవమానం. మా గ్రామంలోని హిందువుల వీరత్వం ఈదేహాలనే ఆశ్రయించుకుని ఉంటోంది. వీళ్లు జాతివల్ల అస్పృశ్యులైనప్పటికీ హిందువులే— శరీరాలు అశక్తమైనప్పటికి వీరులు. వీళ్లకి వేట పరంపరాగతమైన కులవృత్తి. బరిసెలతో అడవిపందులని వేటాడటం, పులుల్ని కర్రలతో అదిలించి తరిమికొట్టటం, వీళ్ళకి నిత్యకృత్యం. ఇదంతా పొట్టపోసుకోటానికే కాదా అంటే, అవును, నిజమే మరి!

కొంటూ, తన నోట వచ్చిన మాటల్లా, పసిడి పలుకుగా, సారస్వతంలో శిలాక్షరంగా నిలిచిపోయేటట్టు, సరస్వతీప్రసన్నమయిన, ధన్యజీవితం గడుపుకొన్నాడు.

"రచన లేని దినమంటూ జీవితంలో ఉండకూడదనే సూత్రానికి చాలా సమీపస్థంగానే నా జీవితం గడుపుకోగలిగాను", అని సత్యసమ్మతంగా చెప్పుకోగలిగాడు.

1856 జూలై 26న జన్మించాడు, 1950 నవంబరు 2న తనువు చాలించాడు. ఒక శతాబ్దపు మానవజీవితపు ప్రౌఢవయః కాలంనుంచి, మరుచటి శతాబ్దపు మానవ జీవితం నడిమింటి నందుకొనేదాకా, మానవ జాతి ఏగతిని పురోగమిస్తుందో, ప్రత్యక్షంగా గమనించగలిగాడు. ఆ పురోగమనానికి, బాట వేసి, నడిపించటంలో, తన కృషిని నిమగ్నం చేసి, ఆ కృషిలో, సఫలీకృతుడు కాగలిగాడు.

షా తన నాటకాలద్వారా సంఘానికిచ్చిన సందేశాలను, వేళాకోళాలుగా అందుకొన్న సమాజము, నిజంగా ఆ బోధకు అనుగుణ్యంగా, తనకు తెలియకుండానే, తనను దిద్దుకొన్నది. ఏ ఫలితాలను ఉద్దేశించి, తన నాటకాలను, రచనలను షా సాగించాడో, తన సంఘంలో ఆ ఫలితాలు చాలమటుకు, షా తన జీవితకాలంలోనే కంట చూడగలిగాడు.

దుర్భరదారిద్ర్యంలో జీవితం గడిపి, మానవప్రకృతిని ఆమూలంగా అవగతం చేసికోగలిగాడు. సౌభాగ్యవంతమైన పరిస్థితులను స్వయంకృషిచే సిద్ధింపచేసుకొని, కలకదేరిన నిండుమనస్సుతోకూడా మానవ ప్రకృతిని, అర్థంచేసికోగలిగాడు. మానవ స్వభావంలోని స్వర్గపాతాళాలను రెంటినీ తరచి చూచాడు. ఆ మానవతత్వాలనన్నిటినీ, ఆకర్షణీయంగా, ప్రతిభావంతంగా, తన నాటకాలలో సృష్టించి, నాటకాలాడించి చూపి, సాటిమానవుని అవగాహన చేసుకోటంలో, సౌహార్ద్రతను అలవర్చుకోవటం, సంఘానికి నేర్పాడు. సంఘజీవులలో సౌజన్యస్వభావం పెంపొందటానికి, తన రచనలతో సోపానాలు నిర్మించాడు.

ఎంతటి భీషణతత్వాన్నైనా, సునిశిత హాస్యధోరణిలోనే, ప్రజలకు అర్థమయేటట్లు చెప్పి, కావ్యఆనందం కల్పిస్తూనే, సంఘవిషయంలో నూతనదృక్పథాన్ని ప్రేక్షకులకూ, శ్రోతలకూ, పఠితలకూ, సర్వులకూ కల్పించాడు.

షా వేదాంతి, వ్యాసుడు, నాటకకారుడు. సంఘసంస్కర్త, ఆర్థికవేత్త, మహావక్త, చతురవచోవిలాసి, సర్వ లలితకళా విమర్శకుడు. ప్రతిఒక్క రంగంలోనూ ప్రముఖుడై, అగ్రేసరుడై కీర్తి గడించాడు. ఇంతటి బహుముఖమైన కీర్తి కూడా, కాలవశమై చెక్కుచెదరకుండా, లోకంలో శాశ్వతంగా నిలువగలిగిన మహాపురుషత్వాన్ని 94 ఏండ్ల జీవితంలోనూ సుస్థిరంగా సాధించగలిగి, కాలాతీతజీవుడయ్యాడు.

ఈశ్వరుని, ఉత్కృష్టస్వరూపంలో భావించి, తన సాహిత్య కృషిద్వారా ఈశ్వరుని ఆరాధించగలిగాడు షా. ఈశ్వరుడాతని ఆత్మకు శాంతి గల్గించుగాత.

ఈ బతుకుజీవాల ఋజాలమీద ఎక్కి ఇరవై మైళ్లు ప్రయాణం చేయాలనేసరికి నామనస్సు మొదట్లో తిరగబడ్డది. ఈ జీర్ణశీర్ణ జీవన్మృత హత భాగ్యుల దేహాలమీద నా శరీరాన్ని మోపటం మహా పచార మనిపించింది. మేనాలో ఎక్కడానికి నేను వెనకాడటంచూసి నన్ను తీసుకుపోవటానికి మాయింటి నించి వచ్చిన ముస్లిం నిఘామాను నవ్వుతూ "ఎక్కండి బాబూ మరేం, ప్రయాసకాదు. పొద్దెక్కి పోతోంది. ఇంకా ఆలస్యం చేస్తే నాలుగుగంటల్లోపల ఇల్లు చేరుకోలేం" అన్నాడు. పదికోసులదూరం వెళ్లడానికి పదిగంటలు పడుతుందని వినేవరకు మేనాలో ఎక్కి కూచోవాలనే ఆరాటం ఎక్కువైందని చెప్పలేను. ఒక్కసారి రామనామస్మరణ చేసుకుని మంజేతుల మీద మోకాళ్ళమీద పారాడుతూ ఆ కావిడిపెట్టె లోకి ఎల్లాగైతేనేం దూరి కూచున్నాను. ఇంతలోపల మనుష్యులమీద స్వారి చెయ్యటం, పాపం కాదని నన్ను నేను నచ్చగొట్టుకున్నానని వేరుగా చెప్పక్కర్లేదు. ఆ మాటకొస్తే నా ఒక్కడిగురించే ఎందుకనుకోవాలి? ఈ లోకంలోని ధనవంతులంతా దరిద్రులమీద స్వారీ చేసేకదా జీవయాత్ర సాగిస్తున్నది. ప్రపంచంలో పూర్వంకూడా ధనవంతులు కొద్దిమందీ, దరిద్రులు బహుమంది ఉండేవారు. ఇప్పుడూ ఎప్పుడూ, కూడా అల్లాగేఉంటారు. ఇల్లా ఉండటమే బాగుంది. పొలిటికల్ ఎకానమీవల్ల మనం నేర్చుకోగల నీతి ఇంత కన్నా ఏమిటి! అంతఃకరణని ఊరుకోబెట్టటానికి మనం నేర్వని విద్య లేదు!

మేనా నడవటం మొదలు పెట్టింది. అయ్యగారికేం కష్టం కలగదని సర్దార్జీ ఆశచెప్పాడు. కాని ఆ ఆశ కేవలం ధిలాసా మాత్రమే అని గ్రహించటానికి ఎన్నో క్షణాలు పట్టలేదు. అయ్యగారి స్వస్థశరీరం ఇదివర కెప్పుడూ యింత వ్యతివ్యస్తం కాలేదు. అందులంలో కుదించుకూచునే ప్రయత్నంలో నాశరీరం పడ్డ అవస్థని ఏం అవస్థ అనాలో తెలియదు; పడుకోటా నికీ, కూచోటానికీ మధ్యఉండే నానారకాల అవస్థా భేదాల్ని నేను పడ్డాను. ఈ ఉతుకుష్టంలో వెన్నెము కను కాస్త సరిదీసుకుందా మనుకోగానే మేనా టాపు వచ్చి తలకు టపీమని కొట్టుకుంటుంది. వీట న్నిటి ఫలితంగా నేను, పెద్దల సమక్షంలో కులవధువు మల్లే నతశిరస్సుతో, కుబ్జపృష్ఠంతో, ఒదిగి ఉండవలసి వచ్చింది. నాభిపద్మంమీద మనస్సు లగ్నంచెయ్య టానికి ఇంతటి సదవకాశం మును పెన్నడూ నాకు లభించలేదు. కాని అనభ్యాసదోషంవల్ల విక్షిప్తమై పోయిన నాచిత్తవృత్తిని సంక్షిప్తం చేసి నాభివివరం లోకి ప్రవేశింప చేయలేకపోయాను.

శరీరం పడుతున్న ఈ విచిత్రావస్థలకి నే నాట్టే వ్యస్తత చెందలేదు. అప్పుడు నాకు నవయౌవనం. ఎటు వంటి విపరీతావస్థలోనైనా స్వాస్థ్యాన్ని నిలుపుకునే శక్తి అప్పటికింకా నాలో ఉంది. పైగా నిజంచెప్పా లంటే నా దేహంయొక్క వికృత అంగంభంగిమల్ని వెర్రిచేష్టల్ని చూస్తూఉంటే నాకే నవ్వుపుట్టు కొచ్చింది. తూర్పుదిశనించి క్రమక్రమంగా వ్యాప్తి స్తున్న ప్రభాతకాంతీ, మెలిమెల్లిగా వీతెంచుతున్న మందమారుతాలూ, నామనస్సుని, సుఖతన్మయంచేశాయి. రాత్రి వేగటంతోపాటు, సర్వఅంగాలా, నాసమస్త చైతన్యమూ, మేల్కొంది. బైటి దృశ్యంకేసి రెప్ప వేయకుండా చూస్తూకూచున్నాను.

నలువైపులాఅంతులేని ఎడతెగని మైదానాలు. పచ్చని చెట్టుగాని చేమగాని చూపు ఆనినంతలో ఎక్కడా కనపడడంలేదు. మిత్రుపల్లాలు లేని మైదానం; ఆకాశంవలెనే శూన్యం; బాధాబంధన సమతలమైన, సమరూపమైన విహీనం. కాష్ఠాల తోనూ ఇటికలతోనూ నిర్మించిన కలకత్తాకొంప ల్లోంచి వచ్చిన నా అంతరాత్మ, ప్రకృతి యొక్క ఈ అసీమ ఉదారత మధ్య, విముక్తి పొంది ఎన్నడూ లేని ఆనందాన్ని అనుభవించింది. నా మనస్సునుండి అన్ని ఆలోచనలు అన్ని చింతలు తొలగిపోయి, ఆ మనస్సు కూడా ఆ ఆకాశం వలెనే నిర్వికారమై ప్రసన్నరూపం ధరించింది. అందులో ద్యోతకమవుతున్నదల్లా ఆనందంయొక్క ఈషత్ రక్తిమ శోభమాత్రమే.

కాని ఈ ఆనందం స్థాయీభావాన్ని అందుకో లేకపోయింది. పొద్దు ఎక్కుతున్నకొద్దీ ప్రకృతి వంట్లో జ్వరంకాసిపోస్తున్నదాఅన్నట్లు, ఎండ తీక్షణంగాకాసి పొయ్యటం మొదలుపెట్టింది. చూస్తూండగానే ఎండ 105 డిగ్రీల తైక్ష్ణ్యానికి హెచ్చింది. తొమ్మిది గంట లయ్యేవరకు బయటికి తేరిచూడడమే అసాధ్యమై పోయింది. వెలుతురుకి కళ్లు బైర్లుకమ్మటం మొదలు పెట్టినై. ఎక్కడన్నా పచ్చని వస్తువేదన్నా కనబడు

తుందేమో నని నాకళ్లు ఆత్రంతో దిగంతాంతరాలు వెదకులాడినై. ఎత్తుపల్లాలుగాని చెట్టుచేమలుగాని లేని ఈ అంతులేని మైదానం, పైన నిప్పులు చెరుగుతున్న నీలిఆకాశం ఈ రెంటిమధ్య క్రమంగా ఏదో విరాట అవసాదమూర్తియొక్క విశ్వస్వరూపం అవతారం తాలుస్తున్నట్లు గోచరించ నారంభించింది.

ప్రకృతిలోని ఈ సమతల సమరూప సమ శూన్యత్వాన్ని నా కళ్లు భరించలేకపోయినై. పుస్తకం తీసి చదవటానికి ప్రయత్నించాను. కూడా మెరిడిత్ "ఇగోయిస్టు" తెచ్చుకొన్నాను. అందులో చివరి అధ్యాయం ఇంకా చదవాల్సిఉంది. ఒకటి రెండు పేజీలు తిరగేసి చూస్తే చివరి అధ్యాయమూ మొదటి అధ్యాయమూ నాకు ఒకలాగే కనిపించినై. అంటే ఒక్క అక్షరంముక్క కూడా నా బుర్రకు ఎక్క లేదు. మేనాసవారి ఊపుకి కడుపులో తిప్పుతోంది. పుస్తకం మూసేసి సవారివాళ్లని కాస్త నడక హెచ్చించమని బతిమాలాను. బక్షీసు ఆశకూడా చూపటంతో ఫలితం వెంటనే కనిపించింది. మజిలీ చెయ్యాల్సిన గ్రామం పొద్దున్న పదిన్నరకల్లా, అంటే అనుకున్నదానికన్నా అరగంట ముందుగా, చేరుకున్నాం.

భోజనాలూ అవీ పూర్తికానిచ్చుకుని అర గంటలో మళ్ళీ బయలుదేరాం. మేనా పెళ్లినడకగా సాగింది. అతిభోజనంఫలితంగా భోయీలనడక నిండు నెలల చూలాలికిమల్లే మృదుమందర మయింది. క్రమంగా శ్లేష్మమానపు మిట్టమధ్యాహ్నపు ఎండవల్లా మేనాతాలూకు ఉయ్యాల ఊపువల్లా నాకోవిధమైన మైకం వచ్చింది. కాని ఆ మైకం అదమరిచిన నిద్ర కాదు. శరీరం కూర్చోటమూ పడుకోటమూ కాని సందిగ్ధావస్థలో ఎట్లా పడిఉందో మనస్సుకూడా సుషుప్తికీ జాగరణానికీ మధ్యస్థమైన అవస్థలో అట్లా పడిఉంది. ఇంతలో హఠాత్తుగా మేనా దేంతోనో దభీమని కొట్టుకొన్నట్లై అదిరిపడి లేచాను. ఆ దెబ్బ నాదేహంలో షట్చక్రాల్నీ భేదించుకొని సహస్రారాన్ని అంటింది. లేచి చూస్తే విశేషం మరేమీ లేదు.

భోయీలు ఒక ప్రకాండమైన వటవృక్షంకింద మేనాని కుదేసి ఎక్కడికో అదృశ్యమైపోయినారు. ఏమిటని సర్దార్జీని అడిగితే వాళ్లు కొంచెం పొగతాగి రావటానికి వెళ్లారని చెప్పాడు. ప్రయాణం ప్రారంభించిన తర్వాత కళ్లు చల్లబడేదృశ్యం అంటూ తగలటం ఇదే మొదలు. ఆ వటవృక్షం ఒక్కటే వెయ్యి వృక్షాలపెట్టు. నాలుగువేపులా సందులేకుండా ఊడలు దిగివున్నై. సూర్యరశ్మి దిగటానికివీలులేకుండా ఆకులు చెట్టుపైన అల్లిబిల్లిగా అల్లుకుపోయాయి. బహు దూరం ఎండనిబడి వచ్చే బాటసారులకు మార్గాయాసాన్ని తీర్చటంకోసం ప్రకృతి స్వహస్తాలతో వేసిన చలివేంద్రం యిది. చెట్టుచుట్టూ పరుచుకున్న నీడల్ని చూసి సూర్యాస్తమయం అవుతోందని భ్రమపడ్డాను. కాని గడియారం తీసిచూస్తే అప్పుడు యింకా ఒంటిగంటన్నా కాలేదు.

అతికష్టంమీద మేనాలోంచి విడిపించుకుని బయట పడ్డాను. నాశరీరం కొన్ని అంగాలకి తిమ్మిరి, యింకొన్ని అంగాలకి కొంకర్లు, మరికొన్ని అంగాలకి పక్షవాతం, కమ్మి, ఆపాదమస్తకం మొద్దుబారిపోయింది. అవయవాలని స్వాధీనంలోకి తెచ్చుకున్న తర్వాత ఒకసారి చెట్టుచుట్టూ తిరిగివద్దామని బయలుదేరాను. కొంతదూరం వెళ్ళిచూస్తే సవారివాళ్లంతా ఒకచోట సమికూడి వాళ్లల్లో వాళ్లు ఏదో తర్జనభర్జనలు పడుతున్నారు. కొంపతీసి వాళ్లంతా నామీద సమ్మెగిమ్మె ఏమైనా చెయ్యటానికి కుట్రపన్నుతున్నారేమోనని నాకు మొదట భయం వేసింది. ఒకళ్లమాటలు ఒకళ్లకి వినపడకుండా అంతా కలిసి ఒకేసారిగా మహోత్సాహంతో ఉపన్యాసాలు దంచుతున్నారు. కాని కాస్త పరకాయించి చూతునుగదా ఈ చాంచల్యానికంతకీ వేరే కారణం ఉందనిబోధపడింది.

వీళ్లు ధూమపానం చేస్తున్న వస్తువ వట్టి పొగాకు కాదు. వీళ్ల పరిభాషలో చెప్పాలంటే అది "పెద్ద పొగాకు." ఎంత దూరానికైనా దాని వాసన ఇట్టే తెలిసిపోతుంది. ఒక్కొక్కళ్ళే చిలుముగొట్టం తీసుకుని హృదయదఘ్నంగా దమ్ములాగుతున్నారు. దమ్ములాగి "ఓంకాళీ, కలకత్తావాలీ" అంటూ పొగతోపాటు హుంకారాలు విడుస్తున్నారు. చిలుముగొట్టం యింత పొంకంగా యింత వత్రువగా ఉంటుందని నేను పూర్వం ఎరగను. మాదకతకి ఆధారమైన వస్తువ సుందరంగా ఉండాలనే

జ్ఞానం వీళ్లకూడా ఉంది! మొదట్లో వీళ్ల ఈ ధూమపానోత్సవం చూస్తూఉంటే వినోదం కలిగింది. కాని చూడగా చూడగా అది విరక్తికింద మారిపోయింది. చిలుముమీద చిలుము, చిలుముమీద చిలుముగా కాల్చిపారేస్తున్నారు. ఎంతసేపు చూసినా ఎవళ్లకీ లేవాలనే ఆలోచన ఉన్నట్టు కనపళ్లేదు. వీళ్ల గంజాయితాగుడు ఎప్పటికి పూర్తి అవుతుందని సర్దారుని అడిగాను. "బాబుగారూ, లాభంలేదు. వీళ్ల నిక రెక్కపట్టుకు లాక్కొస్తేగాని రారు. ముందు దోవంతా భయంభయంగా ఉంటుంది. అందుచేత గంజాయి తాగి యిలా మనస్సుకి ధైర్యం తెచ్చుకుంటున్నారు."

"ఏమి టాభయం ?"

"బాబూ, ఆ భయానికి పేరు లేదు. కొస్త ఆగితే మీకే తెలుస్తుంది."

విని అదేమిటో చూడాలనే కుతూహలం మిక్కటమై పవారివాళ్లను కదలదీయటంకోసం నేనే స్వయంగా వెళ్లాను. ఇంతకుముందు లివర్ ప్రభావంచేత పసుపుపచ్చగా ఉన్న వాళ్లకళ్లు, ఇప్పుడు సున్నం కలిపినట్లు ఎఱ్ఱని ఎరుపుకి తిరిగినై. ఒకొక్కళ్లనే చెయ్యిపట్టుకుని నుంచోపెట్టాల్సి వచ్చింది. దాని ఫలితంగా కొంత గంజాయి. నా ముక్కుల్లోకి కూడా పోయి ఒళ్ళు తిరగటం, గుడ్లు పీక్కుపోవటం మొదలుపెట్టింది. అక్కడ ఇక ఒక్క క్షణమున్నా నిలవకుండా పారిపోయివచ్చి మేనాలో కూర్చున్నాను. మేనా మళ్ళీ కొంతసేపటికి నడవటం మొదలుపెట్టింది. ఈసారి మేనాలో దూరటం నాకంత కష్టమనిపించ లేదు. ఏమంటే అప్పటి నా అవస్థలో ఈ శరీరం మరెవరిదోలాగా తోచింది.

కొన్ని నిమిషాల తరవాత—సరిగ్గా ఎంతసేపు తరవాతో చెప్పలేను—వాహకులంతా కలిసి ఉచ్చైస్స్వరంతో చీత్కారం చెయ్యటం మొదలుపెట్టారు. వీళ్లకి కాళ్లల్లో జోరుకన్నా కంఠంలో జోరు ఎక్కువని మొదటనే గ్రహించాను. గాని రెంటికీ తారతమ్యం యింత ఉందని నే ననుకోలేదు. వాళ్ల ఈ గోలలోంచి ఒక్కమాట నాకు స్పష్టంగా వినిపించింది. రామనామం. క్రమంగా మా నిఘామాను కూడా వాహకులతో గొంతుకలిపి "రామనాం సత్యహై, రామనాం సత్యహై" అంటూ వరస అందుకున్నాడు. అది విని నేనొక శవాన్ననీ, ఏవో భూతాలు నన్ను మేనామీద వేసుకొని ప్రేతపురికి తీసుకొ పోతున్నయ్యనీ నాకు చప్పున అనుమానం కలిగింది.

ఈ అనుమానం కలగటానికి నా ఉదరస్థమైన గంజాయి పొగ ఎంతవరకు కారణమో చెప్పలేను. ఈ ప్రేతాలు నన్ను ఎక్కడికి తీసుకుపోతున్నయో తెలుసుకోవాలనే ఆరాటం ఉండబట్టలేకపోయాను. కళ్ళు నులుముకొని మేనాలోంచి బయటికి పరకాయించి చూశాను. ఊళ్లో కొంపలంటుకున్నప్పుడు ఆకాశం ఆ పెనక పెనకా ఎల్లా సొరవేసుకు పోతుందో అల్లా ఆదిక్కునుంచి ఈదిక్కుకి ఆకాశంఅంతా ఏకటీరుగా భగభగ మండిపోతోంది. మృత్యువుయొక్క అటల శాంతి సర్వ ప్రపంచాన్నీ ఆచ్ఛాదించినట్లుగా సమస్త భూప్రపంచం శబ్దరూపరసగంధ హీనమై నిస్తబ్దంగా ఉంది. మేనా కొంత దూరం ముందుకు సాగిపోయిన తరవాత చూతును గదా సమ్ముఖంలో ఒక మరుభూమి—యిసుకతో కూడినది కాదు—ఎఱ్ఱమట్టితో. అమట్టె రక్తచందనం లాంటిది. దానిమీద ఎక్కడా ఒక్కగడ్డిపరక కూడా లేదు.

ఈఎఱ్ఱమట్టిమీద యిప్పుడు మనుష్యులు నివసించడంలేదు. కాని పూర్వం నివసించేవారనడానికి చిహ్నాలు అక్కడంతా అసంఖ్యాకంగా చెదజల్లివున్నయి. అది ఒక ఇటికల రాజ్యం. చూపు అనినంతవరకు ఒకే యిటికలు—యింకా యిటుకలు. ఒక్కొక్కచోట అవి రాసులురాసులుగా పోసుబడి ఉన్నై. మరి కొన్ని చోట్ల వేలకు వేలుగా అక్షరలక్షలుగా నేలమీద చెదజల్లిఉన్నై. కొత్తగా స్రవించిన రక్తం అప్పటికప్పుడు గడ్డలు కట్టినట్టుగా ఉన్నాయి ఆ యిటుకలు. అంతర్ధానమైపోయిన ఆ జనపదంలోంచి ఆకాశంలోకి ఏవో చెట్లు దూసుకుపోతున్నాయి. కాని వాట్లో ఒక్కదానిమీద కూడా ఆకు అనేది పేరుకైనా లేదు. అన్నిటివీ మొండితలలు. అన్నీ ఎండి మోడుబారిఉన్నయ్. ఈ వృక్షకంకాళాలు, ఒకొక్కచోట సంపులుకట్టి ఒకొక్కచోట దూరంగా విసిరి పారేసినట్టూ, ఒకటీ, అరా ఉన్నయి. ఆ యిటుకలూ ఆమట్టీ ఆకాశంలో ప్రతిఫలించి

ఈ దిగంచలం నించి ఆ దిగంచలంవరకు రక్తవర్ణమైన అగ్నిజ్వాలలు అలుముకున్నట్లు, కనిపించింది. ఈ దృశ్యం చూసి నేనే భయంతో శోషించి పోయా నంటే పామరజనులైన ఈమేవాసవారీవాళ్ళమాట చెప్పేదేమిటి ?

ఉన్నట్టుండి ఆ అసీమనిస్తబ్దం లోంచి ఒక అతి క్షీణమైన క్రందన ధ్వని నాచెవులకి సోకింది. ఆ కాతర క్షీణస్వరంలో మానవుని యుగయుగాంతరాల వేదన సంచితమై కరుడుగట్టుకొన్నట్లనిపించింది. ఈ క్రందనస్వరం విని నాహృదయం ఏదో చెప్పలేని కరుణావేశంతో వ్యథితమైపోయింది.

ఇంతలో హఠాత్తుగా ఝంఝూమారుతం లేచింది. రివ్వురివ్వన సుడులు తిరుగుతూ గాలి నాలుగు వైపులనుంచి గజిబిజిగా విసిరికొట్టటం ప్రారంభించింది... [see note] వీయటం మొదలు పెట్టింది. ఆ తుపానుదెబ్బకి ఆకాశంలో మంటలు వెర్రిగా పరవళ్ళు తొక్కుతూ పరుగులుతీయటం మొదలు పెట్టినై. ఆకాశంలోని ఆ వెఱ్ఱిటేగంగలో తుపాను ప్రభవించినట్లయింది; తుపాను కెరటాలు వేసుకుంటూ దశదిశలకు ఉరవడించిపోతోంది! ఇంతలో ఆ అగ్నిప్రవాహంలో అసంఖ్యాక నరనారీ జనుల ఛాయలు హాహాకారాలు చేసుకుంటూ కల వరంగా కలగదొక్కుకుంటూ కనిపించాయి. ఈ చోద్యంఅంతాచూస్తూ ప్రభంజనం మరింత ఆనందంతో హోహో, హుహూహూ, అని ఈలలు వేసుకుంటూ చిందులు తొక్కటం మొదలు పెట్టింది. క్రమంగా ఈ శబ్దాలన్నీ ఒకదానితో ఒకటికలిసిపోయాయి. గుండెగడ్డ గట్టుకపోయేటట్టు ఒక భయంకరమైన అట్టహాసం వినిపించింది. ఆహాస్యంలోని క్రూరవికటధ్వని దిగ్దిగంతాలవరకు తెరలు తెరలుగా వ్యాపించిపోయింది. ఆ నవ్వు క్రమంగా క్షీణమై, క్షీణతరమై, మళ్లీ ఆ వెనుకటి మృదు కరుణ కాతర క్రందనధ్వనిగా మారిపోయింది. ఆ వికట అట్టహాసం, ఈ కరుణ క్రందనం విని నామనస్సులో పల ఈ ధ్వంసపురినిగురించిన పూర్వస్మృతులు మేలుకొన్నై—ఆ స్మృతులు ఈ జన్మవో లేక పూర్వ జన్మవో నేను చెప్పలేను. నాలోని ఎవరో ఈగ్రామం యొక్క చరిత్ర యిల్లా గుసగుసలుగా చెప్పినట్లయింది...............

ఈ మరుభూమిలోని ఈ యిటుకలు పెళ్లు రుద్రపురి ధ్వంసమయిపోగా మిగిలిన అవశేషాలు. రుద్రపురివాస్తవ్యులైన రాయివంశీయులు ఒకప్పుడు ఈవైపున ఉన్న జమీందారు లందర్లోకి అగ్రగణ్యులు. రాయివంశానికి మూలపురుషుడైన రుద్రనారాయణుడు నవాబ్ సర్కారీలో కొలువుకుచేరి, క్రమంగా వృద్ధిలోకి వచ్చి,దివాన్‌గిరీ సంపాదించాడు. దివాన్‌గిరితో పాటు మూడు పరగణాలకు జమీందారు కూడా అయాడు. ఢిల్లీ పాదుషా స్వదస్తూరితో వ్రాసి యిచ్చిన సనదు ఒకటి వీరియింట్లో ఉన్నదనీ, ఈ పరగణాలపై సివిల్ క్రిమినల్ అధికారాలు యావత్తూ వీరికాయన ఆ సనదులో దాఖలుచేశాడనీ, లోకులు చెప్పుకుంటారు. సనదులో ఈ విషయం అంతా వ్రాసి ఉన్నా లేకపోయినా ఆ అధికారాలన్నీ వీరు స్వాధీన పెట్టుకుని అమలు జరుపుతూ ఉండేవారనటానికి మాత్రం సందేహంలేదు. ఇంతటి నిరంకుశులైన జమీందారు ఈదేశంలో అతఃపూర్వంగాని తదనంతరంగాని పుట్టలేదని ప్రతీతి.

ఈయన ప్రబల ప్రతాపంవల్ల పులులూ మేకలూ ఒక్కరేవులో కలిసి నీళ్లు తాగుతుండేవిట. ఎవరి మీదనన్నా ఈయన కాగ్రహం కలిగితే ఆయన వాళ్ళని సర్వనాశనం చేయకుండా వదిలిపెట్టేవాడుకాదు. తరతరాలవాటి నివేశనాలనుండి ఎంత మందిని లేవగొట్టి, ఎంతమంది ఆస్తులను ఈయన నాశనంచేశాడో లెక్కలేదు. రాయిబాబు మాటను కాదనగలిగేటంత గుండెలు, ఈ యిరవైకోసులు మన్యెవరికీ లేవు. ఈయన కఠోరశాసనం ధర్మమా అని, ఆ పరగణాలలో ఎక్కడా చోరీలుగాని బందిపోటులుగాని, వ్యాజ్య సాజ్యాలుగాని, కలికానికైనా ఉండేవి కావు. దానికి యింకో కారణంకూడా ఉంది. ఈ ప్రాంతంలో బాణాకర్రలూ కత్తులూ విల్లమ్ములూ ప్రయోగించటంలో చెయ్యితిరిగిన రౌడీల్నందరినీ ఆయన పోగుచేసి తన దళంలోకి చేర్చుకునేవాడు. ఒకవైపున ఆయన నిగ్రహానికి ఎట్లా సీమ లేదో, రెండోవైపున ఆయనఅనుగ్రహానికి కూడా అట్లా సీమలేదు. దరిద్రులకు అన్నవస్త్రాలు, రోగులకు ఔషధ పథ్యాలూ, యివ్వటం ఆయననిత్యకర్మలలో ఒకటి.

ఈయనను ఆశ్రయించుకుని బతుకుతున్న పరి

వారానికి లెక్కా పత్రాలేదు. ఈయన ధారపోసిన అగ్రహారాలమూలంగా దేశంలోని పేదపురోహితులంతా పెద్దపెద్ద భూస్వాములైనారు. పూజా పురస్కారాలు, హోలీ దుర్గోత్సవాలు, వచ్చాయంటే ఈ చేత ఖర్చుపెట్టేది, ఆ చేతికి తెలియకుండా డబ్బు చిమ్మేసేవాడు. రుద్రపురంలో సత్రశాలలో రోజూ వందమంది అతిథులకు భోజనసత్కారాలు జరుగుతూ ఉండేవి. పితృదాయ మాతృదాయ కన్యాదాయగ్రస్తుడైన బ్రాహ్మణుడెవ్వడూ రుద్రపురి జమీందారుల ముంగిలిలో అడుగుపెట్టి రిక్తహస్తాలతో తిరిగిపోలేదు. బ్రాహ్మణుల ధనం, నిలవ చెయ్యటానికి కాదు, సత్కార్యాల్లో వినియోగించటానికి, అని ఈయన అంటూ ఉండేవాడు. అందుచేత ఎప్పుడన్నా సత్కార్యాలకింద వినియోగించటానికి చేతిలో డబ్బు లేకపోతే ఆ డబ్బు వర్తకుల యిళ్లు కొల్లపెట్టి ఎత్తుకురావటానికి ఆయన సందేహించేవాడు కాదు.

ఒక్కమాటలో చెప్పాలంటే వీరి బుద్ధికెంత తోస్తే అంత; వీరు చేసేది మంచిపనికానీ చెడ్డపనికానీ అదంతా వారి యిష్టాయిష్టం. అదేమంటే, నవాబు అమలులో వారిమీద అంకుశమే లేదు. మొత్తానికి సామాన్యజనం వారిని చూసి ఎంత భయపడేదో అంత భక్తిప్రపత్తులతో గౌరవించేది. జనసామాన్యమంటే భక్తిగాని భయంగాని పైవాళ్లకి లేకపోవటమే దీనికి కారణం. ఈ విశృంఖలమైన యథేచ్ఛాచారం ఫలితంగా వాళ్ల మనస్సులలో తమ విశిష్టత్వం గురించీ తమ శ్రేష్ఠత్వం గురించీ ఒక నమ్మకం ఏర్పడిపోయి, ఆ నమ్మకం కాలంగడిచినకొద్దీ వృద్ధికావటం మొదలుపెట్టింది. వాళ్ళ మనస్సుల్లో జాత్యహంకారం, ధనాహంకారం, బలాహంకారం, రూపఅహంకారం, గూడుకట్టుకుపోయినై. రాయి వంశంలోని పురుషులంతా గౌరవర్ణులు. దీర్ఘాకృతులు. బలిష్ఠులు. ఆ యింటి ఆడపడుచుల అందం దేశవిఖ్యాతం. ఈ అన్ని కారణాలవల్ల మానవుణ్ణి మానవుడుగా గుర్తించే జ్ఞానం వీరిలో పూర్తిగా లుప్తమైపోయింది.

ఈ దేశానికి ఇంగ్లీషువాళ్లు రావటానికి పూర్వమే ఈ వంశానికి అవసానదశ ప్రారంభమైంది. ఆ తరవాత కంపెనీ అమలులో ఈ అవసానదశ ముగింపుకు వచ్చింది. వంశవృద్ధితోబాటు ఆస్తిపాస్తులు పంపిళ్ళయిపోవటంవల్ల క్రమంగా భాగస్వాములంతా చితికిపోవటం మొదలుపెట్టారు. దాని వెనువెంటనే వంశక్షయం కూడా ప్రారంభమయింది. స్వప్రయత్నంవల్ల అర్థోపార్జన చెయ్యటం వీరి దృష్టిలో చాలా హేయమైన కార్యం అవడం చేత కొత్తగా ధనంవచ్చి కలిసే ఆస్కారం లేకపోయింది. పోతే, ఆస్తిపంపుళ్ళ దగ్గిరా యితర వ్యవహారాల దగ్గరా, వారిలో వారికి వివాదలు కూడా ప్రారంభమైనయ్.

రాయివంశీకులు శాక్తేయులు - ఎంత వీర శాక్తేయులంటే రుద్రపురిలో ఆబాలగోపాలమూ మద్యపానం చేసేవాళ్లు. ఈ వంశంలోని ఆడపిల్లలకు కూడా తాగుడు అలవాటు. మద్యపానం ఒక మహాపురుషకార్యం అని వారి అభిప్రాయం. సంధ్యాసమయాన,కుల దేవత సింహవాహినిని అర్చించి,కచ్చేరిలోకి వచ్చికూర్చొనిజమీందారులుమద్యంసేవిస్తూఉండగా, ఆ గౌరవర్ణులైన దీర్ఘకాయులైన పురుష విగ్రహాలని చూస్తే, నొసట రక్తచందనపు బొట్టు, జపాపుష్పాల వంటి రెండుకళ్లూ, మూడూ కలిసి,సాక్షాత్తూ అరుద్రుని రోషకషాయిత నేత్రాలకి మల్లే భాసించేవి. ఇటువంటి సమయాల్లో పృథివిలో వారు సాధించలేని దుస్సాహస కార్యం అంటూ ఉండదు. ఒక భాగస్వామి తన మనుష్యుల్ని మరో భాగస్వామి ధాన్యపుకొట్ల మీద పడి లూటీ చేసి రమ్మనీ, ఆ యింకో భాగస్వామి తన మనుష్యుల్ని మళ్లీ మరో భాగస్వామి తాలూకు జమీలోని స్త్రీలనందరినీ చెరిచి రమ్మనీ, యిట్లా ఒకరిమీద కొకరు తమతమ కాడీమూకల్ని పురిగొల్పుతూ ఉండేవాళ్లు. దీని ఫలితంగా ఖూనీలూ రక్తపాతాలూ,జరిగేవి. ఈ జ్ఞాతివైరం పుట్టటానికి కారణం, వాళ్లు అవసానదశలో కట్టకడపటి మెట్టుకు వచ్చేశారు.

అప్పటికే అడుగంటిపోయిన వాళ్ల ఐశ్వర్యం, పర్మనెంటు సెటిల్‌మెంటు ధర్మమా అని అడుగూ బొడుగూ కూడా చేతులుదాటిపోయింది. గడువుకాలంలోగా కంపెనీ ఖజానాలో శిస్తు కట్టకపోతే, ఈ కొత్తయజమానులు ఊరుకోరనే జ్ఞానం అన్నా వీళ్లకి లేకపోయింది. పాతకాలం నాడు నవాబుసర్కారులో అసలు శిస్తులు చెల్లించే

అలవాటే వీరికి లేదు. అభ్యాసం లేనిపని కొత్తగా చెయ్యాలంటే ఎట్లా సాధ్యమవుతుంది! మొత్తానికి ఏమయితే నేమి, వీళ్ల ఆస్తిపాస్తులలో ముప్పాతిక మూడువంతులు కంపెనీవారు జప్తుచేసి వేలంవేయించారు.

ఇట్లా ఉంటూఉండగా పక్కపక్కనే వంశక్షయం గూడా జరుగుతూవచ్చింది. గ్రామంలో ఒకప్పుడు వంద యిళ్లకుపైగా వున్న ఈ వంశీయులు యిప్పుడు, అంటే వంద సంవత్సరాలకి పూర్వం, ఆరు యిళ్లవాళ్లు మాత్రం మిగిలారు. ఈ ఆరుయిళ్ల ఆస్తీ క్రమంగా ధనంజయసర్కారు చేతులోకి పోయింది. దానికి ముఖ్యమైన కారణం, ధనంజయ సర్కారుకు, ఇంగ్లీషువాళ్లు పెట్టిన శాసనాలు, ఎంత క్షుణ్ణంగా తెలుసునో. వాటిని పాటిస్తున్నట్లు పైకి కనిపించటం కూడా అంత క్షుణ్ణంగా తెలుసు. లొసంగు చూసుకొని ఎట్లా ధనోపార్జన చేయవచ్చునో, ఆ కిటుకులూ, మాయమర్మాలూ, అతనికి మునివేళ్ల మీద ఉంటాయి. మూడు జిల్లాకోర్టుల్లో వకాలతు చేసి నాలుగయిదు సంవత్సరాలల్లో అజాపజా లేనంత ధనం ఆర్జన చేశాడు. తరవాత ఆ డబ్బంతా వడ్డీ వ్యాపారంలో పెట్టి వడ్డికివడ్డీ, మళ్లీ ఆవడ్డికి వడ్డీ, ఇలా చక్రవృద్ధిగా డబ్బు పెంచేశాడు. ఈవిధంగా పదేళ్లలో పదిలక్షలరూపాయలు చేశాడనిజనశ్రుతి. ఇంత మొత్తం కాకపోయినా నాలుగయిదు లక్షలయినా సంపాయించిఉంటా డనటానికి సందేహం లేదు. ఈ డబ్బు కూడబెట్టిన తర్వాత ఎల్లాగన్నా తను ఒక జమీందారని పించుకోవాలనే కోరిక ఆయనకు పుట్టింది. ఈ కోరిక తీర్చుకోటానికే అతను, ఒకరి తర్వాత ఒకరిదిగా, రాయివంశీయుల ఆస్తి అంతా క్రయం చేయటానికి మొదలుపెట్టాడు. ఈ జమీందారుల ప్రతి అంగుళం భూమి, దాని చరిత్రా, అతనికి హృత్కవిలె. రాయి వంశం మోచేతికింద నీళ్లుతాగే ఈయనపూర్వీకులు, పద్నాలుగు తరాలవాళ్లు, బతుకు వెళ్లదీశారు. అదీగాక, తానుకూడా చిన్నతనంలో, రుద్రపురంలో, జ్యేష్ఠ భాగస్వామి త్రిలోక్ నారాయణ్ దివాణంలో, నాలుగయిదేళ్లు గుమాస్తాగిరీ చేశాడు. అంతమంది భాగస్వాముల ఆస్తిపాస్తులూ, వసతిగృహాలూ, కొనేసిన తర్వాత కూడా, ధనంజయుడు చాలాకాలం వరకు రుద్రపురంలో అడుగుపెట్టటానికి సాహసించలేకపోయాడు.

ఏమంటే, అతని ప్రభుపుత్రుడు ఉగ్రనారాయణుడు, ఇంకా జీవించి ఉన్నాడు. తాను బ్రతికిఉండగా, ధనంజయుడు రుద్రపురం పొలిమేరల్లో అడుగుపెట్టితే, అతణ్ణి మళ్లీ ప్రాణాల్తో తిరిగి పోనివ్వను, అని సింహవాహిని పాదం స్పృశించి గాయత్రీసాక్షిగా ఉగ్రనారాయణుడు శపథం పట్టాడు. తన ప్రతిజ్ఞనతడు అక్షరశః పాలిస్తాడన్న విషయంలో ధనంజయునికి ఏలాటి అనుమానం లేదు. ఉగ్రనారాయణునంతటి అప్రధృష్యుడూ, అసమ సాహసీ, రాయివంశంలో ఎప్పుడూ పుట్టలేదని కూడా ధనంజయుడికి బాగా తెలుసు.

ఉగ్రనారాయణుడు మరణించిన కొన్నాళ్లకి ధనంజయుడు రుద్రపురంవచ్చి రాయివంశంతాలూకు పిత్రుపైతామహ మైన ఆస్తియావత్తు దఖలుపరుచుకున్నాడు. అప్పటికి ఆగ్రామంలో, రాయివంశానికి, మగపురుగు అంటూ ఒక్కడుకూడా మిగలలేదు. ధనంజయుడు తల్చుకుంటే అందరిభాగాల్నీ నిరభ్యంతరంగా స్వాధీన పరుచుకో గలిగే వాడే. కాని ఉగ్రనారాయణుడియొక్క కూతురు, విధవరాలు, రత్నమయిని, పైత్రుక గృహం నుంచి వెడలనడపటానికి అతడు ప్రయత్నించలేదు.

దానికి మొదటికారణం రుద్రపురిని ఆనుకుని ఉన్న పాఠాన్‌గ్రామం ప్రజలు రత్నమయి వారసత్వాన్ని నిలబెట్టడంకోసం ఎంతకైనా తెగించి ఉన్నారు. ఆ ఊళ్లోవున్న మగవాళ్లు యావన్మందీ లాఠీలతోవచ్చి యింటిదగ్గర కాపు వేశారు. రత్నమయిని వెళ్లగొట్టడానికి-ప్రయత్నిస్తే కూనీలయిపోవడం అనివార్యమని గ్రహించి, ధనంజయుడు లాభంలేదని చెప్పి వదిలివేశాడు. రెండో కారణం, తనవంశంలో పద్నాలుగు తరాలవాళ్లు ఎవరి దయాధర్మభిక్షంవల్ల మనుగడ సాగించారో, ఆ రాయివంశీయులయెడ, పూర్వసంస్కారవశంచేత, ధనంజయుడి మనస్సులో యింకాకొంచెం భయమూ భక్తీ, మిగిలిఉన్నాయి. ఈ కారణాలవల్ల ఉగ్రనారాయణునిభాగం మాత్రం వదిలిపెట్టి రాయివంశపు పురాతన పైత్రుకగృహాలలోని, తక్కిన భాగాలన్నీ స్వాధీన పరుచుకున్నాడు.

ఆ స్వాధీన పరుచుకోవడంకూడా నామ

మాత్రమే. ఏమంటే ధనంజయుని కుటుంబంలో ఒక్కగానొక్క కూతురు రంగినీ, వాళ్లతానీ, ఇల్లటపు అల్లుడు రతీలాల్, మాత్రమే ఉన్నారు. ఈ యింటికి వచ్చినతర్వాత ధనంజయుడి మనస్సులో ఒక విచిత్రమైన మార్పు కలిగింది. డబ్బు ఆర్జిస్తున్న కొద్దీ ధనంజయుడికి డబ్బుమీద లోభంకూడా పెరిగిపోయి, క్రమంగా ఆ లోభం వినా, అతని మనస్సులో మరే ఇతరభావానికిగాని ఆలోచనకుగాని చోటు లేకుండాపోయింది. ఆ లోభంయొక్క ప్రబల ఆకర్షణవల్లనే అతను ఇంతకాలమూ అంధప్రాయంగా (యేనకేనాప్యుపాయేన) డబ్బు చెయ్యాలని నానాగడ్డీ కరుస్తూవచ్చాడు. ఈ డబ్బంతా తాను ఎందుకు చేస్తున్నట్టు? ఎవరికోసం నిలవచేస్తున్నట్టు? అనే ప్రశ్న ధనంజయుడికి ఎన్నడూ కలగనేలేదు.

కాని రుద్రపురివచ్చి జమీందారైనాక, తాను డబ్బు చేస్తున్నది కేవలం డబ్బు చెయ్యటం కోసమేగాని, మరేకారణంతోనూ ఎవరికోసమూగాని కాదు, అని ధనంజయుడు నిశ్చయించుకున్నాడు. ఒకరితర్వాత ఒకరుగా తన కడుపున పుట్టిన ఏడుగురు సంతానము నష్టమైపోయినసంగతి అతనికప్పుడుస్ఫురణకువచ్చింది. ఇన్నివిపత్తులలోనూ అతను ఒకరోజునకూడా విచలితుడుకాలేదు. ఒక్కరోజునకూడా ధనార్జననుండి విశ్రాంతి తీసుకోలేదు. ఆజన్మసిద్ధంగా అతనికి ధనార్జనఅంటే ఉన్నఅభిలాష ఈ వృద్ధవయస్సులో, డబ్బుమీద ఒకవిధమైన మోహంకిందికి దిగింది. తాను సంపాదించిన ధనాన్ని సంరక్షించటం ఎలాగు అనే దిగులుతో అతనికి రాత్రిళ్లు ఒక్క నిమిషంకూడా కునుకుపట్టేదికాదు.

అనంతమైన ఐశ్వర్యం కూడా కాలక్రమాన నష్టమైపోతుంది. ఈ రుద్రపురంలోనే దానికి ప్రత్యక్షప్రమాణం చూశాడు. మనుష్యుడు స్వప్రయత్నంవల్ల ధనార్జనచేస్తే చేయవచ్చుగాక. కాని దేవతల సహాయంలేనిదే ధనాన్ని రక్షించుకోలేడు, అని అతని మనస్సులో క్రమంగా ఒక భావం వేరుపోసుకుంది. ఇంగ్లీషువాళ్ళ శాసనాలన్నీ కంఠోపాఠంగా వచ్చినప్పటికీ, ధనంజయుడు సంస్కృతి అంటని బర్బరుడుగానే ఉండిపోయాడు. అతని మనస్సంతా, శూద్రజాతిలో అనాదు పరిపాటి అయిన, నానారకాల కుసంస్కారాలతోను, మూఢవిశ్వాసాలతోను, నిండిఉంది.

దాచ దలుచుకున్న డబ్బుతో పాటు ఒక బ్రాహ్మణశిశువును గదిలో పెట్టి తాళంవేస్తే, ఆ శిశువు ఆకలికి మాడి చచ్చి, యక్షుడై, ఆ నిధిని, ఉత్తరాధికారులు వచ్చి తీసుకునేవరకు రక్షిస్తూ ఉంటాడని, తాను చిన్నతనంలో విన్నాడు. ఎల్లాగైనా ఈఉపాయంతో తన సంచితధనాన్ని రక్షించుకోవాలనే కోరిక, ధనంజయుడి మనస్సులో అంతకంతకూ ప్రబలమైంది. చివరికి యక్షుణ్ణి చెయ్యటం ఒక్కటే ఇక తన జీవితంలో మిగిలిపోయిన చివరిపని అనీ, ఈ పరమప్రధాన కర్తవ్యాన్ని తాను ఎట్లాగైనా నిర్వర్తించక తీరదనీ దృఢనిశ్చయానికి వచ్చాడు. ధనానికి సంబంధించిన విషయాల్లో తాను ఏదన్నా నిశ్చయం చేసుకుంటే, ఆ నిశ్చయాన్ని, ఎన్ని అడ్డంకులు వచ్చినా దాటి తుదనెగ్గించే పట్టూ, నేర్పూ, ధనంజయుడికి ఉన్నై. కాని ఇక్కడ అనుకోని చిక్కు ఒకటి వచ్చిపడింది. తండ్రి యక్షుణ్ణి చెయ్యాలని అనుకుంటున్నాడని విన్నదగ్గర్నుంచీ రంగిని నిద్రాహారాలు విసర్జించింది. దాంతో ధనంజయుడికి తన ఉద్దేశ్యం నెరవేర్చే పావకాశం లేకుండాపోయింది. ధనంజయుడు ఈ పృథివిలో డబ్బుకాక యింకా దేన్నైనా ప్రేమిస్తే అది ఒక్క తన కూతుర్నే. ఒకొక్కప్పుడు బండరాతిలో కూడా ఎక్కడో, సందు చూసుకుని, మొక్క మొలిచినట్లే, ధనంజయుడి కఠినహృదయంలోని ఏదోఒక పగులులోంచి, పుత్రికావాత్సల్యం పొటమరించింది. ధనంజయుడు ఈ ప్రయత్నాన్ని తనమటుకు తాను విరమించుకున్నా విధివశంవల్ల అతని జీవితపు ఈ తుదికోర్కె కూడా అనుకోకుండా నెరవేరిపోయింది.

రత్నమయికి మూడేళ్ళ పిల్లడొకడున్నాడు. వాడిపేరు కిరీటచంద్రుడు. రత్నమయి యిరవై నాలుగు గంటలూ, ఆ కుర్రవాణ్ణి పెట్టుకునే ఆ లంకంత యింట్లో ఒంటరిగా నివసిస్తూఉండేది. నలుగురినీ చూడటం చెయ్యటం ఉండేదికాదు. అంతఃపురంలో ఎవ్వరూ ప్రవేశించటానికి వల్లకాదు. ప్రతిరోజూ మధ్యాహ్నం పన్నెండుగంటలవేళ స్నానంచేసి దేవి ఆలయానికి వెళ్లేఅలవాటు ఒకటి ఉందిగాని, లేకపోతే

రుద్రపురి ప్రజలు ఆమె ఉన్న దన్నమాటే మరిచిపోయి ఉండేవాళ్లు. ఆ ఆలయానికి వెళ్లేసమయంలో, ముందో యిద్దరూ వెనకో యిద్దరూ, పాఠాన్ పాడా మనుష్యులు, లాటీలు చేతబుచ్చుకుని కూడా నడుస్తూఉండేవాళ్లు. రత్నమయి వయస్సప్పుడు యిరవై యిరవైయొక్కటి ఉండొచ్చు. ఆమెవంటి అపూర్వమైన సుందరి ఏ దేశంలోనైనా కోటికి ఒకత్తె కనిపిస్తుంది. ఆమె విగ్రహం సింహవాహిని ప్రతిమ వలెనే ఉంటుంది. ఆవిగ్రహానికి మల్లేనే పైకి మలచిన కనుకొనలు; ఆకళ్ళ లాగానే ఈమె కళ్లుకూడా నిశ్చలం. ఆమె కళ్లకు రెప్పపాటు లేదని లోకులు చెబుతారు. ఆమె కళ్లలోపల కనిపించే ప్రజ్వలనకు ఒకటే అర్థంఉంది; అది తన చుట్టువున్న సమస్త స్త్రీ పురుషులమీదా ఆమె వెడల గక్కే అగాధమైన అవజ్ఞ. రాయ్‌వంశంలోని తర తరాల సంచిత అహంకారమూ ఉత్తరాధికారిణీ హోదాలో రత్నమయికి సంక్రమించింది. రత్నమయికి మనస్సులో తన రూపాన్ని గురించికూడా అసాధారణమైన అహంభావం ఉండేదని చెప్ప నవసరంలేదు.

ఏమంటే ఆమెదృష్టిలో తనరూపం తన అభిజాత్యానికి ప్రత్యక్షనిదర్శనం. రత్నమయి అభిప్రాయంలో రూపంయొక్క ఉద్దేశ్యం మనుషుల్ని ఆకర్షించటంకాదు— తిరస్కరించటం. ఆమె దేవీ మందిరానికి వెళ్లేటప్పుడు మార్గంలో జనమంతా ఎక్కడివాళ్లక్కడ తొలిగిపోయేవాళ్లు. ఆమె సర్వ అంగాలూ ఆమె వంటి ప్రతివంపూ, నీరవభాషలో ప్రతివారినీ ఇలా హెచ్చరిస్తున్నట్లుండేవి:—"తొలిగిపో, తొలిగిపో. నీ ఛాయ సోకితే మైలపడిపోతాను. మళ్ళీ స్నానంచెయ్యాలిసొస్తుంది." ఏవైపూ చూడకుండా ముక్కుసూటిగా మందిరానికి వెళ్లిపోయేది, తాను నడిచినమార్గం అంతా తన సౌందర్యంతో వెలిగించుతూ. మళ్ళీసరిగ్గావచ్చినదారినే వచ్చినట్లుగానే తిరిగి వెళ్లిపోయేది.

రంగిని కిటికీలోనుంచి రత్నమయి ఈ రాకపోకలు నిత్యం చూస్తూఉండేది. చూసి ఆమె మనస్సూ దేహమూ విద్వేషానలంతో జర్జరితమైపోయేవి. రంగినికి తక్కినవి ఏమున్నా రూపం మాత్రం లేదు. ఆ సౌందర్యం యొక్క అభావం ఆమె మనస్సును విపరీతంగా వ్యథపెట్టేది. కారణం భర్త రతిలాలు అతిరూపసి.

ధనంజయుడు డబ్బునెట్లా ప్రేమించేవాడో, రంగిని భర్త నట్లా ప్రేమించేది. అంటే ఈ ప్రేమ ఒక ప్రచండమైన తృష్ణ తప్ప అంతకు మించి ఏమీ కాదు. ఈ తృష్ణకూడా శారీరిక తృష్ణకు వలెనే సుద్దిది. క్రూరమైనది. ఈ ప్రేమకుమనస్సుతో ఎంత సంబంధం ఉందో చెప్పలేం. కారణం మనస్సు అనేది దేహానికి అతిరిక్తమైనది కాదు. అంతర్భూతమైన వస్తువు. పైగా ధనంజయుడు ఏభావంతో రూపాయల్ని ప్రేమించేవాడో రంగిని సరిగ్గా అదేభావంతో భర్తని ప్రేమించేది—నిజసంపదలో ఒక భాగంగా. ఆ సంపద మీద ఎవరైనా చెయ్యివేస్తారేమోనని మనస్సులో ఆలోచన కలిగితేనే ఆమె ఆగ్రహంతో ఒళ్లు మరిచిపోయేది.

ఈ సంపదను రక్షించుకోటానికి రంగిని ఎంత అకార్యాన్నైనా చెయ్యగలదు. రంగిని మనస్సులో ఎట్లా కలిగిందో ఏమో నిష్కారణంగా ఒక అనుమానం కలిగింది. రతిలాల్ రత్నమయిరూపం చూసి ముగ్ధుడయాడు అని. క్రమంగా ఆ అనుమానం దృఢనిశ్చయంగా పరిణమించింది. ఉగ్రనారాయణుడి యింటికి రతిలాల్ దొంగచూపులు చూస్తూ నక్కి నక్కి వెళ్లటం, వీలయినంతసేపు అక్కడ తిష్ఠ వెయ్యటం రంగిని కనిపెట్టింది. ఇందులో అసలు రహస్యం ఏమిటంటే రతిలాల్ రత్నమయి యింట్లో ఉండే ఒక బ్రాహ్మణుడితో కలిసి భంగు తాగటానికి వెళ్లేవాడు.

అదీగాక నిస్సంతుఅయిన రతిలాలుకు రత్నమయి పిల్లడిమీద ఎక్కడలేని మక్కువ ఏర్పడింది. అతడు కిరీటచంద్రుణ్ణి చూడకుండా ఒక్క రోజుకూడా ఉండలేడు. నిజానికి ఇంతవరకూ రతిలాల్‌కు రత్నమయితో చూపులుకూడా కలవలేదు. రత్నమయికూడా తన భర్తని మోహించిందనీ ఆమె మూలంగా తనభర్త తనకు కాకుండాపోయాడనీ రంగిని మనస్సులో గాఢంగా నమ్మకం ఏర్పడింది. ఈ పగ సాధించుకొని మజ్జాగతమైన, తన హింసాప్రవృత్తిని తీర్చుకోటానికి, రంగిని, రత్నమయి కుర్రవాణ్ణి హతుణ్ణి చెయ్యాలని పథకంఎత్తింది. రంగిని ఒక రోజున ధనంజయుడితో చెప్పేసింది. హతుణ్ణిచేయ

టానికి తనకిక ఏ అభ్యంతరమూ లేదు. అంతేకాదు, పుత్రవాణ్ణి స్వయంగా తానే వెలికితెస్తుంది—అని.

ఈపని అతి రహస్యంగా నిర్వర్తించవలసి ఉంది. తండ్రీ కూతురూ సంప్రతించుకొని, రంగిని నిద్రపోయే గది పక్కగదిలో యత్నిణ్ణి చేయాలని నిశ్చయించారు. నాలుగు అయిదు రోజుల్లోపల ఆ గది ముఖద్వారం తప్ప తక్కిన ద్వారాలూ కిటికీలూ అన్నీ కూడా, ఇటుకలతో సున్నంతో సందు లేకుండా తర్వాత ఎవరికీ తెలియకుండా, ధనంజయుడు డార్జిం చిన, నగదు నాణ్యాలూ, వెండి బంగారాలూ, రాగి బిందెల్లో నింపి ఆ గదిలో వరసగా పేర్చి పెట్టారు. ధనంజయుడి డబ్బంతా ఆగదిలో ఈ విధంగా నిక్షిప్తం అయిన తర్వాత రంగిని ఒకరోజున భర్తని పిలిచి రత్నమయి పిల్లవాణ్ణి ఒకసారి ఇంటికి తీసుకురమ్మని అడిగింది. అందాలు ఒలికిపోయే వాడి ముఖం చూసిందగ్గర్నుంచీ, వాణ్ణి ఒకసారి ఎత్తుకుని ముద్దుపెట్టుకోవాలని తనప్రాణం రెపరెప లాడిపోతున్నదని చెప్పింది. రతిలాలు అది తనకుసాధ్యం కాదన్నాడు. రత్నమయి తాలూకు పరివారం ఈ సంగతిగాని పసిగడితే తన, తల తీసి, మొలేస్తా రన్నాడు. కాని రంగిని పట్టువిడవలేదు; రంగిని పోరు పడలేక చివరికి ఒకరోజున సందెచీకట్లో రతిలాల్ కిరీటచంద్రుణ్ణి మరిపించి ఇంటికి తీసుకొచ్చాడు. కిరీటచంద్రుడు ఇంకా ఇంట్లోకి అడుగుపెట్టాడో లేదో రంగిణి పరుగెత్తుకొని వెళ్ళి చంకనెత్తుకొని ముద్దులతో వాణ్ణి ఉపిరాడకుండా చేసింది. బుజ్జగించి లాలించి నిముషంలో మచ్చిక చేసుకుంది. తర్వాత కిరీటచంద్రునికి ఎర్రటి పట్టుతాపితాలు కట్టి మెళ్లో పూలమాల వేసి, నుదుటిపై రక్తచందనం దిద్ది, చేతులకు బంగారు మురుగులు తొడిగింది.

కిరీటచంద్రుని ముచ్చటగొలిపే ఈ వేషంచూచి రతీలాలు కళ్ళూ ముఖమూ ఆనందంతో విప్పారిసై. ఇంతలో రంగిణి హఠాత్తుగా ఆ బ్రాహ్మణశిశువును చెయ్యిపట్టుకొని ఈడ్చుకుపోయి ఆ అంధకూపంలోకి నెట్టెగభాల్న తలుపువేసి తాళం పెట్టింది. ఇటు పక్కగదిలో ఉన్న రతిలాలు గదిలో ఈ మూలకూ ఆమూలకూ పరుగెత్తి తలుపులన్నీ తట్టిచూసి రంగిణి తననికూడా శయనగృహంలో బంధీచేసి పోయిందని గ్రహించాడు. రతిలాలు తలుపుమీదపడి అరుస్తూ కాలికి వచ్చినట్లు తన్ని కిందపడి మీదపడి ఆ అంధకూపపు ద్వారాన్ని పగలగొట్టడానికి తన శక్తంతా వినియోగించాడు. గాని లాభంలేకపోయింది.

ఆ పూర్వోత్తరపు తలుపు ఎంత గట్టిదంటే, గొడ్డలితోకూడా దాన్ని పగలగొట్టడం సాధ్యం కాదు. కళ్లుపొడుచుకున్నా కనిపించని ఆ చీకటి గదిలో కిరీటచంద్రుడు దిక్కుతోచక బావురు మని ఏడవటం మొదలుపెట్టాడు; కొంతసేపటికి ఏడుపు కొస్త తగ్గింతర్వాత 'బాబాయీ, బాబాయీ' అంటూ రతిలాల్ని పిలవసాగాడు. రెండుమూడు గంటలయినతర్వాత వాడి ఏడుపుధ్వని క్రమంగా సన్నగిలి వినిపించటం మానేసింది. కుర్రవాడు ఏడ్చి ఏడ్చిసొమ్మసిలి నిద్రపోయి ఉంటాడని రతిలాల్ ఊహించాడు. రతిలాల్ ఈవిధంగా మూడుపగళ్లూ మూడురాత్రులూ స్వగృహంలో బందీఅయి, ఒకొక్కసారి ప్రక్కగదిలోనుండి కక్కటిల్లిపోతున్న కిరీటచంద్రుడి ఏడుపు, మరొకసారి తల తపాతపా తలుపుకు వేసి బాదుకుంటున్న చప్పుడు, మరొకసారి సంపూర్ణ నిస్తబ్దత వింటూ గడిపాడు. రతిలాల్‌కు మతిపోయి ఏంచేయ్యాలో తోచక ఈ మూడురోజులూ వెర్రివాడిలాగా గదిలో ఒకటే పరుగులు పెడుతూ తలుపు పగలగొట్టటానికి వెయ్యిసార్లన్నా ప్రయత్నం చేసిఉంటాడు.

కాని ఆ ద్వారం వెంట్రుకవాసి అయినా చలించలేదు. కిరీటచంద్రుడి ఏడుపు చెవిని బడినప్పుడల్లా రతిలాలు తలుపుదగ్గర కొగంతు వేసి "బాబూ బాబూ! అల్లా ఏడవకు. నాయన కాదూ, ఏం భయంలేదు. నేను ఇక్కడే ఉన్నాను." అంటూ పెద్దపెట్టున అరిచేవాడు. రతిలాల్ స్వరం గుర్తుపట్టి పిల్లడు ఇంకా గుండెలు తరుక్కుపోయేలాగు ఏడుపు మరింత హెచ్చుచేసేవాడు. దబదబా దెబ్బమీద దెబ్బగా తల నేలకేసిబాదుకు నేవాడు. రతిలాలు అక్కడ నిలవలేక, చెవులు రెండూ చేతుల్తో గట్టిగా మూసుకొని, దూరంగా గదిలో ఓ మూలకు పారిపోయి అర్చుకు నేవాడు. రంగిణినీ ధనంజయుణ్ణీ పిలిచి పిలిచి గొంతుపోయేది. ఇద్దర్నీ పడపడా నోటికి వచ్చినట్లల్లా తిట్టేవాడు.

ఈ పైశాచికకాండ చూసి రతిలాల్ ఏమీ ఆలోచించలేని స్థితిలో పడిపోయాడు. కిరీటచంద్రుణ్ణి

విడిపించేమార్గం ఇంకోటి ఏదన్నా ఉంటుందేమో నన్న ఆలోచనకూడా అతనికితట్టలేదు. ఆఏడుపువల్లా ఎక్కడవినబడుతుందో అనే ఎంతసేపూ ప్రాణాలు ఉగ్గ బట్టుకొని ఉండేవాడు. అతని సమస్త మనఃప్రాణాలన్నీ ఆఏడుపులాగివేసి ఆఅంధకూపంలోనే పిల్లడితోపాటు బందీచేసివేసింది. మూడోరోజుకి పిల్లడి ఏడుపు సన్న గిలిపోవటం మొదలుపెట్టింది. క్రమక్రమంగా క్షీణించి క్షీణించి అయిదోరోజున పూర్తిగా ఆగిపోయింది. కిరీటచంద్రుని లేతప్రాణం అక్కడితో బొందిలోంచి లేచిపోయిందని రతిలాల్ గ్రహించాడు. అప్పటికి రతిలాల్‌కు స్మారకం వచ్చింది. లేచి నాలుగువైపులా పరకాయించి చూసి అమాంతం కిటికీమీద పడ్డాడు. కిటికీ ఊచలను బలవంతాన రెండుచేతులతో ఇటు కుదిర్చి అటుకుదిర్చి పెల్లగించి పారవేసి బైటికు దూకు దూకాడు. ఒక్క పరుగున అక్కణ్ణుంచి రత్నమయి ఇంట్లోకి వెళ్లి పడ్డాడు. ఆ రోజున మాస్తే అంతఃపుర ద్వారం వద్ద పారావాళ్లు లేరు; పాఠాన్‌పాడ్ ప్రజ యావత్తు పిల్లణ్ణి వెతికటానికి నాలుగుసగాలలకు బయలు దేరి పోయారు. రతిలాల్ సూటిగా రత్నమయిదగ్గరికి పరుగెత్తుకుపోయి ఒక్కగుక్కలో సమస్తం చెప్పే శాడు.

మూడేళ్ల ఈమధ్య రత్నమయిముఖంలో ఒక సారికూడా చిరునవ్వు కనిపించలేదు. తన పిల్లడికి సంభవించిన ఈ ఘోరవిపత్తు వినగానే ఆమె కళ్లూ ముఖమూ ఒక్కసారిగా విప్పారినై. రతిలాల్‌కు ఆమె నవ్వుతున్నట్లు కనిపించింది. రతిలాల్ ఆమెను దయ్యాన్ని చూసినట్టు చూసి, హడిలి, అమాంతం ఒక్క గంతు వేసి ఊరిబైటికి అదే దౌడు తీశాడు.

ఆరోజు రాత్రి పన్నెండుగంటలవేళ ఊరంతా నిద్రపోయినతర్వాత, రత్నమయి తన ఇంటికి నిప్పు ముట్టించింది. బైటికి వెళ్ళి వరసగా తన వంశపూర్వీ కులు కట్టించిన ఇళ్ళన్నిటికీ చిచ్చు ముట్టించింది. ఒక గంటలోపల మంటలు భయంకరంగా దేవతల రోషాగ్నికివలె విజృంభించి ధనంజయుడి ఇంటిని అలముకున్నాయి. ధనంజయుడూ రంగినీ ఇంటిలో నుంచి బైటికి పారిపోవటానికి ప్రయత్నించారు. తలవాకిలిదగ్గిరికి వచ్చి చూసేటప్పటికి ఎదురుగా రత్నమయీ, రత్నమయిచుట్టూ డాళ్లూ బరిసెలూ కత్తులూ చేతబట్టుకొని పాఠాన్‌పాడ్ జనం సుమారు ఒక వందమందీ,కనిపించారు. రత్నమయి చేతిసైగతో, వాళ్లు బల్లెంమీద బల్లెం, బల్లెంమీద బల్లెంగా, ధనంజ యుణ్ణీ రంగినినీ ఆపాదమస్తకం తూట్లుచేసి ఆ క్షతదేహా ల్ని బల్లాలతో ఎత్తి ఆ మండుతున్న మంటల్లోకి విసిరి పారేశారు. ఆమట్టున రత్నమయి దిక్కులార్చేటట్టు ఒక భయంకరమైన అట్టహాసం చేసింది. ఆమెకు పిచ్చిఎత్తిందని ఆధ్వని వినగానే చుట్టూ ఉన్న వాళ్లంతా ఊహించారు. దాంతో పాఠాన్‌పాడ్ ప్రజలు ఒళ్లు మరిచిపోయారు. ధనంజయుడి నౌకర్లు, చాకర్లు, దర్వాన్లు, బంట్రోతులు, మగ ఆడ భేదం లేకుండాఎవరుకనపడితే వారిమీదల్లా బల్లాలూకత్తులూ ఎడాపెడా గుప్పించారు. రాయ్‌వంశీకుల పురాతన పైతృకగృహాలమీద అగ్నిజ్వాలలూ, కింద రక్త జ్వాలలూ వెల్లువలై పారుతున్నై. ఇంతలో భయంకర మైన తుపాను పట్టింది; ఉండిఉండి భూమి అదిరి పడటం మొదలుపెట్టింది. ఊరంతా మండిపోయి సాంతం భస్మసాత్కృత మయినతర్వాత రత్నమయి కూడా ఆ మంటల్లోకే దూకి ప్రాణత్యాగం చేసింది.

రుద్రపురం సర్వనాశన మైపోయింది; కాని కిరీటచంద్రుని దీనాలాపమూ, రత్నమయి వికటాట్ట హాసమూ, నేటికీ రుద్రపురం భూమ్యాకాశాలని ప్రతి ధ్వనింపజేస్తూ ఉంటాయి.

# కుమార సంభవము

## శ్రీ ప్రభాకరశాస్త్రిగారి కొన్ని సవరణలు

●

శ్రీ వేటూరి ఆనందమూర్తి

పూజ్యులు, పితృపాదులు అయిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అస్మదాదుల కెడనెడ తెలుపుచుండిన విశేషాంశములే యీ వ్యాస విషయము. ఆంధ్రగ్రంథములందు ముద్రలు విడని గ్రంథగ్రంథులను కొన్నింటి నీవఱకే చిక్కులు విడదీసి శ్రీ శాస్త్రిగారు లోకమున కందజేసి యున్నారు. ఇంకను ప్రకటింపబడనివి, దేశమెఱుంగనివి, పండిత ప్రకాండుల నే తికమకలు పెట్టుచున్నవి, క్లిష్టపద్యములు, క్లిష్టపదములు, అర్థము కుదురనివి, అన్వయము కుదరనివి, చాలగలవు. నన్నెచోడుని కుమారసంభవమున గొలుకబడని మెతిక బియ్యమున దగిన పద్యములలో నొకటి రెంటి నీవఱకే వారర్థ సారస్యమున బయల్పఱచి మచ్చునకు, రుచి చూపినారు. మిగిలిన మఱికొన్నింటి నిట సహృదయలోకమున కాస్వదింపజేయుట సంగతమని తోచి ఈ వ్యాసమును వ్రాయుచున్నాడను.

### ౧ అబంధుడు.

బంధుడని నిన్ను దలచి స
బంధుండయి పడుట దనకు బాడియె; మఱి ని
ర్బంధుడగు నిన్ను గనియు స
బంధుండై దక్షుడునికి పాడియె దేవా!

యూని. ముద్రణము ఆశ్వా ౨—౯౦ప

దీనికి మా నాయనగారి సంస్కరణ

'బంధుడని నిన్ను దలచి య
బంధుండయి పడుట దనకు బాడియె.

దక్షుడు గావించిన పరాభవమును సహింపక గణసమూహ మాతనిపై గత్తిగట్టి అధ్వరమును ధ్వంసము చేసి కాలుసేతులు విఱిచికట్టి యీడ్చి తెచ్చి పరమశివుని ముంగు పడవేసినది. అపుడు చతుర్ముఖుడు పంచముఖున కభిముఖుండయి పలికిన నప్పటుపద్యమిది.

బంధుడకని నిన్ను దలచి— అబంధుండయి= బంధువులు లేనివాడయి (దక్షాధ్వర ధ్వంస సందర్భమున వాని బంధుగులందఱును మడసిరి) పడుట = పడియుండుట, తనకుగా పాడియె = వానికి దగునా! మఱి—నిర్బంధుడు (= పుట్టుక లేనివాడు, బంధుతతి లేనివాడు అనియు; బంధరహితుడు, బంధింపబడినవాడు అనియు కూడ) అగు నిన్ను గనియు, సబంధుండై (= బంధనములతో నున్నవాడై, బంధింపబడినవాడై) దక్షుడునికి = దక్షుడుండుట—పాడియె—దేవా?

ఈ పద్యము ప్రథమార్థమున 'స బంధుండయి పడుట' అనుటకంటె 'అ బంధుండయి పడుట' అనుట బాగు. 'సబంధుడు', 'సబంధుడు' అని పద్యమున రెండుచోటుల నుండుటకన్న నందొకటి 'అబంధు' డగుట చక్కన! నిర్బంధుడను దానికి ప్రతిగా సబంధుండనియుండగా, బంధుడన్న దానికి యబంధుండని యుండవలెను గదా!

### ౨ నెత్త పలకలు.

స్మర కలహంబున బతి దెస
గిరిసుత విఱుదైన వక్షకేళి మహేశుక్
మరుడు దగిలించి గెలువగ
గర మమరి (న పాళి) గతిని గద వింపొప్పున్.

యూని. ము. ఆశ్వా-౩—౮౨ప.

పార్వతీదేవి సర్వావయవములను అతిమనోహరముగ నభివర్ణించుచున్నాడు కవి— అన్నిటిని వర్ణించి వర్ణించి తుట్టతుదకు కచమును వర్ణించినాడు. ఆపై వర్ణన మీ పద్యము. ఇందు చతుర్థపాదమున వ్రాతప్రతిలో పాఠమున్నది.

'కరమమరి........గతి వింపొప్పున్' అని యీ ప్రతి పాఠము. నడుమ శూన్యము. ఇట్టి యెడ నే పరిష్కర్తలు తమ మేధాసంపత్తులతో, ముందు వెనుక

లాలోచించి, పుక్కిట బట్టుకొన్న పారస్యతము నంతను పునః పరిశీలించి యుచితరీతిని సహృదయ హృదయం గమముగ పూరింపవలసియుండును. ఇది వారి కొక సమస్యవంటిది.

ఇట నీ సందర్భమున శ్రీ మా నాయన గారు పూరించినది—

'మరుడు దగిలించి గెలువగ
గరమమరిన నెత్తపలక గతి వీపొప్పన్' అని.

---

ఈ పూరణమే సంగతముగను, వ్రాతప్రతికి దగ్గఱగను నున్నట్లు తోచుచున్నది—

స్మరకలహమున పార్వతి తన పతిదెస పెడ మొగము పెట్టి వెనుదిరిగి కూర్చొన్నది. ఆమె వీపు నెత్తపలకల బురుడించుచు పరమశివుని మనము చూఱ గొనునట్లున్నది. పద్మపురాణ మందలి వర్ణనమిది ప్రస్తుత పూరణమునకు సమర్థనీయముగ నున్నది చూడుడు.

'భావజన్మని నెత్తపలకల బురుడించు
బాలు పాలు వెన్నులు పొఱకులయ్యె.'
పద్మ—3 ఆశ్వా. ౧౯౯ ప.

## 3 చవులు.

కామినులు లేక లోకుల
(గాము)ని కెట్లగు మనోవికారుల జేయన్
గాముక నికరము లేకయు
గామినులను జనుల నెట్లు గలిపింప వగున్.
యామి. ము. ౫ ఆశ్వా—౧౦ ప.

మా * వ్రాతప్రతిలో నీ పద్యము చతుర్థపాద మున 'కామినులకు జనుల నెట్లు గనిపింపవగున్.' అనియున్నది.

పన్నెండేండ్లకు బూర్వము మా నాయనగారొక పండితుని తంజావూరు పంపి యచటి కుమారసంభవ తాళపత్ర ప్రతికి బుత్రిక వ్రాయింపించిరి. వారు కన్నులో కన్ను నిడుకొని యందున్న దున్నట్టుగా నకలు వ్రాసి తెచ్చిరి.

పరిష్కర్తలు నకుమ నున్న యపపాఠమును స్వీకరించి కడల నున్న సాధు పాఠములను మార్పు జేసిరి. కామినులు లేనిచో కామునకు— అన్నపుడు కాముడు లేనిచో కామినులకు— అని యుండ దగును గదా! దానిని త్రోసిపుచ్చి 'లను' ను 'లకు' చేసి 'గని' ని 'గలి' చేసిరి. వారందలి చవులను గుర్తింపరైరి గదా!

శ్రీ మా నాయనగారు సంస్కరించిన సాధు పాఠము:

'కామినులకు జవుల నెట్లు గనిపింపనగున్'

అన్నది.

ఇందుండువారు ముప్వురు. ఒకరు లోకులు— రెండు కామినులు— మూడు కాముడు— వీరు. కామినులు లేనిచో (లోకులను మనోవికారుల జేయుటకు) కామున కెట్లు తరమగును? త్రిప్పి చూచునపుడు కాముకనికరము లేనిచో కామినులకు (చవులను) ఎట్లు గనిపింపనగును? అని. కావున పరస్పర మొకరి కొకరు ముప్వురును అవసరమే.

## ౪. అనుప్రాసము

తృతీయాశ్వాసాంత పద్యమిది దిగువ నీయ బడినది.

మేరునగ ధీరు నిరమిత్రు సుచరిత్రున్
(?) వారిధి గభీరు నిరవద్యు జన వంద్యున్
జారుతర మూర్తి నతి శాంతు గుణ వంతున్
మారహరు సర్వ జన మాన్యు మునిమాన్యున్.
యామి. ము.

ఇందు ప్రతి చరణమునను మూడేసి విశేషణము లున్నవి. కాని మా వ్రాతప్రతిలో ద్వితీయ తృతీయ చరణములందు—

'వారిధి గభీరు నిరవద్యు జనవంద్యున్
జారుతరమూర్తి నతిశాంత గుణవంతున్'

అని గలదు. అనగా నడిమి రెండు చరణము లందును రెండేసి విశేషణములు మాత్రమె యున్న వనుట. ఇక ప్రథమ చతుర్థ పాదము లందున్న విశేషణములు గూడ మూడేసి కాక రెండేసి యే యగుట బాగు. తుది రెండిటి ననుసరించి నడిమి రెండింటిని మార్పు చేయుట కన్న తద్భిన్నము గావించుటయే సొగసు. అర్థసౌష్ఠవమును గలిగి యుండును. చూడుడు. చతుర్థ పాదమున 'జనమాన్యు', 'మునిమాన్యు' అని వ్యస్తములుగ చెప్పుటకన్న 'సర్వజన మాన్య మునిమాన్యున్' అనుటయే అర్థవంతము గదా! పైతీరున నే 'నిరమిత్ర సుచరిత్రున్' కూడ

పద్యమున ననుప్రాస పారస్యము హాతము గాకుండుటకై రెండవ పాదము తుదిని గొంత

మార్పు చేయు టవసరము. మిత్ర, రిత్రుఁ ;
శాంత, వంతుఁ ; మాన్య, మాన్యుఁ, అని యన్నిట
నుండఁగా వద్య, వంద్యుఁ—అని రెండవ పాదమం
దుండుట అనుప్రాసమునకు భంగము.

'నిరవద్య జనవేద్యుఁ' అనుట ఒప్పు.

## ౫. ప్రారబ్ధపుణ్యుఁడు

కారుణ్యమూర్తి వలికారు నగేంద్ర ధీరుఁ
మారారి సర్వజన మాన్య సదా వదాన్యుఁ
నీరేజ పత్ర నిభ నేత్రు జగత్పవిత్రుఁ
ప్రారబ్ధ పుణ్య మితభాషు గుణాభిలాషుఁ.

యూని. ము. అష్టమాశ్వాసము–౧౯౯ ప.

కొంతికాలము క్రితము మా నాయనగారికి వారి మిత్రు లొకరు సందేహ నివృత్తికయి ఒక లేఖ వ్రాసిరి.

"ప్రారబ్ధపుణ్య మితభాషు గుణాభిలాషుఁ' – అని ఉన్నది—'ణ్యు'ని 'ణ్య'గ దిద్దినారు. ఏల? విశేష మేమైన గలదా?" అని.

ఆ లేఖకు సమాధానముగ వ్రాసినది.

" 'ప్రారబ్ధపుణ్యు' అని నా వ్రాతప్రతి. ఇదే సరియయినది. సుందరమయినది. మంచి యర్థము గలది. తొలి రెండు చరణములలోను మూడేసి విశేషణములు, తుది రెండు చరణములలోను రెండేసి ఉన్నవి. ఇట్టి చమత్కారము గుర్తింపక పూర్వాశ్వాసాంత పద్యములు కొన్ని చెడినవి. నీరేజ పత్రు, నిభనేత్రు, జగత్పవిత్రుఁ — అంటే — ప్రారబ్ధ పుణ్యు, మితభాషు, గుణాభిలాషుఁ—అందురుగాని. కాని పైన 'నీరేజ పత్ర నిభ నేత్రు అనలేదా? ఇందలి చమత్కృతి చూడుడు— అను ప్రాసము. కారు, ధీరుఁ, మాన్య, దాన్యుఁ; నేత్రు, మిత్రుఁ; భాషు, లాషుఁ— అని. అతనికి ప్రారబ్ధ పుణ్యు డనుట విశేషముగాదు. అతఁడు ప్రారబ్ధ పుణ్యులతో మితముగ భాషించువాడు. అత డెవరితో భాషించునో వారు ప్రారబ్ధపుణ్యులు. (ప్రారబ్ధమైన పుణ్యము కల వారు). పుణ్యరేఖ బయట పడినవారితోనే ఆయన భాషించుట. అదీ మితముగా, తొలి రెండు చరణాలలో గూడ విశేషణములు రెండేసియే యగునా అని జాల యోజించితిని. అవి మూడేసియే."

యూనివర్సిటీవారు తొలుత 'ప్రారబ్ధపుణ్య మితభాషు గుణాభిలాషుఁ' అను సరియైన పాఠమును ముద్రించియు, తుదకు 'పుణ్య' తప్పు—'పుణ్యు' ఒప్పు—అని తప్పొప్పుల పట్టికలో దానిని చేర్చిరి. ఏల మార్చవలసి వచ్చెనో ఎఱుక లేదు.

## ౬. విరియించు

మలయ సమీర మర్ది సుకు
మార లసత్సహకార నందనా
వలి నలిఁజొచ్చు జట్టికొని
వచ్చు గుచాలికి మెచ్చు నీరికల్
(?) దెలుపొనరించు గొందలిరు
లే గొనలఁ విరియించు దావన
ర్కిలి గబళించు నాదట ర
మించు మహిఁ విహరించు నామనిఁ.

యూని. ము. ఆశ్వా–౪–౧౦౪ ప.

ఈ పద్యమందలి యనుప్రాస చమత్కృతిని గూర్చి తిరిగి వ్రాయనక్కర లేదు. తృతీయ చరణమున సంస్కరణ మావశ్యము గదా!

'వెలుపొనరించు గొందలిరువెంచు ననల్ విరియించు వానివ' అనినచో సరిపడును.

కుమారసంభవమున నిట్టి యనుప్రాస చమత్కృతులతో కుస్తీపట్లు పట్టినాడు నన్నిచోడుడు. ఎన్నెన్ని చమత్కృతులు! అట్టి యనుప్రాస విశేషము లుండుట చేతనే పెక్కుపట్లలో కవిహృదయము ననుసరించి సాధుపాఠముల గుర్తింప వీలయినది. అట్టి పట్టులు లెక్కకు మిక్కుటములు. ఎన్నని యుదహరింప వచ్చును. చతుర్థాశ్వాసమునే పై పద్యమునకు దిగువ పద్య మిది చూడుడు.

'అలులొడగూడు బింబుగొని
యాడు మృదుధ్వని బాడు నోలిదొం
తులుగొని పాఱు జొంపముల
దూఱు సుగంధముమీఱు పువ్వు గు
త్తులపయి మూవు బువ్వొడుల
ద్రోవు వడిం దనివోవు మంజురుల్
వెలువడ సేగు దర్పమున
వీగు మదిఁ నలి లేగు నామనిఁ'

* * * *

దాని క్రింది పద్యము—దాని క్రింది పద్యము— అన్నియు నిట్టి వింత యల్లికలతోనే యున్నవి.

### ౭. పుట్టుంబట్టులు

"ఎటెట్టూ! శివు గల్చె నంటి నికమా
యీతన్వి దక్ గల్వగా
నట్టుల్ మెచ్చుక యున్న వే తపము సే
యం జొచ్చె నున్నాతడే
ముట్టుంబోలిన వానిగా దలచి యే
మోహించె దేశంబు లోఁ
పుట్టుంబట్టులు మాలెనే నగజ యా
భూతేశ్వరుఁ గల్వగాఁ !"

యూని. ము. ౭ అశ్వా—౭౦ ప.

పై పాఠములతో నర్థము సెప్ప గుదురదు. మా మిత్రు లొకరు పై పద్యమున కర్థము కుదురక తికమకలు పడినట్లు చెప్పినారు. 'శివు గల్చె నంటె నికమా యీ తన్వి' అని యేదో విభజన గావించుకొనిరట. కుదుర దయ్యెను. రెండవ పాదము సాగినది. 'ముట్టుంబోలిన' అనగా నేమో తెలియదయ్యెను. మఱికొంత సాగినది. 'పుట్టంబట్టులు' అర్థము స్ఫురింప దయ్యెను. తంటాలుపడి కొలుకుపడక పై పద్యమున కర్థము తెలుప వేడుచు మా నాయనగారికి జాబు వ్రాసిరి.

### సంస్కరణము - సమాధానము

'ఎట్టెట్టూ! శివుగల్చెనంటె నికమా!
యీ తన్విదక్ గల్వగా
నట్టుఁ మెచ్చుకయున్న వే తపము
సేయం జొచ్చె మున్నాతడే
ముట్టం బోలిన వానిగా దలచి
యే మోహించె దేశంబులో
బుట్టుంబట్టులు మాలెనే నగజ
యా భూతేశ్వరుఁ గల్వగాఁ'

పార్వతి తపము చేయుచున్నది. చతురికను గృతక బ్రహ్మచారి ప్రశ్నించుచున్నాడు.

ఎట్టెట్టూ! శివుని (పార్వతి) కల్చెఁ = ప్రేమించెను అంటి (వి) నికమా = [నిక్కమా అనుటకు నికమా అని నన్నెచోడకవి ప్రయోగము చేసొక చోట గూడ ప్రయోగించినాడు. 'చను దెంచిరే నికమా!' (౧౦-౧౩౮) బసవ పురాణము నందును 'నికము' ప్రయోగములున్నవి.] సత్యమా?

ఈ తన్వి (పార్వతి) తక్ = తనను (శివుని) కల్వగాఁ = ప్రేమింపగా - అట్టుఁ = ఆ విధముగా ప్రేమించినను - (అతడు) - మెచ్చుకయున్న [= మెచ్చుకుండుట వలన] వే = వేగముగ - తపముసేయం జొచ్చె (ను)! [ఏమి?] అతడే - ముట్టం బోలిన వానిగాఁ = పొందదగిన వానిగా, చేరదగినవానిగా - తలచియే = తలచియూ మున్న=పూర్వము (అతనిఁ) మోహించెను!

ఆ భూతేశ్వరుఁ = భూతముల కీశ్వరుడైన యా శివుని - కల్వగాఁ = ప్రేమించుటకు (ప్రేమించినదే!) దేశంబులోఁ - పుట్టుంబట్టులు = పుట్టుకకు స్థానములు-అనగా (పురుషుల) శరీరములు-మాలెనే = కరవాయెనా?

ఏమేమీ! పార్వతి శివుని ప్రేమించెనంటివి, నిక్కమా! ప్రేమించినను అతఁడు మెచ్చుకయున్న తపము చేయజొచ్చెనా! అతడే పొందదగినవాడుగా తలచి యా యేమి యాతని మోహించినది మీ చెలి. దేశములో నిక మనుజులే లేకపోయిరా ప్రేమించుటకు!

ఇది - ఆ సంభాషణము తీరు. సహజాతి సహజముగ నున్నది.

### ౮. పతి - సతి

తనమతి బతి రతి సతిమతి
కనుకూలముగా నిరీక్ష జాలాపాలిం
గన చుంబన వర కరణా
సన విద్యల గూడు నేని సమరతి బడయుఁ.

యూని. ము. అశ్వా. ౮—౧౬౧ ప.

ఇందు తొలి పాదమున వ్రాత ప్రతిలో

'తనమతి సతి రతి పతిమతి
కనుకూలముగా..........' అని సరియైన పాఠముండగా సతిని పతి గావించి, వెనుక నొక యర్థాను స్వారముంచి మార్పు చేసినారు. ఏల వలసెనో! తొలి చరణ మంతయు లఘు మగుటచే కాబోలును సతులు పతులై తికమకలు గొల్పుచున్నారు.

'తనమతి సతి రతి పతిమతి
కనుకూలముగా నిరీక్ష జాలా పాలిం
గన చుంబన వర కరణా

సన విద్యల గూడు చేని సమరతి బడయుఁగా'
అని యుండవలెను అర్థమిది.

రతియందు, పతిమతికి - తనమతి - అనుకూలము, కాఁగా అగునట్లు - సతి - (పతిని) కూడు చేని - సమరతిఁగా - పడయుఁగా. ఆ కూటమి ఎటులుండవలెననగా నిరీక్షణ, ఆలాప, ఆలింగన, చుంబన మొదలగు వరవరణములతోడను, ఆసనవిద్యలతోడను ఉండవలెను. ఇందు పై తీరున కూడునది, సమరతి బడయునది సతిగాని పతిగాదు. ఏలనన పైపద్యము చూడుడు.

వరసతి సురత కళాగమ
పరిణతుడగు విటుని గూడి పాయదు మఱి ద
ప్పరమున బాసియు పెన్నడు
నోరు గవయదు, జున్ను దిన్న యొట్టియ పోలెఁగా.

ఇందు విటుని గూడి పాయనిది—వరసతియే కర్త. క్రిందిపద్యముచూడుడు.

"..............................
..............................
అధిపు బాసి నపుడ యలదుర వలవద
మెలుత మెట్టబడిన మీను వోలె."

అలదుర వలవద ? ఎవరు ? మెలుతయే ! కావున నా పద్యమందును కర్త సతి యే యగును.

## ౯. తలఁపె తలఁపు

మరణ కాలమైన మఱి జన్మదేశంబు
దలచు నుష్ట్రి మట్టి తలఁపు దలపె—
యాని. ము. ఆశ్వ ౪-౧౬౭ ప.

ఉష్ట్రిపక్షి, మరణకాల మాసన్నమైనను జన్మదేశమునే తలచును. అట్టితలపే తలపు. ఇట్లుండవలసినది 'అట్టి తలపు దలపె' అని యచ్చులో నున్నది. దిద్దవలయును.

మరణకాలమైన మఱి జన్మదేశంబు
దలచు నుష్ట్రి మట్టి తలపె తలపు
అధిపు బాసినపుడ యలగుర వలవద
మెలుత మెట్టబడిన మీనువోలె'

ఆశ్వా ౪-౧౬౭. ప.

ఉష్ట్రిపక్షి తన యంత్యకాలమునగూడ స్వదేశమును దలచుకొనునపుడు మానవస్త్రీ - మెలుత - స్వజనమును (అధిపతిని) బాసినపుడు ఏడువ వలదా? ఏడ్చి మెట్టబడిన మీనువలె గిలగిల కొట్టుకొనవలదా ? అని భావము - బహు సుందరము.

## ౧౦. రూపు వలపులు

వలను గలదేని రూపేల వలను గలిగి
రూపు గలదేని వలపేల రూపు వలను
గల కళావతి గలిపించి కలిచి యుండె
చేని కామసుఖం బెల్ల వానియదియు.

యా. ము. ఆశ్వా. ౪-౧౬౬ ప.

పై ముద్రిత ప్రతి పద్యమున కన్వయము లేదు - అర్థము లేదు. సంస్కరణ మావశ్యకము.

వలను లేదేని రూపేల ? వలను గొలుపు
రూపు లేదేని వలపేల ! రూపు, వలను
గల కళావతి గలిపించి కలిచియుండె
చేని కామసుఖంబెల్ల వాని యదియు.

అని యుండవలెను. పూర్వోక్త పద్యమందలి యర్థమును, ప్రకృత పద్యమందలి యర్థమును బరికించి చూతము. అందేది సరియో !

వలను గలదేని రూపేల? వలను = ప్రేమ, కలదేని = ఉన్నచో, రూపేల రూప మెందులకు ? వలనున్నచో రూపుండ నవసరము లేదని భావము.

వలను గలిగి రూపు గలదేని వలపేల ? ఇది సరికాదు. 'వలను గలిగి రూపు' కాదు 'వలనుగొలుపు రూపు' ఉండ వలయును. ఆ రూపు ఎట్టిదై యుండవలె నన వలను గొలుపు నట్టిదై యుండవలెను. అట్టి రూపు గలదేని మఱి వలపెందులకు ? రూపున్నచో వలనుండ నవసరము లేదని భావము.

ఆ రెంటిలో నేదేని యొకటి యున్న చాలునని భావించునపుడు 'రూపు వలను గల కళావతి' యనుచున్నారే ! అసందర్భముగ లేదా?

'గలదేని' కాదు ఉండవలసినది. 'లేదేని' ఉండవలెను. ఇపుడు చూడుడు.

వలను లేదేని రూపెందులకు ? రూపు లేదేని వలపెందులకు? ఏ యొక్కటి యున్నను లాభము లేదు - వలను, రూపూ రెండును గలిగిన కళావతిని గనుక ప్రేమించినట్లు చేసి, తాను ప్రేమించి- ఉండె చేని - కామసుఖ మంతయు వానిదె యగును గదా !

## ౧౭. బాకు - పాకు

పోర బాకు దాల్చి నీరు గొన్నటు ప్రతి
బలము సెల్ల పాయవడగజేసి
గొడుగు క్రింది రూపు బోడిచి నీ
కీర్తి నధిప వన్ను నింతవన్నుఁ.

యాని. ము. ఆశ్వా ౧౧-౩౭ ప.

ఇది అచ్చయిన పాఠము. ఇందు బాకు దాల్చుటకు నీరు గొనుటకు సమన్వయ మేమో తెలియరాదు. శ్రీ కవి గారి ప్రతిలోను నిట్టే గలదు - (బాకు అనగా కత్తి యని టీక).

సంస్కరణము.

పోర పాకు దల్చి నీరుగొన్నటు ప్రతి
బలము సెల్ల చాయ వడగజేసి
గొడుగు క్రింది రూపు బోడిచి నీ
కీర్తి నధిప వన్ను నింత వన్నుఁ.

పల్లెపట్టులు కనుసన్నలలో మసలుచుండు వారి కీపద్యార్థము దృగ్గోచరము కాగలదు. సాధారణముగ సరస్సులలో గాని, బావులలో గాని మఱే యితర జలాశయములలో గాని దిగి నీరు గొను నపుడు రెండు చేతులతోను పారగప్పిన పైపాచి నీటిని తొలగ ద్రోసి యిష్టఫల సిద్ధిని పొందు చుందురు. ఆ సందర్భమే యిట ఉపమింప బడినది.

పాకు = పాచి (పట్టినపై నీటి) ని, తల్చి = తొలగ ద్రోసి - నీరు గొన్నటు = నీరుగొను విధమున పోరన్ =యుద్ధమునందు. ప్ర తి బ ల ము సెల్లన్ - పాయన్ - చేసి - విజయమును నీ కీర్తును - అని భావము.

పాచి నీటిని తొలగ ద్రోసి. నీరు గొనుట సర్వసామాన్యమే యయినను కావ్యస్రష్టలగు మహాకవులు కొందరు దా సందర్భమును గ్రంథస్థమును గావించినారు. ఆ నీటిని గొను పద్ధతిని పద్మపురాణములో నెట్లు వర్ణించినాడో కవి చూడుడు.

"శైవలం కిల విహాయ నిర్మలం కేవలం ఖలు జలం నుపీయతే" పద్మ - ౩ ఆశ్వా.

పాకు = పాచి ('బిసరుహము పాకు దాల్చియు' నన్నెచోడుడే వేఱొకచోట గూడ ప్రయోగించినాడు)

అది పాకుగాని బాకు కాదు.

* * *

కుమార సంభవ మొక గని వంటిది. వెదుకను వెదుకను వింతలు, విశేషములు బయల్పడు చుండును. నన్నెచోడుడు త్రొక్కనబాట త్రొక్కెడి. శైవసంప్రదాయానుసారులైన సంస్కృత మహాకవుల నెందఱినో అనుకరించినాడు. (ఈ యనుకరణమునకు గారణ మాతనికి వారిపైగల గౌరవాభిమానము లే:) సుమూలము లైన పద్యము లనేకము లున్నవి. ఛందోరీతులలో గూడ చిత్రములైన పద్ధతుల నవలంబించినాడు. వింత యొల్లిక గల్గిన పద్యము లనేకము లున్నవి. రసము, భావము, రీతి అనునవి మూడును అతని కవిత్వమున నుప్పిరిగొని జిగిబిగులతో ముచ్చట్లు గొలుపు చుండును. శ్రీ మా నాయన గారు కుమార సంభవము తొలి యాశ్వాసమున కొంతవఱకు విపులమైన వ్యాఖ్యను విరచించినారు. అది వదలి తక్కిన వాటినే యిందు తడవినాను.



శ్రవ్యనాటిక :

# పొలిమేర



(బాదామినగరంలో పులకేశి దర్బారు. బౌద్ధభిక్షుణి, హర్షుని చెల్లెలు, రాజ్యశ్రీ రాజసమక్షాన్న నిలచింది.)

రాజ్యశ్రీ : పులకేశి మహారాజా ! ఆంధ్ర రాజన్యవంశీకులు సర్వధర్మరక్షకు పేరుపొందినవారు. అమరావతిలో ఇక్ష్వాకులు బౌద్ధధర్మానికి అపుర ప్రతిష్ఠ చేర్పరిచారు. ఆంధ్రవంశీకులనీ, దక్షిణాపథ చక్రవర్తులనీ, పేరుపెట్టుకొని, జన్మతః సత్యాశ్రయులని పేరుకలిగి, నేడు బౌద్ధారామాలమీద ఈ దుండగానికి తమ రెందుకు పాల్పడ్డారో నాకు తెలియ లేదు.

పులకేశి : అమ్మా! ఆసనం అధిష్ఠించండి. మీ నామధేయం తెలిపారు కారు.

రాజ్య : రాజా, బౌద్ధభిక్షుకినికి, నామముతో పని యేమిటి. అయినా, మహారాజా అడుగుతున్నారు గనుక చెప్పుతున్నాను. నా పేరు యశోమాయి. ఈ బౌద్ధారామంలో త్రిశరణాలను ధ్యానించుకొంటూ, బుద్ధదేవుని బోధలను, నా ఎరిగినంతవరకూ ప్రజలకు విశదపరుస్తూ, ఆరామంలో ఒక మూల కూర్చుని ఉన్నదానను. నా ఆరామాన్ని నిర్జీవంగా చేసివైచి, నన్ను బందీనిగా చేసి రాజాస్థానానికి ఎందుకు రప్పించారో, నాకు తెలియటంలేదు.

పుల : క్షమించండి మాతృశ్రీ, మిమ్మల్ని బందీలను చేయలేదు. కాని దక్షిణాపథాన్న బౌద్ధమతం పేరిట జరుగుతున్న రాజకీయ చాణక్యాన్ని, మత సహిష్ణుత పేర ఇక సహించలేమని మనవిచేసు కొంటున్నాము.

రాజ్య : అచౌర్య, అహింస, సర్వమానవసేవా, ఆదర్శాలుగా గల భిక్షుకులు, శ్రమణకులునా రాజకీయచాణక్యాలు జరిపేది? బౌద్ధులు ఐహిక దూరులే! విషయవిసర్జితులే! నిర్వాణపథగాములే! ఈ మేక పిల్లల వల్లనా దక్షిణాపథచక్రవర్తి, తన రాజ్యానికపాయను శంకించేది? ఈ అమాయకులపై మిథ్యాపవాదాలు కల్పించి హత్యాకాండను ప్రేరేపించట మేనా ఆర్యధర్మము ?

పుల : అమ్మా, ఒక్క మా టడుగుతాను చెప్తారా! మా భటుల దురాగతంవల్ల, బౌద్ధ ఆరామంలోని ఒక్క ఇటుకరాతికైనా, స్థానభ్రంశమైందా? అహింసామార్గం అవలంబించిన ఒక్క శ్రమణకునికైనా కించిదపాయం ఏమైనా వాటిల్లిందా? ఇన్ని మాటలెందుకు. ఒక్క విషయం చెప్పండి. మీ పూర్వాశ్రమంలోని నామాక్షరాలూ, కులగోత్రాలు, బహిర్గతం చేసి, రాజకీయచాణక్యాలు ఏమీ లేవని మీ గుండెమీద మీరు చేయివేసుకొని చెప్పగలరా ?

రాజ్య : (మందహాసంతో) నేను బౌద్ధభిక్షుకిని. పూర్వాశ్రమంలో, నే నెవరినన్న చింత నాకే లేదు. పరులకు ఆ ప్రసక్తి మరింత అనవసరం.

పుల : ఇన్నాళ్ళూ మేమూ అనవసరమే అని భావించాము. కాని, సామ్రాజ్య విస్తరణ దాహంతో యావద్భారతానికి చక్రవర్తి కావాలని, బౌద్ధమతాన్ని అండచేసుకొని కృషిచేస్తున్న హర్షరాజేంద్రుల సోదరిని, మాకు ఏ ఉపద్రవం తలపెట్టలేని నీరసురాలినిగా భావించి అగౌరవ పరచలేము. అమ్మా, మించిరాకముందే, మీ దేశానికి మీరు, మా రక్షతో తరలిపొండి. ఈ సాయంత్రమే మిమ్మల్ని సురక్షితంగా నర్మద దాటించి, ఉత్తర హిందూస్థానం చేర్పించేందుకు, మా దండనాథులు వెంట వస్తారు. రేపు, నర్మద పొలిమేర, మాకు సంచారయోగ్యం కాదు.

రాజ్య : సర్వధర్మరక్షక బిరుదులైన ఆంధ్రరాజులు, అహింసా ధర్మనిష్ఠులూ, అమాయకులూ

అయిన బౌద్ధసాధ్వులను, అందులోనూ స్త్రీలను, స్థానభ్రష్టులను చేసి -

పుల : బౌద్ధమత అహింసాస్వభావాన్ని మీ నోట చాలసేపుగా వింటున్నాం. రాజ్యత్యాగియై సన్యాసియై, గౌతమదేవుడు అహింసను ప్రపంచంలో బోధించి వెళ్ళాడు. ఆర్యధర్మం, గౌతమదేవుని, అవతారంగా భావించింది. అహింస ఆర్యధర్మాలకు మూలస్తంభమని ఆర్యు లెరుగుదురు. కాని, ఆయన పేరిట, మతాన్ని సృష్టిచేసిన, మీ రేమి చేశారో చూడండమ్మా. అహింస పేరిట, యుద్ధకాంక్షతో సామ్రాజ్యాలు సృష్టిస్తున్నారు. సత్యాహింసలు ఆర్యులకు క్రొత్తలు కావే! తక్కిన లౌక్యధర్మాల నన్నిటినీ విస్మరించి, వాటిపేరిట అత్యాచారానికి కూడా పూనుకొనే, ఏకపక్షసంకల్పాన్ని ఆర్యు లెరుగరే! బౌద్ధమతం వ్యాపించిన ఈ వేయి సంవత్సరాల లోపల జరిగినంత రక్తపాతము, అత్యాచారము, భరతఖండంలో, ఒక్క భరతఖండమే కాదు—జంబూ ద్వీపంలోనే మునుపు లేదే! అమ్మా! మీరు స్త్రీలు. మీతో ఎదురు వాదించడం మాకు గౌరవప్రదం కాదు.

రాజ్య : పులకేశి మహారాజా! ఆంధ్రరాజులు వేయి ఏండ్లనుంచి పాలిస్తున్న నీతికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. బౌద్ధధర్మానికి మూలపీఠంగ విరాజిల్లిన దేశం—నాగార్జునాచార్యుల కన్న దేశం —ఇచటనే బౌద్ధానికి స్థానం లేదా?

పుల : ఆర్యధర్మభాగంగా, బౌద్ధసూత్రాలకు ఏనాడూ ఇక్కడ స్థానం ఉంచనే ఉంది. కాని, ఆ సూత్రాలు, వేరే మతం రూపం దాల్చి, బౌద్ధం పేరిట విలసిల్లి, ఆంధ్రరాజ్యాన్ని ఛిన్నాభిన్న మొనర్చటం కన్నార చూసి, ఈనాడు మా పొలిమేరలను ముంచెత్తివస్తూన్న ప్రవాహం చూస్తూ కూడా జడులమై కూర్చునే, నిర్గుణులం మాత్రం కాము. మీ శ్రమణకులందరూ హర్షరాజులకు వేగులవారై ప్రవర్తించారు. అప్పటికీ మేము, దయాబుద్ధితో, వారిని మా పొలిమేర దాటించి తరలించాము. మీరు కూడా క్షేమంగా తరలివెళ్లండి.

రాజ్య : (వికటంగా నవ్వుతూ)—రాజా, మత సహనం లేక వెళ్ళగొట్టూన్న వాడివి, అమాయకుల మీద ఈ అపనిందకూడా ఎందుకు—

[ప్రతిహారి ప్రవేశము]

ప్రతి : జయం, జయం, పులకేశి మహారాజులకు! హర్షరాజుగారివద్దనుంచి బాణభట్టారకులు ఏదో సందేశార్థమై తమను చూడవచ్చారు.

పుల : ఓహో, శ్రమణకులింకా నది దాటలేదు. బౌద్ధధర్మరక్షకుడు హర్షరాజు, కవీంద్రులచేత అప్పుడే సందేశం పంపించాడు. చూచారా అమ్మా! వేగరుల విషయంలో మాది నీలాపనిందకాదని తెలుస్తూందా! బాణకవీంద్రుని లోనికి రానియ్య.

ప్రతి : చిత్తం (నిష్క్రమణ—బాణుడు ప్రవేశం)—

బాణు : బాదామిరాజులను సత్యాశ్రయులకు జయం. భారతచక్రవర్తి శ్రీహర్షులవారు తమతో కొన్ని మాటలు విన్నవించమని నన్ను పంపారు.

పుల : (మందహాసంతో) - గంగా సింధుమైదానముమాత్రమే భారతదేశం కాదని, వింధ్యకు దక్షిణాన స్వతంత్రదక్షిణాపథమూ, పులకేశీ, కలరని హర్షరాజుకు తెలియకపోయినా, బాణకవీంద్రులకు తెలియదా?

బాణ : రాజా, ఆ విషయం అప్రస్తుతము. బౌద్ధారామాలను నాశనం చేయటం, బౌద్ధమతానుయాయులను ఊచకోతగా నరికివేయటం, సత్యాశ్రయులకు క్షేమంకరం కాదని, విశాల భారత సామ్రాజ్యంలో మతసహిష్ణులైన మిత్రరాజులుగా వుండవలసిందని, హర్షచక్రవర్తి మీకు తెలుపమన్నారు.

పుల : బౌద్ధమతానుయాయులు ఎందరు చిత్రవధలపాలయ్యారో, అడుగో సాక్షాత్తూ శ్రీహర్షుల సోదరీమణి రాజ్యశ్రీదేవిగా రున్నారు-వారినే అడిగి తెలుసుకోండి.

బాణ : ఎవరు, అమ్మాయిగా, రాజ్యశ్రీ!

రాజ్య : పూజ్యులను బాణభట్టారకులకు నమస్కారము. పులకేశిరాజు చెప్పినట్లు చిత్రవధ జరుగలేదు. కాని బౌద్ధమతస్థులందరూ, నర్మద ఉత్తరాపథానికి తరలింపబడ్డారు.

బాణ : రాజా, శ్రీహర్షులతో మైత్రే మీకు క్షేమంకరము.

పుల : మైత్రికి మా అభ్యంతరం లేదు. కాని

మైత్రి అంటే శ్రీహర్షుని చక్రవర్తినిచేసి సామంతత్వము అందుకోమనేనా కవీంద్రుల భావం!

బాణ : సామంతత్వమని అనుకో అక్కర్లేదు. శ్రీహర్షులు దిగ్విజయ మొనర్చిన రాజశేఖరులందరూ, హర్షుని రాజ్యాంగసమితిలో సభ్యులు. ఏకసూత్రప్రాయంగా భారతదేశం అంతా నడిచేందుకు, సర్వభారతక్షేమాన్ని ఉద్దేశించి, హర్షులు నామమాత్రంగా సింహాసనం అధిష్ఠిస్తున్నారు తప్ప, రాజ్య నిర్వహణ అంతా ప్రజాతంత్రయుతమైన సమితివల్లనే జరుగుతుంది. ఆ సమితిలో మీరూ ఉన్నతసభ్యులుగా ఉంటారు. మీ రాజ్యపాలన, సమితి అభిప్రాయానుసార్యంగా, మీరే చేస్తూ ఉంటారు.

పుల : బాణకవీ, ఆదర్శంలో, భావద్వారతః పరంగా, ఈ ప్రజాతంత్రాన్ని రమణీయంగానే కనపరుస్తున్నారు. కాని వాస్తవికతను గుర్తించండి. సమితిలో సభ్యులంతా హర్షానుయాయులు, బౌద్ధానుయాయులు, అయిన ఉత్తరదేశ రాజన్యులే. వింధ్యపర్వతా లడ్డుగా ఉన్న దక్షిణావర్తప్రజల హితమేదో, వేయిమైళ్ళదూరంనుంచి ఆ సమితి నిర్ణయించటం క్షేమంకరమా? సమీపస్థుడనైన నేను పూనుకోటం క్షేమంకరమా. అయినా, ఆంధ్రరాజులోకరి సామంతులు కారే!

బాణ : సముద్రగుప్త చక్రవర్తి దక్షిణాపథాన్ని, జయించిన విషయం సత్యాశ్రయులకు జ్ఞాపకం లేదేమో.

పుల : (నవ్వుతూ) — అవా డీ పులకేశి లేదు. సముద్రగుప్తరాజు చేసిన రామేశ్వరయాత్రను దిగ్విజయంగా భావించే రాజు లెవ్వరూ వింధ్యకు దక్షిణాన లేరు. పాత చరిత్ర లెందుకు. ఈనాటి మాటే చూసుకుందాం. ఏ అధికారంతో హర్షరాజు మమ్మల్ని కప్పం కట్టమంటున్నాడో, ఆ ధనం, మేం, ఎక్కడినుంచి తేవాలో, కొంత సెలవిస్తారా?

బాణ : (నవ్వుతూ) బాదామి రాజులంత పేదవారైతే హర్షచక్రవర్తి కొద్ది కప్పానికే ఒడబడవచ్చునేమో.

పులకే : (నవ్వుతూ)—కవీంద్రా, సత్యాశ్రయులై, ధర్మసమ్మతంగా ప్రజారక్షకు సింహాసనస్థానాన్ని నిల్పిన రాజులంతా పేదవారే. ప్రజల పంటలో ఆరవ వంతు వసూలు చేసి, ప్రజాక్షేమానికి, రక్షకు వినియోగపరచటం, మా ఆర్యరాజన్య ధర్మం. బౌద్ధమతానుయాయులగు హర్షుల కిది ధర్మం కాకపోవచ్చును. అందుచేత పరులకు కప్పం కట్టగల్గినంత అధికంగా కూడా వీరు ప్రజలనుంచి పిండవచ్చునేమో.

బాణ : రాజా, హర్షులకు మిమ్మల్ని సామంతులు కమ్మనేందుకు అధికార మేదని అడిగారు. మీకున్న సైన్యం పదివేలలోపు. హర్షులకు సుశిక్షితమైన అరువదివేల సైన్యం ఉంది,

పుల : రాజ్యశ్రీదేవీ! శ్రమణకులు నా సైన్యపు వేగునుకూడా హర్షులకు తెలియపర్చారు కదమ్మా, వేరు నిదర్శనం కావాలా?

రాజ్య : ధర్మం శరణం గచ్ఛామి.

పుల : అవును. ధర్మమే శరణము. ఆ మాటకు నాకూ అభ్యంతరం లేదు. బాణకవీంద్రా, రాజ్యశ్రీదేవిని సురక్షితంగా వారి సోదరులవద్దకు చేర్చండి. నామాటగా హర్షుల కిల్లా చెప్పండి. హర్షరాజా, అహింసామతావలంబి. సర్వసంగపరిత్యాగము బౌద్ధధర్మము. అయినా వారిని మేము ఉన్నవాటిని వేటినీ వదులుకోమనటం లేదు. దురాక్రమణకు బయలుదేరిన అరవై వేల సైన్యంకన్నా, మాతృదేశ రక్షణకై దీక్షపూనిన పదివేల సైన్యమే అధికమని చెప్పండి. వృధా రక్తపాతం నాకూ హితవుకాదు. వాస్తవికంగా, ధర్మకంచుకం ధరించి దురాగతానికి సిద్ధపడటం, హర్షులకు శ్రేయస్కరం కాదని చెప్పండి. ఉత్తర దక్షిణాపథాలకు నర్మద పొలిమేర. ఈ పొలిమేరను నేను దాటబోను. వారిని దాటి ఇవతలికి రానీను. ఇక సెలవు. అమ్మా వెళ్ళిరండి. కవీంద్రా సెలవు.

బాణ : రాజా, ఇదే సమరానికి ఆహ్వానమా?

పుల : (నవ్వుతూ) కవీంద్రా, ఆహ్వానమక్కరలేకుండానే, హర్షుని సైన్యాలు మా పొలిమేరకు - నర్మదకు-పదియోజనాల దూరంలో, బాణభట్టారకుని మాటకు ఎదురుచూస్తూనిలచాయని, మాకు తెలుసును. మా ప్రయత్నంలో మేం ముందుగలం. అక్కడినించి ఒక అడుగు ముందరకు వేసినా, హర్షులకు క్షేమకరంకాదని చెప్పండి. శీఘ్రమే వెళ్ళిరండి, నమస్కారము. దండనాథా, వీరిని జాగ్రత్తగా పొలిమేర దాటించు.

### ౨ రంగము.

(నర్మద ఒడ్డున హర్షుని శిబిరం.)

బాణ: అబ్బా, ఏమి విడ్డూరంగా జరిగిందో! ఏనుగులన్నింటిని పులకేశి సైనికులు నర్మదానదీ మధ్యంలోనే, బాతులపట్టే వాళ్ళలాగ వచ్చి, తొండాలు నరికి చంపేశారు,

హర్ష: పులకేశి, సగం సైన్యాన్ని ఇవతలఒడ్డునే అడివిలో దాచాడు. శ్రమణకుల వేగు సరిగ్గా లేదు. ఎంత సిగ్గుపాటు! అపజయ మెరుగని హర్షచక్రవర్తి, అరువదివేల సుశిక్షితసైన్యాలూ, ఊరూ పేరూ లేని ఒక దక్షిణాపథపు మన్నెదొర నడిపిన అడివి మను ష్యుల దండుకు బలి అయిపోయాయి. బాణభట్టారకా! ఇంత రక్తపాతం అవుతుందని నేను అనుకోలేదు. శాంతివిధానంలోనే, ఈ రాజు కలిసి వస్తాడను కొన్నాను. యావద్భారత దేశాన్ని ఏకంచేసి, ఒక్క త్రాటిమీద నడిపిద్దా మనుకొన్నాను. ఆ ఆశ ఫలించం లేదు.

బాణ: చక్రవర్తీ, ఇంతటి విశాలభూఖండం, ఏకమతపరిపాలనకింద నడువదగినదే, విస్తృతమైన ఆర్య ధర్మాన్ని మా ఋషులు ప్రవచించారు. తద్వ్యతి రిక్తంగా, ఒకటి రెండు సూత్రాలను మతంచేసి, దేశమంతా వ్యాపింపచేయాలన్న ఆకాంక్ష, మారు రూపు అందుకొని, సామ్రాజ్యతృష్ణగానే, ఇన్ని వందల ఏళ్ళుగా నూ వ్యక్తమవుతూ వచ్చింది. తమకూ, ఆ అపవాదు తప్ప లేదు. సత్యాశ్రయుడూ, ఈ మాటే అన్నాడు.

హర్ష: నాకు ఏ తృష్ణా లేదు. ధర్మతృష్ణ ఒకటే. గౌతము దేవుడే సాక్షి.

[పులకేశి ప్రవేశించి.]

పుల: ఒక్క ధర్మతృష్ణయేనా, బౌద్ధమత వ్యాప్తిపేరిట సామ్రాజ్యతృష్ణకూడానా, హర్షరాజా?

హర్ష: ఎవరు! సత్యాశ్రయరాజేంద్రుడా.

పుల: అవును. నేనే పులకేశిని.

బాణ: మీ రిల్లా స్వయంగా మా సైన్యాల మధ్యనుంచి రాగల్గారా?

పుల: (నవ్వి) బాణకవీ! హర్షరాజా! ఒక్క సారి చుట్టూ పరికించి చూడుకోండి. మా సైన్యా లున్నాయో. మీ సైన్యా లున్నాయో. మీరు కూడా కత్తి చూస్తారా, అహింసే ఆయుధమా?

హర్ష: (కత్తిదూసిన చప్పుడు)–అహింస, వీరు పుల లక్షణంగా సత్యాశ్రయులు భావిస్తున్నట్టు న్నారు.

పుల: రానీయండి. యుద్ధప్రవీణులయిన హర్షు లతో ఒంటిపోరాటం నాకూ హర్షదాయకమే— (కత్తుల పోట్లాట చప్పుడు.)

పుల: హర్షరాజా, ఆత్మరక్ష మాత్రమే కాదు. శత్రుశిక్షణకు కూడా మీరు కత్తి సారింపవచ్చును. రానీయండి మీ కత్తిని.

హర్ష: రాజా! చేత కత్తి నిలుపుకో, చాలును. (కత్తితో కత్తిని దూరంగా విసిరి కొట్టిన చప్పుడు)— ఇప్పుడు నిరాయుధుడివి చంపదమేనా మీ ధర్మం! హుం!

పుల: హర్షవర్ధనా! కత్తి శత్రుల చేతిలో నున్నంత కాలమూ పులకేశి నిరాయుధుడు కాడు.— (కలబడిన చప్పుడు)— ఇదిగో నీ కత్తి. మరల నీకే దానం చేస్తున్నాను. హర్షులతో ద్వంద్వయుద్ధం చేయాలన్న నా కోర్కె ఫలించింది. ఇక పోరాడటం అనవసరం.

హర్ష: సత్యాశ్రయా, నేను ధర్మ రక్షార్థినై బయలుదేరాను.

పుల: హర్షరాజా, అదే నీ ఆదర్శం అయితే నా రాజ్యంలో అది నేనే పాలించుకోగలను. మనం మిత్రులంగానే మిగిలిపోతాము. ధర్మానికి ఏకైక రక్ష కుడను నేనే అనుకోటం కంటే, ప్రపంచానికి అప కారం వేరే లేదు. నీ పొలిమేరలలో, నీవు ధర్మరక్ష చేయి. నా పొలిమేరను దాటి నేను రాను ఇక్కడ ధర్మానికి భంగమయినప్పుడు, నువ్వు రానక్కరలేదు. ఇది అపజయంగా భావించకు. ధర్మానికి విజయంగా భావించి ధర్మసేవకుడవుగా విజయప్రతిష్ఠ అందుకో. సురక్షితులై పోయిరండి. నేనూ నా సైన్యాలు, నర్మద అవతలకు కదలిపోతున్నాము.

హర్ష: పులకేశీ! నిజంగా నువ్వు నా సోదరుడివి. మతం కాదు, ధర్మం, రక్ష అని తెల్పావు: ఒక్కసారి కౌగిలించుకోనీ, నీ విజయం నా విజయంగా చేసు కొంటాను.

బాణ: ఉత్తర దక్షిణాపథ చక్రవర్తులకు ధర్మమే రక్షగా నుండుగాక. ఎవ్వరూ ధర్మపు పొలిమేరలను దాటకుందురు గాక. తథాస్తు.

— వి. డి. ప్రసాదరావు.

—

# నాహృదయం

'విశ్వం'

కందకు లేనిదురద నాకు కెందుకనీ,
పందికి కాని బురద బాపని కెందుకనీ,
అందరూ అందలా లెక్కితే
మోసేవాళ్లె వరనీ,
ముందుంటే ముఖమూ
వెనకుంటే వీపూ, అనీ
తింటాన పదాల్లో ఊరవేసిన దబ్బులన్నీ
అందికా పొందికా లేకుండా ఆలాపిస్తూ
ఎందు కవస్థ పడతావు బాబూ
సుందరమున్నది సుకళ్ళపండుగ;
తింటూ! రమ్మంటూనే మడికట్టుకోవాలే,
పంటూకా పెట్టి పగ్గుకోవాలే,
అందాకా ఎందు కిప్పుడే
ఆలకించరా నామాట సోదరా !
అని సహస్రవిధాల నాజవరాలు
మగటాల మగసిరి మాటలు చెప్పి
మగటి మత్తు వదుల్చు మంత్రాలు నేర్పి
నిత్యయవ్వన మందు నిష్ఠ నెఱిగించె
సత్యలోకము జూచు సత్తువనిచ్చె
దివ్యత్వ మందించు దీక్ష నొసంగె
నతికతో వీరకంకణము కట్టించె
కవ్వించి నవ్వించి కావ్యాలు చదివె

ఎంతతియ్యని పాలు నాజవరాలు
ఎంత చక్కనివాలు నాప్రియురాలు

కామించి ప్రేమించి కౌగిలింపుల ముంచి
చేమంతివిరులతో సరులు గుచ్చగబోదు
చాటుమాటల తలపుచాయ జూపగబోదు
ఏటుపోటుల ద్రోసి హింసించబోదు
ఘాటైన వాంఛావికారాలతో మరు
ద్వాటికా పారిభద్రప్రభల జూప, క
క్కటినుంచి మైత్రి చొక్కటము
చేర్పించి, చు
క్కటి సుంజెలోని అక్కటికం
గొప్ప చ
క్కటిదారి జూపు నెక్కడి
వెలువ్వనాలు

ఎంత తెల్లనిపాలు నాజవరాలు
ఎంతకమ్మనిజాలు నాప్రియురాలు

కోమల పుష్పదామ వినిగూఢ
పరిమళ హార్షధార నీ
యామని ప్రొద్దులం
కనుల నాపడనీని తలంపులన్
సుధాయామినులన్
పయింబయి విహాయస మెక్క
సరాగవాంఛలన్.
కోమలి నాయెడంద మెలగున్
నళినీదళ వారిబిందువై

ఆమెమాట వినకుండా
ఆమెదారి చనకుండా
కోమలి తలకట్టువట్టి
కూలద్రోయ నుంకిస్తూ
కామరూప భీషణరా
క్షస రాజొకడున్నాడూ

నాహృదయంలో
నాహృదయంలో

పామువగా వచ్చిదగా
రోమరోమమునను విషం
జామురాత్రి సామంతం
కామకేళి సంతర్పణ
రామా నైశేశికాచ్ఛ
దామ నామ సంకీర్తన.
సమాధిక్కృత కాంక్షా
ధూమావిల మాదర్శం

సోమరితన మహోద్యోగం
పామరజన సాహిత్యం
శ్రీమంతులపై ద్వేషం
శ్రీమంతులపై మోజూ
ఖామందుల కొలికోడు
రాంబందుల రచ్చబండ
రంకు విసనకర్రల పా
రాణి, చీరచెరగుపరిగ
రాక్షసి రాక్షసి రాక్షసి
కుక్షింభర భిక్షాటన
సాక్షాత్కార ప్రసిద్ధ
నిక్షేపం, విక్షేప, మ
వక్షేపం, ప్రక్షేపం
మక్షికాలు
శిక్షించిన
పక్షి — వీడు
సౌందర్యం చూచి కొరికి తినాలనుకుంటాడు
సౌజన్యంచూస్తే పురుగులు పారాడుతాయి
వాని వెన్నెముకలో.
గాజు పెంకులే వాడికి
భోజనసామగ్రి
నాజూకుతనం వాడికి
నల్లపాషాణం
బతుకుచేదు నాలుకకు తగిలితే
బ్రహ్మాండం మునిగినట్లు బొబ్బరిస్తూ
భ్రమాదుర్గం నిర్మించుకొని
ప్రమను మరచి పోవాలనే
నికృష్టజీవనుడు
కష్టే ఫలీ అనే మాట నమ్మని
నష్ట వర్తనుడు.
శిష్టుల నష్టాలు చూచిన ద్వే
భ్రష్టుడు.
ముష్టి డబ్బులతోనైనా సరే
సుష్టుభోజనం తినే
దుష్టుడు.
శ్రమజీవులతో
సుమహృదయులతో
లమితో తన పేనా మోయించుకొని
కమిలిన కుచికచికోసం
జమాయించి వెడలుతాడు.

యుగయుగాల క్రిందట నీలాగే
పొగరుబోతు నహుషమహీపం
ఎగబడి పొడవబోయి
బొక్కబోర్లపడిందిరా అంటే
ఎక్కనేనెక్కదు వాడిచెవికి.
వట్టిపిరికి
గట్టిగా అదిలిస్తే
గజగజలాడుతాడు
మెత్తగా ఉంటే
నెత్తి నెక్కుతాడు
నిట్టనిలువున తల
కొట్టించుకుంటాడు
పరశ్రమోపజీవి
పరప్రతారణమే పని
చిరంజీవి కావాలని
పరంపరాగతాచార మని పేరుపెట్టి
చిరిగిన పుల్లాకులు కట్టుకునే
అరకాసు వెధవ
తురీయాశ్రమం తీసుకున్నట్లు నటిస్తూ
ద్వితీయాశ్రమంలో శిష్ట వేసిన
దివ్యమంగళ విగ్రహుడు.
చరమక్షణంలో కూడా
పరమసత్యాన్ని గుర్తించని
పరమ భండాలుడు.
కర్మదూరుడుకనక
ధర్మదూరుడు.
ధర్మబ్రహ్మవాది గనక
నిర్మలుడు కాడు.
చర్మగోవుడీ, మనసు తోలేలుడీ
దురాత్ముడు.
నాజవరాలిని
చెరపట్టాలని
తారట్లాడిన
జారుడు, చోరుడు.
పరమ ప్రణయాన్ని
చెరచి చెన్నంగిలిత్తాల సుక్క
చరిత్రహీనుడు.
ధరలో జరిగే
దక్షయజ్ఞంలో

కుక్షినిముందిడుకొని
దక్షిణలకోసం
అక్షులువిప్పక కూచున్న
భిక్షుకుడు.
నక్షత్రాలు దుల్లగొట్టి
కక్షపాలలు పగులగొట్టి
సాష్టాన్మ ప్రత్యక్ష దేవతల్లా
ప్రత్యక్షం కామన్నా.
లక్షలాది ప్రమథగణాలకూ
శిక్షారూప వీరభద్ర భద్రకాళులకూ
ఈక్షణం దాకా
వీక్షించ సంకించని
అక్షర జ్ఞాన శూన్యుడు.
రూక్షా వైక్ష్యంతో ఫా
లాక్షుడు నిటలాక్షి విప్పి
లక్ష నదుల రుధిరంతో
అక్షౌహిణీ బలగంతో
అక్షి పక్ష విక్షేపా
క్షిప్త చిత్ర రటన్నటన
క్షిప్ర చటుల పటచ్చరణ
విప్రకీర్ణ ఝణంఝణాల
ఘప్రసుల తమస్సు రేపి
బీభత్సం జేసి వేయ
ధంధం శంఖాధ్వనితో
ఢంఢంఢక్కా-ధ్వనితో
ఢామ్మని రాసున్నానని-
పొట్టపగుల గొడతారని
పళ్ళూరాల గొడతారని
కుళ్ళు బయలు పెడతారని,
ఒళ్ళు మరచి సోమరసం
కళ్ల కెక్కి తాగ్బుంటే
పళ్ళు ఫెళ్లు మంటుందని,
బలివితర్ది నటధూర్జటి
ప్రళయ తాండవము విరిగి
యజ్ఞవాటి శ్మశాన మే
కన్యా పరిభావ జనిత
కాష్టాగ్నిని ప్రజ్వరిల్లు
కాలం వస్తున్న దన్న
కాలజ్ఞానం చదవని యంబ్రహ్మ.

జవరాలికి రాక్షసునకు
ఫుఫుతీగెకు పల్లేరుకు
పుట్టుకతో నాహృదయం
నట్టిల్లై నెలకొన్నది
జవరాలికి రాక్షసునకు
పవలూరేయనక జరుగు పోరాటములో
నవయుక్ నాహృదయమ్మది
పవనాహారి ధూత పాదప్రాశేయువో రక్
ద్వివిధ శక్తుల
ద్వంద్వ యుద్ధ
ద్వృత్తి పిచ్చిలమైన నారొద
భీషణోద్ధతి రణాంగణమై
ఘోష పెడుతుంది.
రాక్షస బల మక్షయమై
రగులుతున్న పిడుగువోలె
చటచటచట కాల్చుకుంటు
పటపటపట పరపరాలు
తెగ నలుగుతు నాదేహం
దగ్ధం చేస్తుందొకప్పుడు.
ముళ్ళు పెనగి కళ్ళు క్రక్కి
ఊళ్ళమీద పడుతుందది
దుర్విదగ్ధ దుష్టబుద్ధి
పర్వశత్తి ప్రబలుతుంది.
రాకా హిమకర చిత్రిత
రాత్రులపై దాడివెడలి
తపోగర్భ భుగ్ననికి
శిసులను వర్షిస్తుంది.
జవరాలి పరువమ్ము
నవనాశ్వ. పొనరించి
జయభేరి కొట్టించి
దప్పులకు నోలి మా
ర్ధన్యులను కవ్వించి
ధరనరక్త ప్లావి
త వెుమ్మనర్చగ నెప్పుడు తమకపడుతుంది.
గులాబీల తోటలోన
గుప్పగూబ చేరుతుంది.
కళాభవన కందరాల -
కట్టె కాలుక మారుతుంది.
నాట్యశాల నగళ్ళలో

నాగునాల్క సాగుతుంది.
ప్రేమశరీ రాంతరాళ
సీమల్లో రాచపుండు
రోమల కిరవవుతుంది.

నాహృదయం, ఝుంఝుమాహత
నగ్న నదీ భర్తృగర్భ
నిర్భేదన ఘీంకారో
ద్భిన్న సుహా గహ్వరస
న్నిభమై ఘూర్ణిల్లుతుంది.
పశురాక్షస పిశాచాల
కళవంగా మారుతుంది.

కాని నాజవరాలు చిరకాలజీవి
కానలో వ్యాఘ్రముల కాచేటి తెలివి
పాడు క్రూరమృగాల పారువేటాడి
తాడువం గట్టగల ధైర్యాల బావి
పసరానుపాముకే పాలు పట్టించి
విషమూడ్చి దండగా వేసుకుంటుంది.

కుధరాలను
కదిలించీ
రుధిరాలను
ఉడికించే
బధిరాంధక
విధిచోదన
నధిగమించి
ఎదిరించే
విద్యుచ్ఛిఖి నాజవరాలు.




మూల నున్న రాక్షసునొక
కాలబట్టి నేలరాచి
కలుకు కత్తి చులుకుచూపి
పదాక్రాంత మొనరించగ
సదాయత్త మవుతుంది.

రాజసబలరాజును ని
ర్మూలించక లొంగదీసి
బానిసగా చేసుకునే
చానకాన జవరాలూ.

జవరాలి సత్వమును
రాక్షస రజస్సుతో
పురిపెట్ట తమము దు
ల్లగ జేయు జగజెట్టి
విగత దైన్యాలతో
స్వగత గీతాలతో
నగవు తొలకించేటి
సుగుద కన్నులకోసల
మురువు నా హృదయం.

కదనభూమి నాహృదయం
మదన సేమి నాహృదయం
మదగజని క్రీడితోద్ధ
రదన రటన నాహృదయం.

పలుగురిలో నవ్వుతుంది
పలువురిలో పలుకుతుంది
తనలో తానే వేదన
గొని తన్మయ మవుతుంది

నాహృదయం నవనీతం
నాహృదయం భవజీతం
నాహృదయం శ్రమపోతం
నాహృదయం సుమశీతం

కవనాలకు
శవనాలకు
పవనాలకు
భువనాలకు
దివాకరశ్మి నా హృదయం
నా హృదయం
ఘనాఘనం
నా హృదయం
మహానగం
నా హృదయం
బహుశాఖి
నా హృదయం
నాగుపడగ
విశ్వరూపి
నా హృదయం
విశ్వజీవి
నా హృదయం
విశ్వభావి
నా హృదయం.
నా హృదయం, నా హృదయం.

కథానిక:

# గోపురం

శ్రీ సాళ్వ కృష్ణమూర్తిశాస్త్రి



## 1

టంగ్! టంగ్! టంగ్!

గుళ్లో గంటల శబ్దం వినబడింది. వెంటనే వేపచెట్టుక్రింది పిల్లలందరిలోనూ సంచలనం కలిగింది. ఒక్కసారిగా అందరూ తెలివిలోకి వచ్చినట్లయినారు. ఆడుతున్న ఆటలోని నిమగ్నతకు భంగం కలిగింది. ఆ వినవచ్చిన శబ్దం అందరికీ సంబంధించిందన్నట్లు, అక్కడున్న ఐదారుమందీ ఒకరి ముఖాలవైపొకరు చూచుకున్నారు. అదీ ఎంతసేపు? ఒక లిప్త. ఆట గాలికి పోయింది.

"పూజారి వచ్చాడురోయ్! రంగీ!" ఒకడన్నాడు నేలమీద గోళులు తీసుకుంటూ ఆత్రంగా.

"ఈ పొద్దు తియ్యపొంగలి పెడతాడురా ఎంకటీ", రంగడు అప్పుడే తియ్యపొంగలి తిన్నట్టుగానే అన్నాడు కళ్లు మెరిపిస్తూ.

"ఒరేయ్. రారా సుబ్బడూ తొందరగా పోదాము. పొంగ లయిపోతుంది." గోలీలు ఏరుకున్న అబ్బాయి అందరికంటే ముందుగా పరుగెత్తాడు. అంతే, ఒకరి వెంట ఒకరు పిట్టల్లాగా పరుగెత్తారు ప్రక్కనే వున్న దేవాలయంలోకి.

ఆ వూరికంతా అదొక్కటే దేవాలయం. ఊరేమీ అంత పెద్దది కాకపోయినా రెండు మూడు వేల జనాభా వుంటుంది. దేవాలయం ఊరిమధ్యలోనే వుంది. అందులో శ్రీ వేంకటేశ్వరస్వామి వెలసినాడు, దేవాలయంచుట్టూ ఒక మనిషెత్తుపైన ప్రాకారం, ప్రాకారానికి లోపలనే ఒక చిన్న కోనేరూ వున్నది. దేవాలయం చాలా పురాతనమైనదిగా అగుపించదు గానీ ఆవూరిలో ఇప్పుడున్న వాళ్ళెవరూ అదెవరుకట్టించారో చెప్పలేరు. వాళ్లకి ఆ జిజ్ఞాస పట్టలేదు. 'ఏదో పెద్దలు కట్టింది' అనటం తప్ప. దేవాలయం అంత పెద్దదీ కాక అంత చిన్నదీ కాక ఆ వూరికి తగినట్టుగా వుంది. ఆలయ ముఖమంటపంలో ఐదారువందలమంది కూర్చోవచ్చు. ఆలయంలో గోడలపై చెక్కిన చిన్నచిన్న శిల్పాలు, వానికి పైవరుసలో కొన్ని వర్ణచిత్రాలూ, వున్నవి. ఆలయగోపురంమాత్రము చక్కని శిల్పవిన్యాసంతో కూడుకొని గంభీరంగాపైని కొమ్ములవలె తీర్చిన వంపులతో, తాను, తన స్వామి—అన్న భావములే

నిత్యములన్నట్టుగా ప్రాకారంలోపల నిలచి చూచే మానవులకు, భగవదౌన్నత్యాన్ని చాటుతున్నట్టూ వుంది. స్వామికి నిత్యనైవేద్యధూపదీపారాధనల కేమీ కొదువ లేదు. దేవాలయానికి సంబంధించిన మాన్యా లనుభవిస్తూ ఒక పూజారికుటుంబం ఆ ఊర్లో బ్రతుకుతోంది. స్వామిపూజ, నైవేద్యం వారి నిత్య విధులు.

దేవాలయానికి ప్రతిరోజూ వచ్చేవాళ్ళలో రమణయ్యగా రొకరు. అరవయ్యేళ్లు దగ్గరపడే వయస్సు. జీవితంలో కష్టమూ, సుఖమూ చూచిన వాడు. మంచి సంస్కారి. ప్రాపంచికజీవితంలో నడచినా, ఆంతరంగికజీవనాన్ని బాగా దిద్దుకున్నట్లగపడుతాడు. తనకు వయస్సు రావడమూ, తన కొడుకు ఎదిగిరావడమూ రమణప్పగారికి కొంత విశ్రాంతి తీసుకునేందు కవకాశం గలిగించినాయి. ఆలయంలో స్వామికి ప్రతిరోజూ పదిగంటలకు పైనగాని నైవేద్యం జరుగదు. రమణప్పగారు ఆవేళకు కొంచెం ముందుగా వచ్చి, ఆ చిన్న కోనేరులో కాళ్లూ చేతులు కడుక్కొని స్వామిని దర్శించుకోవడం అలవాటు. ప్రసాదం గ్రహించడం, పూజారితో తలపై శఠారి పెట్టించుకోవడం, జరిగినతర్వాత తానూ పూజారీ మంటపంలో కూర్చుంటారు. సరిగ్గా ఆ వేళకే బడి విడిచివుండడంవల్ల బడిపిల్లల్లో కొంతమంది, దేవాలయం ప్రక్కనే వున్న వేపచెట్టుక్రింద ఆడుకుంటూవుండి, పూజారితోపాటు లోపలికి వెళ్ళి రమణప్పగారు గుళ్లో వాయించే గంట వినబడడంతోనే పూజారి పెట్టే పొంగలి బెల్లాలకు పరుగెత్తుతారు. ఏదోవకటి ప్రసాదం ముట్టితేనేగాని వదల రీ చిల్లరదేవుళ్లు.! తర్వాత రమణప్ప, పూజారి, పిల్లలూ అంతా కలసి మండపంలో కూచోడం, రమణప్పగారు పిల్లల నేవో అడగటం, వారికి కొన్ని విషయాలు చెప్పడం, పిల్లలు లేచిపోగానే తానూ వెళ్లడం, నిత్యమూ జరిగేది. రమణప్పతో మాట్లాడే పిల్లలంతా చిన్నవాళ్లు. పది పదకొండేళ్ల లోపు వాండ్లు రమణప్పగారు తన కున్న సంస్కారాన్ని అప్రయత్నంగా వారి కందించ తలుస్తాడు. వాళ్లకి తన భావాలూ, మాటలు అర్థంకావన్న చింత లేదాయనకు. సాధ్యమైనంత సులభంగా వాళ్లకి తన భావాల్ని విప్పిచెప్పేందుకు ప్రయత్నించేవాడు.

ఏమీ కలతలు లేకుండా చుట్టూ మాగాణీపైరులతో కలకలలాడే ఆ గ్రామంలోని స్వామి ఆలయంలో ఈ ఒక్క కార్యంమాత్రం ఎవరి దృష్టినీ ఆకర్షించకుండానే జరుగుతోంది.

రమణప్పగారు రోజూ మాట్లాడే పిల్లల్లో వెంకట్రాముడు ప్రతిరోజూ అగుపడతాడు. వాణ్ణి అందరూ 'ఎంకటీ' అంటారు. రమణప్పగారుమాత్రం, రాముడూ, అంటాడు. ఎంకటి రమణప్పగారేమైనా చెప్పేటప్పుడు తాను మాట్లాడడు. రమణప్పగారేదైనా తనని అడిగినప్పుడుకూడ పలకడు. అలాగే గడ్డంక్రింద చేయిపెట్టుకొని వింటూ, తనని ప్రశ్నించినప్పుడు చిఱునవ్వు నవ్వుతాడు. కాని వాడు పలక్కపోయినా రమణప్పగారు వానితోనే మాట్లాడుతున్నట్లు, అంతా వాడిమీది దృష్టితోనే మాట్లాడుతాడు. అసలు అక్కడి కొచ్చేవాళ్లలో ఈ రమణప్ప, ఎంకటి—వీరిద్దరివి వింత ప్రకృతులు. ఈ నిశ్శబ్దపు బాంధవ్యానికి గుడిలోని స్వామి సాక్షి. మిగతా వానికి పూజారి సాక్షిగా అగుపడతాడు. కాని ఆ మూగబాంధవ్యంలో ఆంతరంగికంగా, దృశ్యమానం కాకుండా జరిగే దేమిటో!

## 2

ఎంకటి పూజారి పెట్టిన ప్రసాదాన్ని తిని వచ్చేలోపుగా మిగతా నలుగురైదుగురూ రమణప్ప తాతచుట్టూ చేరినారు. రమణప్పగారు నవ్వుతూ వాళ్లతో ఏదో మాట్లాడుతున్నాడు. ఎంకటి మెల్లగా వాళ్ల దగ్గరకు వచ్చాడు. ఎంకటి కొంచెం ఆలస్యంగా రావడం అన్నది ఆక్షణాన అందరిని అతనివేపుకు ఆకర్షించింది. రమణప్ప తాత ఎంకటిరాకను ఎందుకు గమనించి చూచాడో గాని, మిగతాపిల్లలకు మాత్రం మామూలు ఎంకటే. వాడి ముఖంలో క్రొత్త ఏమీ లేదు, కాని రమణప్ప దృష్టి మరల్చటమువల్ల ఈ తాత్కాలికశిష్యపరమాణువుల దృష్టులుగూడ అటు వేపే చూచినయ్.

"ఏం రాముడూ, దేవుడికి మొక్కావా?" తాతగారు అడిగాడు.

ఎంకటి నవ్వుతూ తల వూపినాడు.

మిగతాపిల్లలందరూ ఎంకటి దేవునికి ఆలస్యంగా మొక్కాడన్నట్టూ, తాము ముందుగా మొక్కినందుకు గర్వపడుతున్నట్టూ కనిపించారు.

"ఏమర్రా! మీ రంతా స్వామిని దర్శించుకున్నారా?" తాతయ్య అందరినీ ప్రశ్నించాడు.

"ఓ! మేం ముందే!" అన్నాడు పదకొండేళ్ల 'రంగి'

ఇంతలో పూజారి అక్కడకు వచ్చి చతికిలబడినాడు.

"ఏమయ్యా పూజారీ! ఈ కుఱ్ఱవెధవలంతా స్వామికి మొక్కారా? మొక్కందీమాత్రం వీళ్లకి ప్రసాదం పెట్టేవు సుమా!" తాత ఎంకటిని మినహా మిగతావాళ్లని చూపించి అన్నాడు.

"నిజంగానే మొక్కినాము తాతా!" అన్నాడు సుబ్బడు తనకు తెలియకుండా తనలో పనిచేసే వ్యక్తిత్వగౌరవాన్నంతటిని ధారపోసి మాట్లాడుతూ.

"పోనీ, దేవుడంటే ఏమిటో తెలుసా మీకు?"

తాత చిక్కుప్రశ్నే వేశాడు. ఏదో కొత్తనోరు తియ్యబడిందిగనుక ఇవన్నీ మాట్లాడినా వాళ్ళకేమీ అంత తొందరగాని, కష్టంగాని అనిపించలేదు. కాని వచ్చిన చిక్కంతా ఏమంటే తాతప్రశ్నకి జబాబు దొరకలేదు.

"పూజారి మమ్మల్ని చిట్టచివరి చీకటిగుడిలోకి పోనీడుగా!" రంగి ఏదో వాదం పెంచదలచినట్టు మాట్లాడాడు. ఇంకెవ్వరూ మాట్లాడలేదు. అడిగిన ప్రశ్నకు సమాధానం రాకపోవటంవల్ల తాతగారు నవ్వుతూ— "దేవుడంటే! —దేవుడంటే" తల గోక్కుంటున్నాడు.

తనకే తోచడంలేదు. తాతగారిలో తాను వేసిన ప్రశ్నకు తానే సమాధానం చెప్పలేకపోయినందుకు నవ్వూ, ఆశ్చర్యం, తన మనసులో వున్న భగవంతుడన్నవానికి సంబంధించిన భావాలను ఆ పదేళ్ళలోపు కుర్రాళ్ళకి అర్థమయ్యేట్టు చెప్పడానికి పడేబాధ గోచరించినయ్.

దేవుడంటే తాతకే తెలియకపోవడం పిల్లలకాశ్చర్యం కలిగించింది. అందుకే నిశ్శబ్దంగా ఒకరకమైన 'సీరియస్ నెస్'తో ఆవిషయాన్ని వాళ్లు గమనిస్తున్నారు.

పూజారిమాత్రం ఎదురుగుండా గర్భగుడిలో అగుపించే స్వామి మూలవిగ్రహంవైపు చూచి నవ్వినాడు. కాని ఎవ్వరూ దానికి ప్రతిగా నవ్వలేదు.

"దేవుడు మంచివాడు" తాతకు సహాయం చేస్తామన్న ఉద్దేశంతో అన్నాడు రంగి. ఇందులో దేవుడంటే ఏమటని తాత వేసిన ప్రశ్నకు తనమాట చాలా దగ్గరిసమాధానంగా తోచడమూ, దేవునిపేరు చెప్పి పొంగలితిన్నందుకు ఆచిన్నవాని హృదయంలో వాడు దేవునికి అయాచితంగా, అప్రయత్నంగా చూపే కృతజ్ఞతా, దేవునికి మంచితనాన్ని గుర్తించి 'రికగ్నిషన్' ఇవ్వటంలో వున్న మానవసహజమైన అహంకారమూ, ఎక్కడో ఆ శబ్దపులోతుల్లో ధ్వనించినయ్. రమణప్పగారు రంగిమాట కొంత సహాయపడిందనుకున్నాడు. వెంటనే "మంచిదంతా దేవుడే" అన్నాడు. వాళ్ల కర్థమవుతుందేమో నని ఆశగా. కాని మంచీ-చెడ్డా అన్న భావాలే వాళ్ళకు బాగా తెలియనప్పుడు మంచిదంతా దేవుడంటే ఏమీ తెలియలేదు.

ఇంతలో రమణప్పగారి మనస్సు మారింది. వాళ్ళకి ఇప్పుడా భావాలు చెప్పినా అర్థం కావని తెలిసీకూడా వాళ్ళతో అట్లా బరువైన విషయాలు మాట్లాడటంవల్ల ఈ నిరుత్సాహం కలిగింది. ఎక్కడో అణగివుండి అప్పుడప్పుడు పైకి తలెత్తి చూచే నైరాశ్యం ఆయన్ని ఆవరించింది.

"జీవితంలో ఆ ఆదర్శశిఖరాలకు వెళ్ళడం దుస్సాధ్యం." మెల్లగా పూజారిముఖంలోకి చూస్తూ అన్నాడు. అర్థం కాకపోయినా పూజారి అర్థమైనట్టు తాతగారి ముఖంలోకి చూచాడు.

పిల్లలంతా ఆ మాటల్లో తమకు స్థానం లేదేమో ననుకున్నారు. కాని రంగి తమహక్కును స్థాపించదలచుకున్నాడు.

"అంటే ఎమిటి తాతా?"

"మీరంతా గొప్పవాళ్లు కావాలి. మంచివాళ్లవుతే గొప్పవాళ్లవుతారు. అప్పుడు మీరు దేవుడంటే ఏమిటో తెలుసుకునే ఆ శిఖరాలకి వెళ్లుతారు."

"శిఖరాలంటే?" ఇది అర్థంకాని శబ్దం వాళ్లకు.

రమణప్పకు ఏమీ తోచలేదు. ఆలయగోపురం జ్ఞాపకం వచ్చింది!

"మన దేవళము మీదిగోపురం వున్నదే, అదీ శిఖరం అంటే."

"మీలో ఎవరైనా ఇపుడా గోపురం ఎక్కగలరా?" తన పూర్వపు మాటను వాళ్లకు విసమర్చి చెప్పాలన్న ఉద్దేశంతో ప్రశ్నించాడు.

"ఊ హూ" జవాబు.

"మీరు పెద్దవాళ్లయినాక ఎక్కగలరేమో లే. అల్లే మీరు పెద్దవాళ్లయినాక మంచివాళ్లవుతే నేను చెప్పిన పైశిఖరాలకు వెళుతారు. ఇంతకూ మీ కివ్వ డివన్నీ అర్థంకావులే నాయనా." తాత లేచాడు.

అందరిలోనూ ఒక సీరియస్ నెస్ కనిపిస్తోంది. ద్వారం దాటి మాట్లాడకుండా వెళ్లినారు. వేపచెట్టు క్రింద పిల్లల్ని చూచేవేళకు వీళ్ల వేదాంతం అంతా మాయమైంది. అందరూ పరుగెత్తారు. కాని—ఎంకటికి మాత్రం ఆ బరువు వదలలేదు. మంచిగా వుండటానికి గోపురం ఎక్కటానికీ గలసంబంధమేమో అర్థంకాలేదు. ద్వారందాటివస్తూనే గోపురంపై పాక సారిచూచాడు. నిజమే తానెక్కలేడు. ఎప్పటికీ ఎక్కలేడేమో!

### 3

ఆ కొట్లాట వేపచెట్టుకిందే జరిగింది. అందులో ఎంకటి దేమీ తప్పులేదు. తాను తెచ్చుకున్న గోలీల్లో ఒక చిన్న గోలీ ఆడుతున్నపుడు జారిపడిపోయింది, ఆటతొందరలో తాను గమనించలేదు. అది 'రంగి' జేబులో దాక్కున్నది. అది అసలు అక్కడి కెట్లా పోయిందో రంగికి తెలియదు! ఇంతకూ అది ఇంత గూఢంగా రంగి జేబులో కెళ్ళడం సుబ్బడి కంట బడింది. తర్వాత ఎంకటి తన చిన్న గోలీల్లో ఒకటి తక్కువరావడం అనేసరికి సుబ్బడు రంగికి దొరికిందన్నాడు. ఎంకటి 'రంగి' వైపుకు చూచాడు ఇవ్వమన్నట్టు.

"ఏం అలా చూస్తావ్? నాకేం తెలుసు" రంగి జవాబు.

"నీకు దొరికిందటగా?" ఎంకటి అడిగాడు.

"దొరికితే, దొరికినవన్నీ నీవేంటి. పోయి ఆ దేవుణ్ణడుగు నీగోలీ" గోపురంవైపు చూపిస్తూ, దబాయించాడు.

ఎంకటిలో పౌరుషం పొడచూపింది. ఎంత అన్యాయం! తన గోలీ తీసుకొని పైగా తననే దబాయిస్తున్నాడే అనుకున్నాడు. ఆ క్షణంలో తన తప్పు ఏమీ లేకుండా తనగోలీ పోవడం ఏదో మహా విలువైన వస్తువు పోయినట్లుంది.

"ఇతే ఇవ్వవే?" సాధించుకు నేందుకు సిద్ధపడ్డాడు.

"ఏం కొట్లాట కొస్తావా? రావోయ్" రంగే ముందు రంగంలోకి దూకాడు. ఇద్దరూ కలియబడినారు. తీరా తాను కొట్టబోయే సమయంలో సుబ్బడూ వాళ్లంతా విడిపించారు. అన్యాయానికి శిక్ష జరగలేదనుకున్నాడు

బుసకొట్టుతూ, చెదిరిన క్రాఫింగుతో, కళ్ళెఱ్ఱజేసి రంగివంక చూస్తూ నిలబడ్డాడు.

"పోతేపోయింది, రారా, ఎంకటీ! మనము దేవళంలో కెళదాము రా" సుబ్బడు ఎంకటిభుజంమీద చెయ్యివేసి పిలుచుకపోయాడు.

నడుస్తూ గోపురాన్ని చూచాడు. ఎందుకో తా నాకొట్లాలో మంచిగా ప్రవర్తించినా ననుకున్నాడు! తాను మంచిగా నడుచుకోవాలని ఎప్పుడో ఎక్కడో అనుకున్న భావం అతనిలో పనిచేసి పైకగుపడిం దాక్షణంలో. నిజమే! సుబ్బడు అడ్డురాకుంటే తాను రంగిని దంచేసేవాడు. తన వస్తువును అవతలివాడికి వదలేసి, వాని అన్యాయానికి శిక్షించకుండా రావడము తన మంచితనము కదూ!

ఎంకటి ముఖంపై పైభావాలకు సూచకంగా తృప్తితో కూడిన చిఱునవ్వు మెఱసింది. ఎంకటి నడుస్తూ నడుస్తూ వెనక్కి తిరిగి చూచాడు.

రంగి మినహా తక్కిన నలుగురైదుగురు తనవెంటే నిశ్శబ్దంగా వస్తున్నారు. న్యాయంవల్ల కలిగే బలం ఎంకటి ఛాయగా తనలో ఫీలయినాడు. ప్రాకారం లోపలికిపోయినాక, అంతా గోపురపు నీడలో కూర్చున్నారు. ప్రాకారానికి, దేవాలయానికి మధ్య వున్న స్థలంలో ఆ సంజవేళ గోపురంనీడ విశాలంగా పడుతూ ప్రాకారాన్ని దాటిపోయిన ట్లుంది. సంభాషణమారి గోపురంనీడ పైకొచ్చింది.

"ఒరేయి, ఈ నీడ నీవు కొలు చూద్దాము" అన్నాడు సుబ్బడు ఇంకొకనితో. అంతా లేచి నిల్చు

న్నారు. ఆ అబ్బాయి వచ్చి తన కాలు కొలమానంగా చేసి అడుగులు ఎంచుతూ మొదలుపెట్టాడు. వాడు కొలుస్తూ అడుగులో అడుగు వేస్తుంటే వాని ప్రక్కనే పిర్యానూ!

ఇలా కొలవడం ఎంకటికి నచ్చలేదు. ఎంత పెద్ద నీడను చిన్న కాళ్ళతో కొలవడ మేమిటి?

"ఇలా కాదురా చూడు!"

ఎంకటి వెళ్ళి అడ్డంగా నీడలో పడుకున్నాడు. అప్పటికీ తాను నీడలోనే వున్నాడు. తన పొడవు కంటే నీడ వెడల్పెక్కువ!

ఎంకటిమనస్సులో ఆశ్చర్యం వేసింది. పైకి చూచాడు అలాగే వెల్లకిలా పడుకొని. కొంచెం భయ మయ్యింది,

ఈ గోపురం తా నెక్కలేడేమో? ఎప్పటికీ ఎక్కలేడేమో !

పిల్లలంతా గొల్లున నవ్వారు. ఇంతలో పిల్లలంద రికీ గోపురంనీడ చివర ఎక్కడున్నదో చూడాలని బుద్ధిపుట్టింది. ఒకని బుర్రలో పుట్టిన బుద్ధి ఇది అంద రికీ ప్రాకింది. అంతే అందరూ కలిసి ప్రాకారం దాటి వెళ్ళారు. అది అట్టే అందరి ఇళ్ళకూ దారితీసింది.

## ౪

ఆయేడు స్వామి తిరుణాల వచ్చింది. తిరుణాల ఇంకా ఒక పక్షంవుందనగానే అందరి లోనూ ఒక ఉత్సాహం మొలకెత్తింది. తిరుణాల దగ్గరి కొచ్చేకొద్దీ అది దినదినాభివృద్ధి చెందుతోంది.

అందరికీ వచ్చినట్టే ఎంకటికీ తిరుణాల వచ్చింది. అతని ఉత్సాహం వేరు. అదీ దినదినమూ వృద్ధవుతోంది. అతనిలో ఎలాగైనా గోపురంపై కెక్కాలన్న వాంఛ బలమైంది. 'తిరుణాల్లో ఎక్కితే!'— దానివల్ల కలిగే ఉత్సాహం అదితిరు ణాల దగ్గరి కొచ్చేకొద్దీ అది వాని కొక తీవ్రమైన భావమౌతోంది, దినానికి ఇరవైసార్లయినా అనుకుం టాడు. ఉద్రేకం వస్తుంది. ధైర్యం వస్తుంది. తా నెక్కలేనన్న భయం అపుడాతనిలో పని చెయ్యదు. ఆ ఉద్రేకం ఆ అనుభవం పోయిన వెంటనే మళ్ళా నిరుత్సాహమూ, అధైర్యమూ.

తిరుణాల మొదలయ్యింది. తొమ్మిదిరోజులు జరుగుతుంది. ఊరిలోనేగాబట్టి దేవాలయపు గంటల శబ్దం ఎంకటి ఇంటి దగ్గరకి బాగా వినపడుతుంది. తిరుణాల మొదలుపెట్టినాక ఈ గంటల శబ్దం వానికి ఏదో క్రొత్త అనుభవాన్ని కల్గించేది. 'ఖంగు' మంటూ గంటల శబ్దం గాలిలో వచ్చి తనకు వినిపించ గానే ఆ శబ్దతరంగాలు తనని స్పృశించినట్లు, తనని గోపురా నెక్కేందుకు పిలుస్తున్నట్లు ఉద్రేకపడే వాడు. శరీరం గగుర్పొడిచేది.

తిరుణాల నాలుగురోజులు గడిచింది. ఆ ప్రొద్దు రాత్రికి స్వామికి గరుడసేవ. మధ్యాహ్నం ఊరిలోకి వెళ్ళాడు స్వామి. మూడుగంటలు కావచ్చినా, అసలు ఆలస్యంగా బయలుదేరడంవల్ల స్వామి ఇంకా గుడి చేరలేదు. స్వామివెంట వూళ్ళోకి పిల్లలందరూ పోయినా, ఇంకా కొందరు పిల్లలున్నారు. రాత్రి గరుడసేవకై స్వామికోసం బయటికి తీసిపెట్టిన పెద్ద 'చప్పరం' ఒకవైపున వుంది. ప్రక్కనే 'హంస పాదులు' న్నయ్. చప్పరాని కింకా రంగులగుడ్డలు చుట్టూ కట్టలేదు. కొందరు పిల్లలు చప్పరం దగ్గరగా త్రాళ్లుపట్టుకొని, లోపల నిలుచొని మాట్లాడు తున్నారు. మిగిలిన కొద్దిమందీ ప్రాకారంలోపలే ఏదో గల్లంతు చేస్తున్నారు. స్వామి వూళ్ళోకెళ్ళినా దేవాలయాన్నిమాత్రం కొందరుపిల్లలు వదలరు! ఆరోజు ప్రొద్దున్నుంచీ ఎంకటి దేవాలయంలోనే వున్నాడు. దేవాలయమంతా వందసార్లు కలయదిరి గాడు. కాని గోపురంవైపు చూచేసరికి ఏదో అర్థం కాని ఒక భావాన్ని అనుభవిస్తాడు. ఆలయం వెనుక వేపున గర్భగుడి నానుకొని కాస్సేపు కూర్చున్నాడు.

"గోపుర మెక్కితేనో!" అనుకున్నాడు. కాని ఒక్కడూ ప్రయత్నించేందుకు ధైర్యంచాల లేదు.

ఇంతలో సుబ్బడు, మరికొందరు పిల్లలూ వచ్చారు. రంగికూడా వాళ్లలో వున్నాడు.

"ఒరే సుబ్బడూ నీవు గోపుర మెక్కగల వట్రా?" ఎంకటి అడిగాడు.

"నే నెక్కుతాను." రంగి ముందుకు వచ్చాడు.

"అదో ఆ మూలసందులో బొటనవేలు పెట్టి,

ఆచుంచు పట్టుకొని ఎక్కితే గుడిమీద కెక్కొచ్చు." సుబ్బడు దారిచూపాడు.

"అక్కడినుంచి గోపురంబొమ్మలు పట్టుకొని సులభంగా పైకి పోవచ్చురోయ్, కిందికిమాత్రం చూడొద్దు." ఇంకొకడు సలహా.

ఎంకటికన్నా ముందు రంగి బయలుదేరాడు. ఎంకటే గోడవద్దకు వెళ్ళాడు. ఎక్కుతూంటే రంగి మోచేతులూ కాళ్లు రాచుకుపోయినయ్. కాని వాడు లెక్కచెయ్యలేదు. ఎంకటికి, అందినంత దాకా సుబ్బడు సాయం నిల్చున్నాడు. ఎంకటి కొంత గోడ ఎక్కాడు. కాలు జారింది! కింద గోడసందు ఎక్కడుందో కాలికి తెలియలేదు. కొంత ఆసరాగా చుంచు దొరికింది పట్టుకోను. ఓపిగ్గా, ఆసరా చూచుకొని, దేవళంపైకి ఇంకా ఎంతెక్కాలో నని తల పైకెత్తాడు. 'రంగి' అప్పుడే పైకెక్కాడు. ఎలాగైతేనేం ఎంకటీ గుడిమీద కెక్కాడు. ఎక్కుతున్నంతసేపు ఎంకటికి ఎక్కడలేని ఆవేశమూ ఉత్సాహమూ వచ్చినయ్.

స్వామి తిరిగి వస్తున్నాడు. మేళాల శబ్దమవుతోంది. రంగి, ఎంకటి గోపురం ఎక్కడం ప్రారంభించారు. ఎంకటికి గోపురం ఎక్కటం సులభంగా తోచింది. ఎవరో తనను పైకి వెళ్లమని తోస్తున్నట్లున్నది. చకచకా ఈబొమ్మతల - పట్టుకొనీ, ఆ సందులో కాలుపెట్టి-కిందికి చూడకుండా పాకుతున్నాడు. రంగి మాత్రం తంటాలు పడుతున్నాడు. ఎంకటికంటే ఓగజం కిందనే వున్నాడు. స్వామి ఆలయానికిదగ్గర కొచ్చాడు. ఎంకటి శిఖరం పైకెక్కాడు. శిఖరంమీదుగా తలని నిక్కించి చూచాడు. ద్వారం ముందు స్వామి అగుపడ్డాడు. ఒక క్షణం. గబగబా పూజారి తనవైపు వస్తున్నాడు—

'అమ్మయ్యో!'—కాలుజారింది.

క్రింద గోపురంనీడలో ఎంకటిశవం రక్తసిక్తమై పడింది. ద్వారంముందు స్వామి నిశ్చాంతపోయాడు ఒకక్షణం.

ఆలయంలో గంటలు మూగవోయినయ్.

"ఆ ఆదర్శశిఖరాలను స్పృశించడానికీ, అధిరోహించడానికీ ఇలాటి జన్మ లెన్ని వినియోగించాలో!" మూగివుండే జనంలో ఎవరో గొణుక్కున్నారు.

గోపురంనీడమాత్రం నిశ్చలంగా ఎంకటిశవంపై పడుతోంది. శవంతోపాటు గుంపంతా కదలిపోయింది. ఆ శిఖరచ్ఛాయకు దగ్గరగా స్తబ్ధుడై నిలుచున్నది రమణప్ప ఒక్కడే!



## రాజరాజనరేంద్రుని

# కలిదిండి తామ్రశాసనము

శ్రీ భావరాజు వేంకటకృష్ణరావు

(గత సంచిక తరువాయి)

ఇక రాజ్యాభిషేకవృత్తాంతము. రాజ రాజ నరేంద్రుని తామ్రశాసనములు, తరువాతి కాలపు తామ్రశాసనములు గూడ సప్తాశ్వసన్నిభు డయిన విమలాదిత్యుడు ఏడు సంవత్సరములు రాజ్యము చేసె నని మకుపుచున్నవి. రణస్థిపూండి శాసనమునుబట్టి విమలాదిత్యుని పట్టాభిషేకము శ. ౯౩౩ సంవత్సరమున, వృషభమాసమున శుద్ధపంచమీ గురువారము నాడు పుష్యమీ నక్షత్రయుక్త సింహాలగ్నమున జరిగెను. ఆ తిథి మే ౧౧,౧౦౧౧, సంవత్సరమునకు సరిపోవుచున్నది. రాజరాజవిష్ణువర్ధనుని పట్టాభిషేకము శ. ౯౪౪ సంవత్సరమున సింహమాసమున బహుళ విదియా గురువారమునాడు ఉత్తరాభాద్రా నక్షత్రయుక్త తులాలగ్నమున జరిగెనని యాలెని కోరుమిల్లి, కలిదిండి, నందమపూండి శాసనములు దెలుపుచున్నవి. ఆ తిథికి సరియైన ఇంగ్లీషు తేది ౧౬ ఆగస్టు ౧౦౨౨ అగుచున్నది. ఆవిధముగా, తండ్రి తనూజుల పట్టాభిషేక కాలములకు నడుమ ౧౧ సంవత్సరములు ౩ మాసములు ౫ దినములు అంతరముండగా, విమలాదిత్యుడు ౭ సంవత్సరములు మాత్రము రాజ్య మేలినట్లు రాజరాజ నరేంద్రుని శాసనములు తరువాతి కాలపు తామ్రశాసనములు దెలుపుటకు కారణ మేమయియుండును ? ఈ కారణములు నిరూపించుట యందు వెంకటరమణయ్యగారు త్రొక్కిన మార్గము, చేసిన యూహలు ఎంతమాత్రము సంగతములు గావు.

రాజరాజు, తనతండ్రి యేడు సంవత్సరములు మాత్రము రాజ్యము చేసెనని దెలుపుటకును, తన పట్టాభిషేకకాలమును దెలుపుటకును ఏదో ప్రబల కారణ ముండవచ్చును. ఆ రాజేంద్రుని పట్టాభిషేకమునకు బూర్వము ఏవేని యవాంతరములు సంభవించెననుటకు శాసనకావ్యములం దెంతమాత్రము సావకాశము గన్పడదు. వెంకటరమణయ్యగారికి కలిగిన యహోహలకు సందర్భశుద్ధియు గానరాదు. విమలాదిత్యుని ౭ వ విజయరాజ్యవర్షము ౧౦౧౮ మేయి ౧౧ వ తేదితో అంతమగుచున్నది. అంతట నుండి ౮ వ సంవత్సరము ప్రారంభమయ్యెను. రణస్థిపూండిశాసనము, ౮ వ యేట సింహాసనమున ఆజ్ఞాపింపబడెను. ఆయేడు సింహమాసము ౨౭ జూలయి ౧౦౧౮ తో అంతమయ్యెను. కావున అటుపిమ్మట ఎప్పుడో, విమలాదిత్యుడు రాజ్యపరిత్యాగమును జేసియుండెనని యూహించుకొనవచ్చును. కాని యూచాళుక్యచూడామణి యెచ్చటను తాను రాజ్యమునువీడి, సన్యాసమును స్వీకరించి జైన ముని యైనట్లు తెలుపలేదు. అది వెంకటరమణయ్యగారి కల్పనావిశేషము. విమలాదిత్యుడు రాజ్యము చేయుచున్న కాలమునందో, లేక రాజ్యపరిత్యాగము చేసినతరువాతనో, జైనశ్రావకుడయినట్లు మాత్ర మూహించుటకు విజయనగరమున కనతిదూరమున రామతీర్థముచెంత నున్న గురుభక్త కొండలో దుర్గపంచశాసనము ఆధారమగుచున్నది. అది కన్నడభాషలో నున్నది.*

అది సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజగు విమలాదిత్యుని కాలమునాటిది. అందు విజయ రాజ్యవర్షములు లేవు. దేశిగణ జైనాచార్యుడగు త్రికాలయోగి సిద్ధాంతదేవమునీంద్రుడు కన్నడ భూమినుండి

* A R No. 831 of 1917 = 372 of 1905.

యంధ్రదేశమునకు, ప్రసిద్ధ జైనక్షేత్రమయిన రామ తీర్థమున తీర్థయాత్రాపరుడై వచ్చినట్లును, విమలాదిత్యుడు, అతని గురువుగా భావించి, యుపదేశమును బొంది జైనదీక్షను స్వీకరించి శ్రావకుడైనట్లును ఆశాసనమువలన దెలియుచున్నది. విమలాదిత్యు డింకను రాజ్యముచేయుచున్నట్లు తోపదేయు, రాజమార్తాండ, బిరుదాంక భీమనామము రాజేంద్రునికి వాడబడెను. రణస్థిపూండిశాసనము నాడు విమలాదిత్యుడు పరమ మాహేశ్వరుడుగా నుండెను. రణస్థిపూండి శాసనకాలమునకు కొంచెము బూర్వమో, లేక కొంత తరువాతనో, విమలాదిత్యునికి జైనధర్మముపై మనసు దగులుటచేతను, త్రికాలయోగి సిద్ధాంతదేవుని యుపదేశములు మనసున కెక్కుటచేతను విమలాదిత్యుడు రాజ్యపరిత్యాగము చేసెను. ఇహలోక రాజధర్మము కంటె పారలౌకికమైన జీవధర్మ మతని చిత్తవృత్తిని మార్చెను. పరమబ్రహ్మణ్యుడును, పరమ మాహేశ్వరుడునుగానివాడు వేంగిసింహాసనముపై గూర్చుండ నర్హుడు గాడు. అది రాజ చాలుక్య రాజ్యాంగ సంప్రదాయము. ఆ నీతికి కట్టువడినవాడుగావున విమలాదిత్యుడు జైనశ్రావకుడైన తత్‌క్షణము సింహాసనమును దిగెను. రాజ్యభారమును, తానదివఱకు జేసిన ఏర్పాటు ననుసరించి యువరాజునకు కుమార రాజరాజ విష్ణువర్ధనునకు నప్పగించెను. ఇక్కడ వెంకటరమణయ్యగారి కొక సందేహము కలిగెను. విమలాదిత్యు డేల మొదటినుండియు జైనుడు కాగూడదు? అని. ఆ సందేహమునకు తావులేదు. జైనుడైనచో రాజ్యార్హత లేకయుండును. అట్లుగాక, అతడు రాజ్యాభిషిక్తుడైన తరువాతనే, చోళదేశమున కరిగినపుడు తిరువైయ్యూరు దక్షిణకైలాసనాథదేవునికి భక్తుడై దాన ధర్మములు చేయుట సంభవించెను. ఆ విషయము వెంకటరమణయ్యగారి సందేహమును, విపరీతపు టూహలను ఖండించుచున్నది.

రాజ్యపాలన భారము రాజరాజునకు నప్పగించునాడు, అసాధారణప్రజ్ఞాశేముషీ ధురంధరుడు, ప్రధానామాత్యుడు రాజ్యము రక్షింప సమర్థుడు, తన కాప్తుడునగు వజ్జియప్రెగ్గడ యున్నాడను ధైర్యముతో విమలాదిత్యుడు రాజ్యపరిత్యాగము చేసెను. వజ్జియప్రెగ్గడను తన కాప్తుని జేసుకొనుటకు అతని కంతకు బూర్వమే రణస్థిపూండిగ్రామమును అగ్రహారముగా సర్వకరపరిహార వివర్జితముగా దానమిచ్చెను. దాన శాసన కావ్యమందు "వజ్జియామాత్య సమోఽమాత్యో నభూతో న భవిష్యతి" అని ప్రశంసావాక్యమును వ్రాయించెను. అది యథార్థము కావలయును. తన రాజనీతి ప్రజ్ఞాధౌరంధర్యము చేతను, రాజకార్య నిర్వహణదక్షతచేతను కార్యఖడ్గములు రెండింటిచేతను వజ్జియప్రెగ్గడ విమలాదిత్య భూపమహేంద్రుని చిరకాలము సేవించి ఆప్త మిత్రుడయ్యెను. *

అతని మరియొకచోట విమలాదిత్యుడు "మద్భక్తాయ, కృతక్లేశాయ,......అమాత్యశిఖామణ్యే, బుధవజ్రప్రాకారాయ, సౌజన్యరత్నాకరాయ" అని ప్రస్తుతించినాడు. ఆ మంత్రి చూడామణికి "శ్రీద్వార పింఛకరకాతప వారణాది విశేషమహిమ గల" లాంఛనముల నొసగెను. తన యభ్యుదయ పరంపరాభివృద్ధి నిమిత్తము విమలాదిత్యుడు "మత్సంవర్ధితత్వానిమిత్తే" అని అగ్రహారమును దాన మిచ్చెను. వజ్జియప్రగ్గడ విమలాదిత్యున కనేకయుద్ధములందు ఖడ్గసహాయము జేసి జయము గూర్చెను. అట్టి అమాత్యశిఖామణిని జూచుకొని, తనకును తన కుమారునికిని, తన రాజ్యమునకు నెట్టి యాపదయు రాదని ధైర్యముతో, నిశ్చింతతో, విమలాదిత్యుడు రాజ్యభారమును వదులుకొనెను. ఆ రాజచంద్రుడు రాజమహేంద్రమును వీడి రామతీర్థమున నివసించుట కేగెనని గాని, జైనమునియై దేశాంతర్గతు డయ్యెనని గాని యూహించుటకువీలు గానరాదు. అత డాక్షిణమున స్వేచ్ఛాజీవ ధర్మమునుపాసించుచు, తన యిచ్ఛవచ్చినచోట జీవించియుండెను. రాజమహేంద్రమునుండి రాజ్యపాలన

---

* నాగేంద్రైర్ద్రిగిశైశ్చ షోడశనృపై
రాద్యైర్ధృతాం క్ష్మాధురాం।
వీరైరప్యతి శూద్రకప్రభృతిభి
శ్చాశేద్ధురం దుస్సహాం।
బిభ్రద్యః ప్రథితం క్రమాన్నయబలా
ద్బాహాబలాత్ ప్రాప్తవాన్
సాహాయ్యం బిరుదంక భీమనృపతేః
కార్యేన ఖడ్గేన చ॥

౨౬ వ శ్లోకము.

మందు కుమారునికి పాయపడుచుండవచ్చును. కావు నే తండ్రి జీవించియున్నంత కాలము, రాజరాజు పట్టాభిషేకమును చేసికొనడయ్యెను. విమలాదిత్యుడు రాజ్యకాంక్ష వీడజాలనికారణమున, తన కుమారునికి తన మామ చోళరాజరాజు వలె, తాను జీవించియుండ గనే పట్టము గట్టడయ్యెను. వేంగీశ్వరుడుగా, ఏడేండ్లు మాత్రము రాజ్యము చేసినకారణమున మిగిలిన నాలు గేండ్లును సింహాసనస్థుడు గానికతన లెక్కకు రాడయ్యెను. ఆ నాలుగేండ్లును విమలాదిత్యుడు మహారాజాధిరాజు గాడు. రాజ్యభారము వహింప, యువరాజ ప్రధానామాత్యులను ప్రతినిధులుగా నియమించెను. "తండ్రి చావున కెదురు చూచుచు," రాజరాజు తన పట్టాభిషేకమును ఆపుకొనినకారణము పైన నుడివిపరీతిగా నుండవచ్చును. కాని సుగుణశాలియైన రాజరాజు తండ్రిచావున కెదురు చూచుచుండెననుట జుగుప్సాకరమైన వ్రాత!

పైన వివరించినదాని బట్టి, రాజరాజ నరేంద్రుని రాజ్యపాలనము శ. ౯౪౪. సంవత్సరమునకు బూర్వము నాలుగేండ్ల క్రిందటనే యారంభమయ్యె ననుట విదితము. కాని యాతని విజయరాజ్య వర్షములు, రాజ్యాభిషేకకాలమునుండి లెక్కింప బడెను గాని, వెంకటరమణయ్యగారు ఊహించినట్లు పట్టాభిషేక కాలమునకు పూర్వమునుండి లెక్కింపబడలేదు. తమ వాదమును సిద్ధాంతముగా చేయుటకు వెంకటరమణయ్యగారు, శాసనోదితవృత్తాంతములను అన్వయించుటలో పొరబడిరనుటకు సందేహము లేదు. వెనుక కొంత కాలముక్రిందట పూర్వచాళుక్యరాజ వంశముయొక్క రాజుల కాలనిర్ణయమును చేయుచునే నొకవాదమును ప్రతిపాదించితిని. ఒక రాజు పరిపాలించినకాలములో నెన్ని శకవత్సరములు, ప్రభవాది సంవత్సరము లెన్నివచ్చునో, అన్ని సంవత్సరములా రాజు రాజ్యము పాలించెనని లెక్కపెట్టుకొనుచుండిరి. ఒకప్పు డారాజు ఒక శకవత్సరములో ఒక మాసము మాత్రమే రాజ్యము చేసినను, అనగా ఫాల్గుణమాసములో పట్టాభిషిక్తుడైనప్పటికిని, ఆ ఫాల్గుణము నడిచిన శకవర్షము, ఒక సంవత్సరముగానే లెక్కించియుండిరి. రాజరాజనరేంద్రుడు, శ ౯౪౪ లో భాద్రపదమాసమున సింహాసన మధిష్ఠించెను. ఆ శ. ౯౪౪ లో అప్పటికి ౫ మాసములు పైగా గతించినను, ౯౪౪ శకవత్సరము, రాజరాజు యొక్క మొదటి విజయరాజ్యవర్షముగా గణుతింపబడెను. ఆరీతిగా లెక్కచూచిన అతడు మరణించు నాటికి, శ. ౯౮౪. నాటికి, నలభైయొక్క శకవర్షములు నడచెను. అందువలన తరువాతకాలమువారు రాజ రాజనరేంద్రుడు ౪౧ సంవత్సరములు రాజ్యమేలియుండెనని వ్రాసియుండిరి. ఈ మతమును— యీ గణనపద్ధతిని మనసులో నుంచుకొని లెక్కించినచో నింతవఱకు దొరకిన రాజరాజ నరేంద్రుని కాలమునాటి శిలాశాసనములోని సంవత్సరములకును విజయరాజ్యవర్షముల లెక్కకును ఏ వైరుధ్యమును రాదు. పరికింపుడు, ఈ క్రిందిపట్టికను.*

ఈ నాలుగు శాసనములలో కడపటిదానియందు విజయరాజ్యసంవత్సరము తప్పుగా, ౪౦ కు ౪౧ పడియుండవచ్చును. లేదా గవర్నమెంటు శాసన పాఠకుడు పొరపాటుగా చదివియుండవచ్చును. ఎటు చూచినను శ. ౯౮౩ సంవత్సరము, ౪౧ వ విజయ రాజ్యవర్షము కాజాలదు. శాసనబింబమును చూచిన గాని అది ౪౦ యో, ౪౧ యో నిర్ణయింప వలను పడదు. ఎట్లయినను శ. ౯౮౩, ప్లవసంవత్సరము రాజరాజదేవరయొక్క ౪౦ వ రాజ్యవర్షము అగుచున్నది. ఈ విషయ మటుండనిండు.

రాజరాజు పరిపాలించుచుండగనే అతని సవతి తమ్ముడు విజయాదిత్యుడు ద్రోహియై తిరుగుబాటు చేసి, అన్నగారిని దేశాంతరగతుని జేసి, వేంగీ రాజ్యమునకు తానే రాజపరమేశ్వరుడనని పట్టము గట్టుకొనెను.

---

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| * నెం. ౧౮౩ of ౧౮౯౩ | ద్రాక్షారామ | విజయరాజ్యకాలము | ౨౬=శ. ౯౬౯ | పట్టాభిషేకము | శ. ౯౪౪ |
| ,, ౬౬౩ of ౧౯౨౦ | నందివెలుగు | ,, | ౩౭=శ. ౯౮౦ | ,, | ,, |
| ,, ౬౭౩ of ౧౯౨౦ | కలివేరు | ,, లేదు | (౨౨)శ. ౯౬౫ | ,, | ,, |
| ,, ౬౭౧ of ౧౯౨౦ | కలివేరు | ,, | ౪౧ (౪౦)శ. ౯౮౩ | ,, | ,, |

పట్టము గట్టుకొనిన రెండవ సంవత్సరమున తనకు యుద్ధములందు, అన్నగారి సేనానులతోడి యుద్ధములందు, ఖడ్గసహాయము చేసిన నాగకుల భూషణుడు, మేఘగిరినాథ మేల్పకందర్ప మలయ భాస్కరాది బిరుదులు గలవాడు, తనగురించి మిక్కిలి శ్రమపడినవాడు నగు భీమభూప నేనికి, కొంపాలాంగు గ్రామమును ద్వాదశగ్రామ సహితముగా, విజయాదిత్యుడు దానమిచ్చెను. ఇది విజయాదిత్యుని పాముల వాక శాసనవిషయము. ఆ శాసనమునందు విజయాదిత్యుడు చరిత్రాంశములను కొన్నింటిని తెలిపి యున్నాడు. 1 అవి ఎవ్వి యనగా:—

(౧) మమ్మడిభీము (విమలాదిత్యుడు)ని కుమారుడైన రాజరాజు మహామతి యైనవాడు (ఆంధ్ర భూమిని) పండ్రెండేండ్లు పాలించెను.

(౨) ఆ రాజరాజనృపతిని, అతని సవతి తమ్ముడైన విజయాదిత్యుడు (విమలాదిత్యతనూజుడు) ఘోర యుద్ధమునందు జయించి రాజ్యమును లాగుకొనెను.

(౩) పిదప, శకవర్షములు (ద్రుక్=౩ ఇషు=౫ నిధి=౯) ౯౫౩ సంవత్సరములు గతించగా, కర్కాటకమాసమున, శుద్ధపంచమీ ఆదివారమునాడు పూర్వ ఫల్గునీ నక్షత్రయుక్త కన్యాలగ్నమందు విజయాదిత్యుడు ప్రతాపము గలవాడై వేంగీ సామ్రాజ్యమునకు పట్టము గట్టుకొనెను. ఈ వివరములకు సరియైన ఇంగ్లీషు తేది ౨౮ వ జూను ౧౦౩౧ అగుచున్నది.

'ద్రుక్' శబ్దమునకు '౨' అని అర్థము. కాని యిక్కడ '౩' అని అన్వయము చెప్పుకొనవలయును. మొదట నేను, ఈవివరములకు సరియైన ఇంగ్లీషు తేదీని కట్టలేకపోయితిని. తరువాత, కీర్తికాయులైన రావు బహద్దూర్. కొమాండూరి రామకృష్ణమాచార్యులు గారి సహాయమున నా తప్పులెక్కను సవరించుకొంటిని.

పైవిషయములందు ఒక విషమఘట్టము గలదు. విజయాదిత్యుడు పట్టముగట్టుకొన్న తేదికి, ౨౮-జూన్ ౧౦౩౧ నాటికి రాజరాజు పట్టాభిషిక్తుడై రాజ్యపాలన మారంభించి, యించుమించు తొమ్మిదేండ్లు గడచెను. అట్టిదయిన విజయాదిత్యుడు ఎట్లు తన యన్న పండ్రెండేండ్లు రాజ్యమును పాలించె నని చెప్పుట సంభవించె నన్న ప్రశ్న వచ్చును. ఆ ప్రశ్నకుత్తర మిది. విజయాదిత్యుడు పట్టాభిషేకము చేసికొనుటకు కొంతకాలము ప్రయత్నము జరిపియుండవలయును. సైన్యములు గూర్చుకొనవలయును, తనకు మిత్రులెవ్వరో సహాయులెవ్వరో ఆరసి వారినందరిని గూడ గట్టుకొని రావలయును: అన్నగారిపై బహిరంగముగా తిరుగుబాటుచేసి రణరంగమున ఎదుర్కొనవలయును. అన్నగారిని, అన్నగారి దండనాథులను పూర్తిగా ఓడించి, దేశమునందు, కనీసము కొంత భాగమునం దైనను తన యధికారమును సుస్థిరముగా నెలకొల్పవలయును. అంతటగాని విజయాదిత్యుడు వేంగీసామ్రాజ్యమునకు బట్టము గట్టుకొనజాలి యుండడు. దానికంతయు కనీసము ఒక్క యేడయినను పట్టును. కావున పట్టాభిషేకకాలమునకు బూర్వము ఒక సంవత్సరము నుండి, అనగా, ౧౦౩౦ జూను,—జ్యేష్ఠ ఆషాఢ మాసములనుండి, విజయాదిత్యుడు తిరుగుబాటు ప్రయత్నములోనుండి యుండవలయును. రాజరాజు తన తండ్రి పరిత్యజించిన సింహాసనముపై గూర్చుండ నర్హత నింకను లేనివాడయ్యెను. ౧౦౧౯ జూలయి ఆగష్టు (భాద్రపద—ఆశ్వయుజమాసములు) నెల నుండి రాజప్రతినిధిగా రాజ్యపాలన మారంభించెను. జూలయి ౧౦౧౯ సంవత్సరమునుండి జూను ౧౦౩౦ నాటికి పండ్రెండు సంవత్సరము లగుచున్నది. కావున, విజయాదిత్యుని పాములవాకశాస

---

1తస్య మమ్మడిభీమస్య సుతః కృతమతి ర్మహా
రాజరాజాహ్వయో రాజా ద్వాదశాబ్దా న్ధరా
తం రాజరాజం నృపతిం నిధాపిత్య [మహాత్.
భువః ప్రసహ్య విజయాదిత్యః
విమలాదిత్యతనూజో తస్య
ద్వైమాతురో గృహీద్రాజ్యమ్.
శ్రీమాన్నాకే నమాఘే దృగిషు నిధిమితే
కర్కాసే కర్కటాంశౌ
శుద్ధాత్మా శుద్ధపంచమ్యదితిసుతదినే
సూర్యభే శౌర్యశాలీ,
కన్యాలగ్నే తిథన్యే శశికులతిలకో
రాజమార్తాండసూను
ర్వేంగీసామ్రాజ్యపట్టం స్మ వహతి విజయా
దిత్యభూపః ప్రతాపీ.

JAHRS. Vol· Part 1, P. 38·

నను తెలుపుచున్నట్లు, రాజరాజు ధరను, విమలాదిత్యునితరువాత యథార్థముగ పంద్రెండు సంవత్సరములు పాలించె ననుట నిశ్చయము. కాని, యందులో మొదటి నాలుగేండ్లును, రాజరాజు గాని, యాతని తరువాత రాజ్యమేలినవారు గాని, రాజరాజు యొక్క రాజ్యపాలన—విజయరాజ్యవర్షములు—సంవత్సరములుగా లెక్కించలేదు. దానికి కారణము. ఈవఱకే తెలిపితిని. అది రాజప్రతినిధుల పరిపాలనా కాలము. రాజరాజు మరణానంతరము సింహాసన మెక్కి వేంగిసామ్రాజ్యమును పాలించుచుండిన కాలమున నిచ్చిన రెండు ర్యాలి తామ్రశాసనములందును1 విజయాదిత్యుడు తన యన్న అవిచ్ఛిన్నముగా ౪౧ సంవత్సరములు పరిపాలించె నని వచించి యున్నాడు. అట్లే ఇమ్మడి శక్తివర్మయు, తనను మియవాపె తామ్ర శాసనమున2 గూడ తన పెదతండ్రి రాజరాజు ౪౧ సంవత్సరములు రాజ్యమేలెనని చెప్పినాడు. తత్పూర్వము విమలాదిత్యుడు ఏడేండ్లు రాజ్యభారము బూనియుండె ననిగూడ తెలిపినాడు.

వారిరువురును రాజరాజు రాజ్యపాలనవర్షములను, అతని పట్టాభిషేకము జరిగిన శ. ౯౪౪ సంవత్సరమునుండియే లెక్కించిరి. ఇందు ఇంకొక విషయమునుగూడ విశద మగుచున్నది. ౧౦౩౦—౧౦౩౩ సంవత్సరముల నడుమ జరిగిన విజయాదిత్యుని తిరుగుబాటువలన రాజరాజు రాజ్యపాలనమునకు విచ్ఛేదము కలుగలేదనియు, విజయాదిత్యుడు పట్టాభిషేకము చేసుకొనినప్పటికిని రాజరా జాతని అదిమి, పదభ్రష్టుని చేసెననియు స్పష్టమగుచున్నది. నన్నయభట్టుగూడ నీభావమునే స్ఫురింపజేసి యున్నాడు. రాజరాజును "అపరాజిత భూరిభుజాకృపాణ ధారాజలశాంతశాత్రవపరాగుడు రాజమహేంద్రు డున్నతిన్" అనియు, "ఘోరాజిముఖోపలబ్ధ విజయప్రమదాశ్రిత బాహుదండ, నిస్తేజిత వైరివీర" యనియు, "దండితాహితవీర"యనియు నన్నయభట్టు వర్ణించినాడు.

రాజరాజు రాజ్యారంభకాలము సుదుర్ఘటకు ఎట్టి చిక్కులును లేవు. మరియు, రాజప్రతినిధిగా రాజ్యమేలిన కాలమునగాని, అటుతరువాత మరి ౭,౮ సంవత్సరములవఱకుగాని ఆంధ్రదేశమున ఎట్టి అంతః కలహములును లేవు. ఎట్టి అలజడియును లేదు. వెంకటరమణయ్యగారి సిద్ధాంతములు, ఈపట్టున, నిరాధారములే గాక, సుబద్ధమైన శిలాశాసనములను అసంబద్ధముగ అన్వయించుటవలన, కల్పింపబడినవని తెలియగలదు. వెంకటరమణయ్యగారు ౧౦౧౮—౧౦౨౨ సంవత్సరముల నడుమ శా మనుకొనినట్లు జరిగియుండు నని ఊహించుటకు వారికి సాయపడిన శిలాశాసనములు ౫, అనంతపురముజిల్లా మడకశిర తాలూకాయందు లభించినవిగలవు. అందు మూడు కొత్త శివరం గ్రామమునందును, మిగిలిన రెండును, అక్కడకు పదునెనిమిది మైళ్ళదూరమున నున్న మడకశిర గ్రామమునందును లభించెను. వాటిలో కొత్త శివరం గ్రామంతాలూకు ఒక శాసనము. (A. R. No. 23 of 1917)ను, మడకశిర గ్రామం తాలూకు ఒక శాసనమును (A.R. 752. of 199) రాజేంద్రచోడుని పదియవరాజ్యవర్షమున వేయబడినవి. మిగిలిన మూడింటిలోను విజయరాజ్యవర్షములు లేవు. ఈ అయిదు శాసనములును ఒకే కాలము నాటి వనియు, అనగా రాజేంద్రచోడుని పదియవ రాజ్యవర్షము అనగా ౧౦౧౮+౧౦ = ౧౦౨౭-౨౮ సంవత్సరమునాటి వనియు నీలకంఠ శాస్త్రిగారి మతము. వెంకటరమణయ్యగారు ఆ మతమునే అంగీకరించినారు. కాని అవియన్నియు ఒకే సంవత్సరము నాటివి కావేమో యని సంశయము కలుగక మానదు. ఆ సంశయమునకు బీజము ఆ శాసనములయందే గలదు. కొత్త శివరమునుండి కొన్ని శిలాకంబములను దెచ్చి, మడకసిరలో వేణుగోపాల స్వామివారి యాలయమున ఒక మంటపమును గట్టిరి. అది యెప్పుడు జరిగెనో తెలియదు. ఆ మంటపములోని స్తంభములు కొన్ని, పాత కొత్త శివరములనుండి తెచ్చినవిగా నున్నవి. నొలంబవాడి రాజ్యమునకు తూర్పున, ఆ సీమలకు జగదేకమల్ల జయసింహుని యొత్తిడివలననే యుపద్రవమును రాకుండుటకు గాను రాజేంద్రచోడుడు శివరదుర్గముననో, లేక మడకసిర దుర్గమునందో కొంత బలమును కావలి యుంచెను. ఆ సైన్య

---

1. C. P. Nos. 8 Ana 9 of 1925. F

2. JAHRS, Vol. V. Part I PP 30 —49.

మునకు దండాధీశుడు విక్రమచోళ-చోళియవరిశన్. అతనికి అరెయం రాజరాజం, అని ప్రతినామముకూడ కలదు. అతడు రాజేంద్రచోడుని పదియవరాజ్యవర్ష మున కొ త్త శివరమున నొక దేవాలయమున కొక శిలా మంటపమును గట్టించెను. మంటప స్తంభములపై అందందు తన బిరుదు గద్యలను, తన ఘనకృత్యములను తమిళ, కన్నడ భాషలయందు వ్రాయించుకొనెను. అట్టి బిరుదులు గల శాసన స్తంభ మొకటి మడకసిర వేణుగోపాలస్వామివారి దేవాలయమంటపమునందు గలదు. దానియందు రాజ్యవర్షములు లేవు. దానిలో (A. R. 751 of 1917) దండనాయకచోళియవరిశన్, చోళరాజు తన్ను వేంగిదేశముపై దండెత్తి పోవలయు నని ఆదేశించినమాట విన్నంతమాత్రాన భీతుడై వేంగీ శుడు పెన్నిచ్చి పాఱిపోయెనని, వ్రాయించుకొనెను. ఇది కూరం మన్యమైన రిత్తవచనము గాదు. కాని చోళియవరిశన్ వేంగీదేశముపై దండెత్తిపో నవసరము కలుగలేదనియు, నిజముగా దండెత్తి పోలేదనియు మాత్రము స్పష్టము. దండెత్తిపోయెననుటకీ సాక్ష్యము చాలదు. కాని వెంకటరమణయ్య గారు తమ వాద మును బలపఱచుకొనుటకు, రాజేంద్రచోళుడు తన చమూపతి యగు చోళియవరిశనను నతనికి వేంగిదేశ ముపై నెత్తిపోయి, యా దేశమును స్వాధీన పఱచు కొమ్మని యాజ్ఞ చేసెననియు, దాని ననుసరించి రాజేంద్రచోడుని పదియవ సంవత్సరమున, అనగా శ. ౯౪౩ వ సంవత్సరమున వేంగిదేశము మీాదికి చోళియవరిశ దండనాయకత్వమున “దండయాత్ర నంపెననియు, చోళుల ధాటి కాగజాలక అప్పుడు వేంగి నేలుచుండిన నరపాలుడు దేశము త్యాగముజేసి పాఱిపోయెననియు దెలియుచున్నది.” అని ఊహించి వ్రాసిరి. ఈ వ్రాత కేవలము కల్పనాకథ. అట్టికథను వ్రాసి చరిత్ర యని దెలుపుట సాహసకార్యము. రాజేంద్రచోడుని దశమవర్షము, ౧౦౨౧ మెయ్ మొదలుకొని ౧౦౨౨ మెయ్ వఱకు నడచెను. అది శ. ౯౪౩ అగుచున్నది. అప్పటి కింకను విమలా దిత్యుడు మరణించలేదు. రాజరాజు రాజప్రతినిధిగా పాలించుచున్నాడు. మహామతియగు వజ్జియ ప్రగ్గడ ప్రధానిగా కార్యఖడ్గముల వేంగీశ్వరులకు సేవచేయు చున్నాడు. ఇట్టి సందర్భములను గమనింపక వెంకట రమణయ్యగారు “విమలాదిత్యుని యనంతరము వేంగి యందు రాజ్యవిప్లవము సంభవించి, తన్మూలమున గొంత యలజడి గలిగినట్లు తోచుచున్నది. రాజ్యమున పోరాటము ప్రారంభమయ్యెను. పిత్రియమైన రాజ్య మును రాజరాజనరేంద్రు నేలనీయక ప్రతిపక్షి యెవ్వడో నాచికొనగా, దుర్బలుడును నిస్సహాయుడు నైన మేనల్లునికి బాసటగ రాజేంద్రచోళుడు సైన్యము నంపి యతని శత్రుని బాఱద్రోలి పూర్వ చాళుక్య రాజ్యమును మరల ప్రతిష్ఠించెను.” అని వ్రాసిరి. ఇట్టి వ్రాతలు కేవల కల్పనాకథలు. ముందుగా ఒక అభి ప్రాయమును మనసులో బెట్టుకొని, దానికి బలకర ముగా సాధనములు వెదకి కల్పనచేసి కథ వ్రాయుట చరిత్రరచన కాజాలదు. రాజరాజు దుర్బలుడు నిస్స హాయుడు నట! రాజేంద్రచోడుడు వేంగీ సింహాపీఠ ముపై మరల చాళుక్యరాజవంశమును ప్రతిష్ఠించెనట! ఈ యూహలకు ప్రమాణములు కానరావు.

ఇంకను కలదు వెంకటరమణయ్యగారి అపూర్వ కల్పనా విశేషము. చోళియవరిశను “జయసింఘకుల కాలుడనని చెప్పుకొన్నాడు — ఈ జయసింఘు డెవ్వడో నిశ్చయింప వీలులేదు. అట్లైతతే వెంకటరమ ణయ్య గారు “దీనివల్ల (యీా బిరుదమువల్ల) జయసిం ఘుని కులమును రూపుమాపుటచే నితని కీ పేరు వచ్చెనని చెప్పవచ్చును. ఇచ్చట పేర్కొనబడిన జయసింఘుడు శ. ౯౩౪ (౧౦౧౨) సంవత్సరమున బశ్చిమచాళుక్య సామ్రాజ్యము నేల నారంభించిన జగదేకమల్లనామాం తరుడగు నిమ్మడి జయసింహుడు.” అని వ్రాసిరి. “జయ సింఘకులకాలుడు అనే బిరుదము జయసింఘునికుల మును నాశనము చేసినవాడని యర్థము. జయసింహుడు- అతని కులము నిజముగా నాశనము కాలేదు— ఇమ్మడి జయసింహుడు, ౧౦౪౨ డిశంబరు వఱకు రాజ్యము చేసెను. తరువాత అతని కుమారుడు ఆహవ మల్ల* సోమేశ్వరుడు ౧౦౪౩ జనవరిలో సింహాసన మెక్కెను.

కావున చోళియవరిశను చంపినది, కులము నాశ నము చేసి ‘కాలుడని’ బిరుదు దెచ్చుకొన్నది, చక్రవర్తి ఇమ్మడి జయసింహుడు కాజాలడు. మరి యెవ్వడో సామంతనృపుడు కావచ్చును. చోళియవరిశను జయ సింహునితో ఆంధ్రదేశమున బోరాడియుండె నని

* (Ind, Ant, XLVII (1918) pp 285PH.)

యూహించిన కథ వెంకటరమణయ్యగారి సిద్ధాంతము ననుసరించి శ. ౯౪౩ అనగా ౧౦౨౧–౧౦౨౨ లోపలనే జరిగియుండవలయును. అట్టి వృత్తాంతములు జరిగియుండినట్లు ఇతర శాసనాధారములు ఏవియు కానరావు. జయసింహుని కాలమునన్న బిరుదున్న శిలాశాసనము (AR. 30 of 1917) నందు తేదీ లేదు. అదియును గాక, తిరుమలకొండ శాసనమును, తిరువాలంగాడు తామ్రశాసనములును పరిశీలించినపుడు శ. ౯౪౩ (అనగా ౧౦౨౧–౨౨) సంవత్సరమునందు రాజేంద్రచోడుని సైన్య మొకటి గంగాజలమును గొని వచ్చుటకు ఉత్తరదిశకు పోయియుండెనని తెలియుచున్నది. వేంగి భూమియందు నాడు అల్లరులు, తిరుగుబాటులు, ద్రోహకార్యములు జరుగుచుండినచో తరుచుగా శూరంమన్యవాక్యములతో నిండిన చోళ శాసనములు, వేంగిలో తా మొనరించిన ఘనకృత్యములను గోరంతలు కొండంతలుగా చేసి వర్ణింపకుందునా?

ఈ విషయములన్నియు పరిశీలించినపుడు తేలు సారాంశములు రెండు. అవి యెవ్వి యనిన (౧) చోళీయవరిశను ఆంధ్రదేశముపై శ. ౯౪౩ (౧౦౨౧—౨౨) సంవత్సరమున దండెత్తిరాలేదు. (౨) ఆనాడు వేంగి భూమియందట్టి యలజడియును లేదు. (౩) చోళరాజగు రాజేంద్రచోడుని ఆ దేశమును విన్నంత పారిపోయిన వేంగీపతి వృత్తాంతము ౧౦౨౧–౨౨ సంవత్సరమునాటిది గాదు. (౪) ఒక వేళ నిజముగా చోళీయవరిశను ఆంధ్రదేశముపై దండెత్తివచ్చెనని నమ్మినను, ఆదండయాత్ర ౧౦౨౧–౨౨ సంవత్సరము తరువాత యెప్పుడో జరిగియుండవచ్చును. (౫) తేదీ లున్న రెండు శాసనములును, తేదీలు లేని మూడు శాసనములును ఒకే కాలమున ఒకే సంవత్సరమున వేయించబడినవి కాజాలవు. ఆ రెండింటి నడుమ కనీసము పది సంవత్సరములైన అంతర ముండవచ్చును. ఇందలి కడపటి ౪, ౫ విషయములను మరల కలిదిండి యుద్ధకాలమును నిర్ణయించునపుడు విమర్శించెదను.

ఒక యూహను మనసులో బెట్టుకొని సిద్ధాంతములు కల్పించి చరిత్రరచన చేయబూనుటవలన నిరాధారములైన సిద్ధాంతము లనేకములు బయలు దేరును. అట్టి విపరీతసిద్ధాంతములను పెక్కింటిని వెంకటరమణయ్యగారు ప్రతిపాదించియున్నారు. ఒక నిరాధారమైన సిద్ధాంతమును బ్రతిపాదించి యూ పునాదిమీద సౌధమును గట్టుట సంగతము గాదు. 'వేంగీ సింహాసనముపై మరల చాళుక్యరాజును ప్రతిష్ఠించెను, రాజేంద్రచోడుడు.' అన్న సిద్ధాంతమును మనసులో బెట్టుకొని వెంకటరమణయ్యగారు, రట్టపాడిమీదికి రాజేంద్రచోడుడు దండయాత్రలు సాగించినది, "వేంగిని దన యధికారము క్రిందికి దెచ్చి తన మేనల్లుని ఆ రాజ్యమున కధిపతిగ జేయుటయే యతని ముఖ్యోద్దేశ్యము" అని వ్రాయ సాహసించిరి. ఇందులకు ఎన్నియో ఊహలను కల్పించుకొనిరి. వాటికి మూలాధారముగ విమలాదిత్యుడు చనిపోయిన తరువాత రాజరాజుకు రాజ్యము దక్కకుండ చేసిన ప్రత్యర్థి యొక్కని (అనామకుని) సృజించి వానిచే రాజరాజుకు బాధ కలిగించి అంతట రాజేంద్రచోడుని సాయము కల్పించి రాజేంద్రచోడునిచే వేంగీచాళుక్య రాజ్యప్రతిష్ఠాపనను చేసి, రాజరాజును వట్టి బలహీనుని, అప్రయోజకుని చేసిరి! అట్లు చేసియు, ౧౦౧౮—౧౦౨౨ సంవత్సరముల నడుమ రాజరాజుకు రాజ్యము స్వాధీనము గాకుండ చేసినది విజయాదిత్యుడు కాజాలడనియు, మరియెవ్వడో అయియుండుననియు చెప్ప సాహసించిరి. అంతట నిరాధారముగ, చోళీయవరిశను దేశమును వశపఱచుకొనెనని సిద్ధాంతముచేసి, పిమ్మట రాజేంద్రచోళచక్రవర్తి స్వయముగ రాజమహేంద్ర నగరమునకు పోయి, రాజరాజనరేంద్రునకు పట్టాభిషేకమహోత్సవమును గావించెను, అని వ్రాసిరి! ఇది చిత్రమైన కల్పనాకథ!

ఈ కలిదిండి శాసనమున దెలుపబడిన సంగ్రామము రాజేంద్రచోడుడు జీవించియుండగనే జరిగెను. అందు కావంతయు సందేహము లేదు. "రాజేంద్రక్షితిపాలకస్య మహతో మన్మాతులస్యాదేశం ప్రతిపద్య తత్క్షణాత ఏ వాంధ్రభూమాం ప్రాగమత్" అను శాసనవాక్యము దీనికి బ్రమాణము. గవర్నమెంటు ప్రాచీనశాసన పరిశోధనశాఖవా రూహించినట్లు అయినను గాక పోయినను, అనగా రాజరాజ విష్ణువర్ధనుడు వేడినపిమ్మట అయినను గాకపోయినను, అతని సహాయార్థము రాజేంద్రచోడుడు చోళదండాధీశులను సేననిచ్చి పంపెననుట నిక్కము. రాజేంద్రచోడుడు జీవించియుండిన కాలమందే ఇది జరిగియుండవచ్చును.

రాజేంద్రచోడుడు ౧౦౪౩ వరకు జీవించియుండెను. ఇమ్మడి జయసింహుడు ౧౦౪౨ సంవత్సరపు చివర రోజులలో మరణించెను. కావున ఆంధ్రభూమిమీదికి సైన్యములను బంపిన కర్ణాటభూమీశుడు ఇమ్మడిజయసింహుడు గావలయును. కలిదిండి యుద్ధము ౧౦౪౨ సంవత్సరమునకు పూర్వమే, రాజేంద్రచోడుడు బ్రతికియున్న కాలమునందే, జరిగియుండవలయును. ఆహవమల్ల సోమేశ్వరుని కాలమున ఆ యుద్ధము జరిగియుండెననుటకు, సావకాశము ఆవంతయు లేదు. వెంకటరమణయ్యగారు శ. ౯౬౪, అనగా ౧౦౪౨–౪౩ లో జరిగినట్లూహించిన దానికి ఆధారములేదు. అప్పటికి రాజేంద్రచోడుడు జీవించియుండలేదు.

జగదేకమల్లు డింక ఆంధ్రదేశముమీదికి తన సైన్యము నేల బంపెను? ఎప్పు డే సందర్భమున బంపెను, అన్న ప్రశ్నలకు సమాధానము గావలయును. వేంగీశ్వరులలో చోళుల కహితుడైనవాడు ఒక విజయాదిత్యుడే—రాజరాజుయొక్క సవతితమ్ముడు. పశ్చిమచాళుక్య భూపాలురకును, తూర్పుచాళుక్యులకును మొదటి శక్తివర్మనాటినుంచి వైరమే సాగుచుండెను. పశ్చిమచాళుక్యులకు ఎప్పుడైన హితుడుగా నుండినవాడు విజయాదిత్యు డొక్కడే. ఆ విజయాదిత్యుని పాములవాక శాసనమును పరిశీలించి, అతడు ౧౦౩౦ మొదలు ౧౦౩౩ వఱకు మూడు నాలుగేండ్ల కాలము రాజరాజున కాతడు ద్రోహియై వర్తించి వేంగీ సామ్రాజ్యమునకు బట్టముకూడ కట్టుకొనె నని తెలిసికొంటిమి. కావున ఆంధ్రభూమికి విజయాదిత్యునికి సహాయార్థము సైన్యములను కర్ణాటజయసింహుడు పంపెనని యూహించుటకు అవకాశము గలదు. విజయాదిత్యుని సహాయార్థమును, రాజరాజును పదచ్యుతుని జేయు తలంపుతోడను కర్ణాటభూమీశుడు ఆంధ్రభూమికి దండుబంపుట జూచి, వాటి నెదుర్కొనుటకు, జయసింహ విజయాదిత్యుల మనోరథము విఫలమగుటకు, రాజేంద్రచోడుడు తత్క్షణము తనయొక్క సైన్యమును ముప్పుర దండాధీశుల నాయకత్వమున ఆంధ్రదేశమునకు బంపెను. అప్పుడు కర్ణాటద్రమిళ సైన్యములకు మాత్రమే ఘోర సంగ్రామ మయ్యెను. ఆ యుద్ధమునందు ఆంధ్రసైన్యములు చేరలేదు. ఆ యుద్ధము సమానయుద్ధముగ పరిణమించెనని కలిదిండి శాసనము వాకొనుచున్నది. ఎవరికిని జయము చేకూరలేదట. ఆ కలిదిండి యుద్ధానంతర మేమి జరిగెనో తెలియదు. తెలుసుకొనుట కాధారములును లేవు. కాని కలిదిండి యుద్ధమునందు జయలక్ష్మి కర్ణాటులనే వరించిన ట్లూహించుట ఒప్పును. ఎందుచేత ననగా, చోళదండనాథులు ముగ్గురును ఆ యుద్ధమునందు అసువులు విడిచినారు. అదిగాక ఆ దినములలోనే విజయాదిత్యుడు పట్టాభిషేకము జేసుకొనెను. కావున కలిదిండియుద్ధము ౧౦౩౧ సంవత్సరారంభమున జరిగెననుట నిస్సంశయము.

చోళియవరిశను శూరంమన్యవాక్యముల నింక పరిశీలించెదను. తేదీలు లేని రెండు శాసనములందు అతడు రెండు విషయములను దెలిపినాడు. అందు మొదటిది. (AR 31 of 1917) కొత్తశివరం, పాతశివరముల మధ్యనున్న యొక్క శిథిలమంటపములోనున్న శాసనము. అది తమిళమున పద్యరూపమున నున్నది. అందుచోళసైన్యములకును, కళింగ ఒడ్డె, తెలుంగు సైన్యములకును సంగ్రామ మయ్యెనని యున్నది. ఆయుద్ధమున విజయముగాంచిన దెవ్వరో తెలుపబడలేదు. అది సమయుద్ధముగా పరిణమించె నేమోయనుటకు సావకాశ మున్నది. ఇక రెండవది ముక్కసిర వేణుగోపాల స్వామివారి ఆలయములో శిథిలమంటపములో నున్నది. (A. R· 751 of 1917)

అందు చోళరాజు రాజేంద్రచోడుడనియే యూహింపవలయును. చోళియ వరిశను. దండనాథుని వేంగిదేశముపై దండెత్తిపోవలయునని యాదేశ మంపినమాట విన్నంతనే వేంగీశుడు పాఱిపోయె నని తెలుపబడియున్నది. ఇక్కడ వేంగీశుడు నిస్సంశయముగా విజయాదిత్యుడు. అతడు వేంగిరాజ్యమును బలాత్కారముగ నాక్రమించుకొనినవాడు. పై రెండు శాసనముల విషయములను పరిశీలించినపుడు, విజయాదిత్యుడు, జయసింహుని యాదేశానుసారముగనో, మరి యే కారణమువలనో చోళసైన్యము లాక్రమించుకొన్న నొలంబవాడి రాజ్యసీమలపై దండెత్తి పోయియుండు ననియు, నాతని సైన్యములందు కాళింగులు, ఒడ్డెవారు, తెలుంగువారు, నుండిరనియు, కొంతకాలము విజయాదిత్యుడు జయములుగొనెననియు, అతడు

దేశమునందు లేకుండుట తగిన తరుణముగా తలచి వేంగిని తిరిగి జయించి, ఆక్రమించుకొని, తమ్ముని పదభ్రష్టుని, చేయుటలంపుతో నున్న రాజరాజ దేవరకు సహాయముగా ఆంధ్రదేశముమీదికి సైన్యములు నడిపించుకొని పోవలసినదని రాజేంద్రచోడుడు, తన చమూపతికి చోళియవరిశనకు ఆదేశమంపెననియు ఆ మాట చెవిసోకినంతనే చోళియవరిశను ఆంధ్ర దేశముపైకి బోవ సంకించిన వెంటనే, వేంగీశుడైన విజయాదిత్యుడు స్వదేశరక్షణార్థము వేంగిభూమికి పాఱిపోయెననియు దోచును. ఈ యూహ సరియైన దనుట నిస్సంశయము. విజయాదిత్యుడు ఆంధ్రభూమి యందు తన సింహాసనము పదిల పఱచుకొని, పగ దీర్చుకొనుటకు చోళరాజ్యసీమలమీదికి, నొలంబవాడి మీదికి దండెత్తిపోయెను. అది ౧౦౩౧ సంవత్సరాంత మున గాని, ౧౦౩౨ సంవత్సరమందు గాని ఎప్పుడో జరిగియుండెను. తనకే మొదట ముప్పు వాటిల్లుచున్న దని భయపడి విజయాదిత్యుడు వేంగికి వెంటనే వెను దిరిగి వచ్చియుండును. అది ౧౦౩౩ వ సంవత్సరమున జరిగియుండును. చివరకు విజయాదిత్యుడు అన్నగారి బలములకు, ధాటికి తాళలేక ఓడిపోయి పదచ్యుతుడై యుండును. అది ౧౦౩౩ సంవత్సరాంతము లోపుగా జరిగియుండును. ఆంధ్రభూమియందు అన్నదమ్ముల నడుమ జరుగుచున్న ఘోరయుద్ధములను, వాటి పరి ణామములను దిలకించుచు, గాబోలు, జగదేకమల్ల జయసింహుడు, కొల్లిపాక దుర్గమున తాత్కాలిక ముగా నివసించుచుండెను. అతడు శ. ౯౫౫ కు సరి యైన శ్రీముఖసంవత్సరమున— ౧౦౩౩ సంవత్సరము యొక్క చివరభాగమున కొల్లిపాకయందుండినట్లు శాసనాధారము గలదు. (Ep. Ind. V III P 236)

ఆతడక్కడుండుట కాకతాళీయము గాదు. జయ సింహు డప్పు డక్కడ వేంగిరాజ్య వ్యవహారములతో సంబంధము గలవాడుగనుక నే యుండుట సంభవించెను.

జగదేకమల్లుని కడపటి దినములలో పశ్చిమ చాళుక్యులు వేంగిని వశపఱచుకొనుటకు మరల నింకొక ప్రయత్నము గావించియుండిరని వెంకటరమ ణయ్యగారి నమ్మకము. కాని వారి వాదము అసంభవ మైనది. వారు చూపిన యాధారములు వారి వాదమును ఏమాత్రము ఋజువుచేయవు. వీరుమిక్కిలి యా ఇమ్మడి జయసింహుని యవసానకాలమున రాజరాజే నొలంబవాడి, గాంగవాడి సీమలపై దాడి వెడలి యున్నట్లు తోచును. ఆకాలము, అనగా ౧౦౪౨-౧౦౪౪ సంవత్సరములు నడిచిన మూడేండ్లను తన సవతి తమ్మునికి సహాయము చేయవచ్చిన జగదేక మల్లునిపై పగదీర్చుకొనుటకు రాజరాజదేవరకు మంచి యనువైన కాలము. ఈ యూహకు మైసూరు హాసన్ జిల్లా హొబ్బలితాలూకా బేలూరు గ్రామ మునందున్న కన్నడశాసన మొకటి కారణ మగు చున్నది.*

ఆ శాసనసారాంశ మిది. చాళుక్య రాజరాజు భృత్యుడైన మతివర్మసోదరుడు అండరసు ఆ సీమ దాటి, కొంగోడుసీమలను ప్రవేశించునపుడు ఇడుగోటి శివరగా వుండు, అండరసుతో పోరాడి వీరస్వర్గ మును జూఱగొనెను. ఇందు తేది లేదు. కాని రాజ రాజు సేనానులు గంగవాడిని జొచ్చి కొంత చీకా కును కల్గించి నట్లూహించుకొనవచ్చును.

ఇంతవఱకు రాజేంద్ర చోడ—జయసింహు లకు గల వైరమును, రాజరాజ విజయాదిత్యుల అంతః కలహమును ౧౦౧౮ మొదలుకొని ౧౦౪౩ వఱకు నడచిన కాలమున వేరీతిగా సాగెనో నిరూపించి తిమి. రాజాధిరాజు చోళసింహాసన మెక్కిననాట నుండి మరల పశ్చిమచాళుక్యులతోడి వైరము మరల విజృంభించెను. రాజాధిరాజునకు సమకాలికుడు, పరమశత్రువు ఆహవమల్లసోమేశ్వరుడు. అతడు సింహాసన మెక్కిననాటనుండి రాజాధిరా జాతని మీద కయ్యమునకు గాలుదూసెను. రాజాధిరాజ— ఆహవమల్ల సోమేశ్వరుల నడుమ జరిగిన ఘోర యుద్ధములను గూర్చి, వాటి కాలమునుగూర్చియు ప్రస్తావించుటకు బూర్వము, ఇమ్మడి శక్తివర్మ నుమియవాడ దాన శాసనవిషయమును వెంకట రమ ణయ్యగారు స్థాలీపులాకన్యాయముగ దడవినారు గనుక వాటిని చర్చింతును.

* Mys. Arch. Rept. 1924. pp 19 20. No. 18.

నమిలయవాడ శాసనమునందు * ఇమ్మడి శక్తివర్మ ఇట్లు తెలిపినాడు. "చాళుక్య వంశాగ్ర గణ్యుడయిన రాజరాజు ౪౧ సంవత్సరములు ధరామండలమును పాలించెను. పిమ్మట అతని సవతి తమ్ముడు, రాజరాజు పరోక్షమందు—రాజ రాజు దేశమందు లేని సమయమున, వీరశ్రీయుతుడయి విజయాదిత్యుడు రాజ్యము బలిమిచే లాగుకొనెను." ఇట్లు విజయాదిత్యుడు ద్రోహియై అన్నమీద తిరుగ బడి రాజ్యమును బలాత్కారముగ లాగుకొన్నది రెండవమారు. మొదటి పర్యాయమును గురించి యది ౧౦౩౦-౩౩ సంవత్సరముల నడుమ జరిగెనని యూహతో తెలిపితిని. ఈ రెండవతూరి చేసిన ద్రోహము. శ. ౯౭౪ కు సరియైన శుభకృతుసంవత్సరమున అనగా ౧౦౫౨ సంవత్సరమున జరిగియుండెను. ఈ రెండుతిరుగుబాటులు మాత్రమే గాక, విజయాదిత్యుడు మూడవ తిరుగుబాటును కూడ జేసెననియు, నది విమలాదిత్యుని మరణానంతరము జరిగియుండ వలయుననియు, అయినను దానిని నొక్కి చెప్పుటకు దగిన యాధార మెద్దియు గానరాదనియు, వెంకట రమణయ్యగారు వ్రాసియున్నారు— "తండ్రిమరణా నంతరము" విజయాదిత్యు డెట్టి తిరుగుబాటును చేయ లేదని యూహతోకే తెలిపితిని. చేయజాల డనుటకుకూడ ఆధారము గలదు. విజయాదిత్యుడు తండ్రి రాజ్యపరి త్యాగము చేయునాటికి బాలుడు—రాజరాజు పట్టాభి షిక్తుడయిననాటికి పదునారేండ్లవాడుగా నుండవచ్చును అట్టి లేతవయస్సున విజయాదిత్యునకు ద్రోహబుద్ధి పొడమె ననుటకు సాధనములు చాలవు. కళింగభూమీ శుడు వేంగీశునికి మిత్రుడో, లోబడియుండిన రాజో అయియుండెను. దానికి విమలాదిత్యుని సురుభక్తి కొంప శాసనమే ప్రమాణము. జగదేకమల్లు డింకను రాజేంద్రచోడుని తన దేశమునుండి పాఱద్రోలి, రాజ్యమును అప్పుడప్పుడే పదిలపఱచుకొనుచుండెను. కావున అట్టి పరిస్థితులలో విజయాదిత్య డెవ్వరి సహాయమును జూచుకొని యన్నపై తిరుగుబాటు గావించగల్గెనో యూహింప శక్యము గాదు. వెంకట రమణయ్యగారి యూహ అవిషయముగా నిరాధారమైనది.

* JAHRsVol. V· Pl 33 pp. పంక్తులు ౫౪-౫౫)




---

## సవరణ

(గత సంచికలో ఈ వ్యాసపూర్వభాగమున "బేతనభట్టు" అనుటకు చేతనభట్టు అని పడినది. చదువరులు సరిదిద్దుకో ప్రార్థన. సం.)

కథానిక:

# దంపతులు

శ్రీ జయంతి శ్రీరామమూర్తి

డాక్టరనే పేరుతప్ప రంగారావుకి ఆస్తియేమీ లేదు. ఇంకా ఏమన్నా వుంటే నాలుగు వూలుసూట్లూ, అరడజను నెక్ టైలూ, మూడు జతల బూట్లూను. ఆదాయం లేని ఈ ఆర్భాటాన్ని శాంత ఎల్లాగ భరిస్తోందో నా కర్థం కావడం లేదు. భరించ కేం చేస్తుంది— తనకు తానై వరించి పెళ్ళి చేసుకున్నాక. ఆనాడు నే నెంత చెప్పినా వింటేనా?

"ఆస్తి లేకపోతే నేం? నోట్లో నాలుకవున్నాక నాలుగురాళ్లు దొరక్కపోతాయా?" అన్నదే శాంత వాదం. ఇహ లోకంలో ఎవ్వరికీ నాలుక లే లేనట్లు— మా అత్తయ్య పరేషరి.

"కూతురుప్రేమకి అడ్డు తగలకూడద"ని గర్గ పన్నాలు వల్లించింది. మామయ్య తలవూపేడు. అసలు సంగతి మాత్రం ఎవ్వరూ తెలుసుకోరు. ఎలా తెలుసుకుంటారు— శృతిమించి రాగాన పడితే నేగాని తెలుసుకోలేక పోయేరారు. వాళ్ల ప్రణయవిలాసాలు నాకు తెలిసినా మధ్య నాకెందుకని వూరుకున్నాను. నా విషయం శాంత పట్టించుకోకపోయాక ఆమె విషయం నా కెందుకు?

ఇంతకూ చెప్పవచ్చే దేమంటే, అలాంటి ప్రబంధనాయకుని ఏరి, కోరి వరించేక ఈనాడు భరించ కేం చేస్తుంది? రంగారావు పరేషరి. ఒకే తల విసురు. ఏం చూసుకునో ? మీసాలకి సంపెంగనూని సామ్యం. పట్టుమని నెలకు వందరూపాయలు ఆదాయం లేదు— సూట్లూ, క్లబ్బులు, పేకాటలు— 'రెండు చేతులూ కలిస్తే చప్పుడు.' అన్నా ప్రయోజనం లేదు. నాకెందుకు మధ్య? నాచదువు పూర్తి చేసుకుని పోతే 'ఎవరికి వారే— యమునాతీరే.' ఏదో బంధువులనీ, మామయ్య బాధపడతాడనీ వాళ్ల వీధిగదిలో వున్నానేకాని, నాకేం వేరేచోట వుండ లేనూ? ఇలాగ సరిపెట్టుకుంటూ నారోజులు దొర్లించుకుంటున్నాను. కాని ఒక్కొక్క రోజు గడిచినకొద్దీ నాలో ప్రబలమౌతున్న అశాంతిని భరించడం కష్ట మనిపిస్తూంది. మా శాంత అంత అందకత్తె, చదువుకుంది, గుణవతి, అలాంటి అమాయకురాలిని అనవసరంగా హింసిస్తున్నాడే అని బాధపడుతున్నాను.

ఒకరోజున రాత్రి పన్నెండుగంటలకి వచ్చేడు రంగారావు. పాపం, శాంత నిద్రమత్తులో వుంది కాబోలు వెంటనే తలుపు తెరవలేదు. తర్వాత లేచి తీసింది. అతని కేం తోచిందో అనవసరంగా చెయ్యి చేసుకున్నాడు. ఆ శబ్దం నాకు వినిపిస్తూనే వుంది. శాంత వెక్కి వెక్కి లోలోపలే ఏడుపును అణచుకుంటోంది. అతనుమాత్రం అరుస్తున్నాడు. నాకు మహా చెడ్డకోపం కలిగింది. వెళ్ళి రంగారావుని మర్దించాలనుకుని లేచేను. కాని, వాళ్ళ తలుపు లోపల వేసివుంది. విధిలేక వెనక్కి తగ్గిపోయేను. మర్నాడు సానుభూతితో అడిగేను శాంతని—

"ఏం జరిగింది శాంతా—నిన్నరాత్రి"అని.

ఏమీ లేదు" అంది.

"నాదగ్గర దాస్తావేం - నా కంతా తెలుసు" అన్నాను.

"నీ కేం తెలుసు" అంది సూటిగా చూస్తూ "నిన్నరాత్రి రంగారావు నీమీద చెయ్యిచేసుకో లేదూ" అన్నాను.

"లేదు. చాల్లే, ఇల్లాంటి అసత్యప్రచారం చెయ్యకు. నువ్వు చూసేవా ?" అంది శాంత.

నావొళ్లు మండింది.

"నిన్ను నువ్వే మోసగించుకుంటున్నావు శాంతా. అంత గట్టిగా శబ్దమయ్యేక బుకాయిస్తావెందుకు ? నాకామాత్రం బుర్ర వుంది" అన్నాను.

శాంత నవ్వుతూ అంది కదా—

"చాల్లే బావా ! ఆయన రాత్రి పరుపులు దులి

పారు. అదీ ఆ చప్పుడు. అంతే కాని, ఆయన నన్నెప్పుడూ కొట్టలేదు. కొట్టరు. అలాంటివారు కాదు." అని.

నాలో నాకే సిగ్గువేసింది. నేను చూసినంత మాత్రాన శాంత నన్ను దబాయించేసింది. తన భర్త మహాసౌమ్యు డయినట్లూ, నేనే విషప్రచారం చేసే దుర్మతి నయినట్లూ తేల్చేసింది. మధ్యని నా కెందుకు కందకి లేని దురద అనుకుంటూ వెళ్ళిపోయాను ఆమెదగ్గరనుంచి.

ఇంకోనాడు సాయంత్రం కాలేజీనుంచి ఇంటికి వచ్చేను. లోపల పెద్ద రాద్ధాంతం జరుగుతూంది. పేకాటకు డబ్బు కావాలని రంగారావూ, లేదని శాంతాను. అరగంట విని, భరించలేక తిరిగి వీధిలోకి వెళ్ళిపోయాను. ఎనిమిదిగంటలకి యింటికి వచ్చేసరికి శాంత గుమ్మంలో కూర్చునివుంది. నన్ను చూసి లేచింది. నాకు జాలికలిగింది. చిన్నతనంలో స్వతంత్రంగా బ్రతికిన శాంత ఈనాడు భర్త చేతిలోని కీలుబొమ్మ అయిపోయింది.

"ఒంటరిగా కూర్చున్నావేం? అత డేడీ?" అన్నాను.

"అలా వెళ్ళేరు. వస్తారిప్పుడే" అంది శాంత.

"శాంతా! నిన్ను చూస్తే జాలికలుగుతూంది నాకు" అన్నాను.

"ఎందుకు?"...శాంత.

"ఎందు కేమిటి? సూర్యుని చూపడానికి దివిటీ కావాలా? రంగారావు నిన్ను చూస్తున్నంత హీనంగా ఈ ప్రపంచంలో ఏ భర్తా తన భార్యని చూడడు" అన్నాను ఆవేశంతో. శాంత మనస్సు చివుక్కు మంది కాబోలు.

"చాలు చాలు. చెప్పవచ్చేవు. బ్రహ్మచారివి. నీకేం తెలుసు భార్యాభర్తల విషయాలు" అంది. నాకేమీ తోచలేదు. ఎలా చెప్పినా శాంత తెలుసుకోదు. తన భర్తే దైవమనీ, అతడు కోసినా ఎవరితోనూ చెప్పుకోకూడదనీ ఆమె నమ్మకం.

రోజులు గడుస్తున్నాయి మా పరీక్షలు సమీపిస్తున్నాయి. రంగారావు ప్రలోభాలలో పూర్తిగా మునిగిపోతున్నాడు. డైతోస్కోపు మూల పారేసేడు. వైద్యానికి ఎవ్వరూ రావడంలేదు. ఎలా వస్తారు? అంత అశ్రద్ధమనిషి చేతులో తమ ప్రాణాలు చూసిచూసి ఎలా పెడతారు? క్రమంగా యింట్లో వున్న వెండిగిన్నెలు, వెండికంచాలు రూపాయల రూపం దాల్చి యెగిరి పోతున్నాయి. ఇక వుండబట్ట లేక ఓనాడు శాంత దగ్గర అనేసేను.

"శాంతా! పరిస్థితి విషమిస్తోంది. తెలుసుకున్నావా?"

"ఏం తెలుసుకోవాలి?" అంది శాంత.

"రంగారావు ఉన్నదంతా తగలేస్తున్నాడు!...

"బావా! తన కున్నది ఖర్చు చేసుకుందుకామాత్రం అధికారం లేదా ఆయనకి?" అంది శాంత.

"లేదనను. ఈ కొంచెం అయిపోతే ఎలా తింటారు?" అన్నాను.

"సంపాదించుకు తింటారు. దానికంటె పెద్ద ఆలోచన ఎందుకు? ఈ రూపాయలమాత్రం మా మనస్సుల్ని విడదియ్యకపోవడమే కావాలి" అంది శాంత.

"ఆ మాట నిజమే శాంతా! కాని రంగారావు పెడదారుల్లో పడి నిన్ను బాధిస్తున్నాడు" అన్నాను. ఉద్రేకం పట్టలేక.

"బావా! క్షమించు. ఈరోజు మొదలు ఆయనను ఏమీ అనకు - నన్ను ఏమైనా వుంటే" అంది. అమాయకురాలు శాంత. ఒక్క క్షణం ఆలోచించేను. శాంతననేందు కేమీ లేదు. ఆమె జీవితం స్ఫటికం లాంటిది. ఆమె నేమనాలి? ఇలా అనుకుంటూ 'పోనీ ఈ మాట రంగారావుతోనే అనేద్దా'మని నిశ్చయించుకున్నాను.

మా పరీక్ష లయిపోయిననాటి సాయంత్రం రంగారావు ఒంటరిగా రోడ్డుమీద పోతున్నాడు.

"మిమ్మల్ని ఒక్కమాట అడుగుతాను. ఏమీ అనుకోకుండా చెబుతారా?" అన్నాను.

"దానికేం బాబూ, పదిమాట లడుగు" అన్నాడు రంగారావు— విస్పష్టంగా.

"అన్నగారూ! మిమ్మల్ని చూస్తున్నాను. అశ్రద్ధవల్ల మీ వృత్తి పాడుచేసుకుంటున్నారు. మీ దగ్గిరి కెవరూ పేషెంట్లు రారు."

"మా నెయ్యమను. నేను బలవంతంగా ఎవరినీ తీసుకురాలేను కదా!"...రంగారావు.

"మీ జీవితాన్ని ఈ వృత్తే కదా పోషించేది. దాన్నే నిరాకరిస్తే ఎలాగ?" అన్నాను ధీమాగా. రంగారావు కొంచెం వెర్రిగా నవ్వుతూ.

"బ్రదర్ భయపడకు—'శతకోటి దరిద్రాలకు, అనంతకోటి ఉపాయా'లన్నారు— బ్రతకలేక పోతామా?" అంటూ వెళ్ళిపోయేడు. రాత్రి ఇంటికి వచ్చేసరికి లోపల యుద్ధకాండ జరుగుతూంది. చిలికి చిలికి గాలివా నే అవుతూంది. తన సంసారవిషయాలు నాకు చెప్పిందని, శాంతని నిందిస్తున్నాడు రంగారావు. ఆమె మాత్రం గోడలకైనా వినపడనంత నెమ్మదిగా సమాధానం చెబుతూంది.

మర్నాడు ఉదయం లేచి చూసేసరికి వీధి తలుపు తాళం వేసివుంది. ప్రక్కయింటి ఆసామీ చెప్పేడు రాత్రి పన్నెండు గంటలకి రంగారావు బండెక్కి వెళ్ళిపోయేడనీ, శాంత ఏడుస్తూ సమ్మంలో వుండనీ— అయితే మరి శాంత యేమయింది? ఎక్కడికి వెళ్ళింది?

మా వూరు వచ్చేసే నన్నమాటే కాని మనస్సు శాంతమీదే వుంది. రెండురోజులెల్లాగో దాచి మూడోరోజు మామయ్యతో అన్నివిషయాలూ చెప్పేసేను. మామయ్య వాళ్ళిద్దరికోసం వూళ్ళన్నీ వెతికించేడు. పేపర్లో వేయించేడు "డాక్టరు రంగారావు ఉనికి చెప్పినవాళ్ళకి బహుమానం యిస్తానని—'

రేడియోలో చెప్పించేడు. ఎవ్వరూ సమాధానం రాయలేదు. ఎక్కడా వాళ్ళ జాడ తేలలేదు. నావూహని బట్టి రంగారావు ఆత్మహత్య చేసుకుని వుంటాడు. మరి శాంత ? అంత తెలివితక్కువ మనిషి కాదే. మరి ఎక్కడికి వెళ్ళివుంటుంది ? ఎలా జీవిస్తోంది ? ఈ విషయాలు క్రమంగా పాతబడి మరపుకు వచ్చే స్థితిలో పడ్డాయి నా మనస్సులో.

*   *   *   *

ఎప్పటికైనా ఋణానుబంధం వుంటే తలపులు త్రోళ్లగా నూరి మనుష్యుల్ని దగ్గరకు లాక్కొస్తాయి. నాలుగేళ్ల తర్వాత జరూరుపనిమీద బెంగుళూరు వెళ్ళేను. ఒకనాటి ఉదయం రోడ్డుప్రక్క నడిచి వస్తుంటే అకస్మాత్తుగా నా నెత్తిమీద వాడిన పూలగుత్తి ఒకటి పడింది. తలెత్తి పైకి చూద్దును గదా ! మెరపుతీగలా ఒక యువతి మేడమీదనుంచి చూస్తూంది. ఆ గుత్తి నామీద పడ్డందుకు క్షమాపణ చెప్పా లనుకుంటూంది, కాబోలు! నిలబడిచూస్తోంది. నేను నిర్ఘాంతపోయేను. నా కళ్లు నిజంగా చూసేయో, లేక నన్ను మోసగించేయో తెలియదు. అచ్చంగా మా శాంతే...శాంతే అయివుండాలి. నా బసలోకి వచ్చి విమర్శించుకున్నాను. శాంతే అయితే నన్ను పిలవదా ? గుర్తుపట్టిందో, లేదో. పోనీ నేనే పిలవకూడదా ? అదిమాత్రం ఎలాగ ? క్రిందనైనా కాదే ? మేడమెట్లు ఎక్కాలి ? ఇంతకీ ఆమె అవునో, కాదో ?

మర్నాడు అదేవేళకి ఆ దారిని వెళ్లేను. నే వెళ్లేసరికే పూలగుత్తి క్రింద పడివుంది. దాన్ని తీసి జేబులో వేసుకోవా లనిపించింది. కాని, చుట్టూ మనుష్యులాయె! మరుసటిదినం ఉదయం ముందుగా వచ్చి, కొంచెం దూరాన నిలబడ్డాను, మామూలు సమయానికి. ఆ యువతి వాడిన పూలగుత్తి పడేసి వెళ్ళిపోయింది. నా అనుమానం స్థిరమయింది. ఆమె నిస్సందేహంగా శాంతే. కాని, ఈ మేడమీద ఏం చేస్తోంది ?

డాక్టరుబోర్డుకూడా ఏదీ లేదే? ప్రక్క దుకాణంలో సోడా పుచ్చుకుని కొట్టువాడిని కదిపేను.

"ఆ మేడమీద యెవరుంటున్నారు" అని. వాడు తిన్నగా సమాధానం చెబుతాడా?

ఎందుకు?" అన్నాడు. నా గుండె ఆగినట్లనిపించింది.

"పనుంది. మా బంధువు డాక్టరుగా రొకాయన వుండాలి ఈ వీధిలో" అన్నాను.

"డాక్టరెవరూ లేరు. ఒక కూరల వర్తకుడూ, భార్యా వున్నారు" అన్నాడు.

నా కింక మాట రాలేదు. నాలుగడుగులు వేసి, వెనుతిరిగి

"ఆయన పేరేమి?" అన్నాను.

"రంగదాసు అన్నా డతను."

బసకు వచ్చేసినా, నా మన స్సావీధిలో వుండిపోయింది. ఆవిడ నిజంగా శాంతలాగే వుందే. మరి కూరల వర్తకు డెవరు? నాలో ఏవో బలీయమైన తలపులు క్ర్యారాతిక్ర్యారంగా విజృంభించేయి. శాంత ఆఖరికి ఒక యిసకరేణువులా గాలిలో ఎగిరిపోలేదు కదా? నా తలే తిరిగిపోతోందో, ప్రపంచమే తిరిగిపోతోందో? భూమ్యాకాశాలు ఏకమవుతాయా? ఏమో! ప్రళయప్రభంజనాలు వీచే యుగాంతపువేళ అయితే కానూవచ్చు!!!

మరునాటి ఉదయం నాకు పెద్ద ధైర్యంకలిగింది. ఆరు మూడైనా, మూ డారైనా నిజానిజాలు తేల్చివెయ్యా లనుకున్నాను. సరాసరి వెళ్ళి మేడమెట్లెక్కాను. కాళ్లు వణుకుతూన్నా తలుపు తట్టేను.

తలుపు తీసి ఒక వింత వ్యక్తి నిలబడ్డాడు. పెరిగినగడ్డం, చిరిగిన బనీను, సగం కట్టిన పంచ...వాళ్ళ నౌకరయి వుంటాడు ?

"ఎవరు కావాలి?" అన్నాడు.

"రంగదాసుగా రున్నారా?" అన్నాను.

"ఏం పని?" అన్నాడు.

"రంగదాసుగారితో పని వుంది" అన్నాను.

"నేనే రంగదాసుని— చెప్పండి" అన్నాడు. నిర్ఘాంతపోయాను.

"ఇలా వచ్చి కూర్చోండి— నిలబడ్డా రేం?" అంటూ లోపలికి తీసుకువెళ్ళేడు. నా సందేహనివృత్తి అయింది. గోడమీద శాంత ఫోటో ఎన్లార్జిమెంటు వుంది. ఫోటోలో శాంత అదివరటికన్న ఎన్నోరెట్లు అందంగా వుంది. వెర్రిగా చూస్తున్న నాతో మళ్లీ రంగదాసు మాటలు ప్రారంభించేడు.

"ఆమె నాభార్య. ఫోటోగ్రఫీ చూసేరా ఎంత బాగుందో" అన్నాడు.

"అలాగా! ఆమె నెక్కడో చూసినట్లు జ్ఞాపకం. ఆమె పేరు?" అన్నానెల్లాగో ధైర్యం తెచ్చుకుని.

"శాంతాదేవి. ఆమె మొదట ఒక డాక్టరుగారి భార్య. ఆయన గతించేడు. తర్వాత నాతో వుంది" అన్నాడు రంగదాసు. నా నవనాడులూ కృంగి పోయేయి. ఏవేవో జలపాతాలు నా నెత్తిమీద పడ్డట్టయింది. ఇక బాగుండదని—

"అయితే ఆమె మా బంధువే. కొంచెం పిలుస్తారా ?" అన్నాను.

"అలాగా" అంటూ రంగదాసు లోపలికి వెళ్ళేడు. నా రక్తంలో ఉద్రేకం ఎక్కువవుతూంది. రంగదాసు తిరిగివచ్చి "ఇంట్లో లేదు. ప్రక్క వాటా వాళ్లతో కలిసి బజారుకి వెళ్ళింది" అన్నాడు. ఇదీ మంచికే వచ్చినట్లనిపించింది. పాపాత్మురాలి ముఖం చూడకూడదని నిశ్చయించుకున్నాను. అందుకే రంగదాసు ఉండమంటున్నా మావూరు వెళ్ళిపోవాలంటూ లేచేను.

"అయితే అ స లు వ నే చెప్పేరుకాదే" మన్నాడు.

"నాకు కావలసిందంతా తెలిసింది. ఇంకా అనుమానాలుంటే రాస్తాను"లెండి అంటూ వచ్చేసేను.

ఎలా వచ్చి రైల్లో పడ్డానో నాకే తెలియదు. రైలు నడుస్తోంది. చక్రాలు దొర్లినట్లే గుండెలు దొర్లుతున్నాయి. చీకటిపడింది. చలిగాలి ముఖాన కొడుతూంటే మగతకన్ను పడుతోంది. రైలింజనుకూత నాగుండెల్లో ప్రతిధ్వనిస్తోంది. ఏవో నల్లని బీభూతాలు కృూరాతి కృూరంగా గాలిలో విహరిస్తున్నాయి. జగత్తంగా నల్లబడిపోయింది. ఆ నలుపు శాశ్వతంగా వుండిపోయేదే !! శాంతసంగతి మామయ్యతో ఎలా చెప్పడమా అని ఆలోచిస్తున్నాను. పోనీ, శాంత చనిపోయిందని చెబితే మంచిదేమో !

ఇంటిసమ్మంలో అడుగుపెట్టాను. బండివాడు సామాను దింపినా వాడికింకా డబ్బులియ్యలేదు. ఇంతలో పోస్టువాడు ఉత్తరం తెచ్చియిచ్చేడు. అదీ బెంగుళూరునుంచి వచ్చిందే.' అది విమానం మీద వచ్చింది— నేను రైల్లో వచ్చేను. అంతే! ఉత్తరం విప్పేను. శాంత రాసింది. చదవకుండా చింపెయ్యాలని బుద్ధిపుట్టింది. మళ్ళీ అంతలోనే మారిపోయింది. చదివేసి చింపుతే నేమనిపించింది. అదీ మంచికే వచ్చింది చివరకి. మా శాంత, అమాయకురాలు శాంత నిరపరాధి శాంత రాసింది,

"బావా !

నువ్వు ఈవేళ మాయింటికి రావడం నాకు తెలుసును. మీఅన్నగారు నీతో మాట్లాడుతున్నప్పుడు నేను లోపలే వున్నాను. నువ్వు మా వృత్తిని చులకన చేస్తూ మాట్లాడతావని నీముఖమే చెబుతూండడంవల్ల నేను నీకంటపడలేదు.

డాక్టరు రంగారావుగారు వైద్యజగత్తులో మరణించి రంగదాసుగా కూరలవర్తకంలో జననమందేరు. పేదతనం ప్రలోభాలకి స్వస్తి చెప్పించింది. ఇప్పుడు నెలకు అయిదారువందలు వస్తున్నాయి. ఇదే దీనిలో రహస్యం. ఈ పేడ పేపే కొనుక్కున్నాను. నిన్ను వింత పరిస్థితులలో పెట్టి మానసికాందోళనకి గురిచేసినందుకు క్షమించు. వెంటనే వచ్చి చూస్తావని తలుస్తాన్న మీ శాంత"—

అని వుంది. నా నడుంపట్టు తప్పింది. భూమ్యాకాశాలు గిరగిరా తిరిగిపోతున్నాయి. ముఖంనిండా చెమటలు పోసేయి. శరీరం వేడెక్కినట్లయింది. దేవతామూర్తి శాంతని అనుమానించినందుకు నాకు శిక్ష శాంతే ఈ విధంగా విధించింది. వాళ్ళ చిదంబర రహస్యమే ఆ సంసారానికి శ్రీరామరక్ష. వాళ్ళని విమర్శించినవాళ్ళకి తీరని శిక్ష. ఆరోజు మొదలు లోకంలో ఎవ్వరినీ అనుమానించననీ, ఏ దంపతుల సంసారవిషయాలలోనూ జోక్యం కలగచేసుకోననీ నా అంతరాత్మకి వాగ్దానం చేసి చెంపలు వాయించుకున్నాను.

# రామచంద్రాగమి

(క్రీ. ౧౫౫౦-౧౬౭౫ ప్రాంతము)

●

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు

గీర్వాణపారస్వతసాగరమున విస్మృతి సికతా సంఛన్నము లైన, విలుప్తప్రాయములైన కవిరత్నముల సంఖ్య పరస్సహస్ర మనుట స్వభావోక్తి. వాఙ్మయ గవేషణప్రవీణుల కఠోర కృషిఫలముగా విలుప్తకల్పములగు కృతిరత్నము లప్పుడప్పు డక్కడక్కడ లభించి సహృదయ ముదావహము లగు చుండును. ఉత్పన్న కల్పము లగు నట్టి కవిరత్నములలో రామచంద్రాగమి హరి నారాయణమిశ్రుల గూర్చి యిట ప్రసంగింపబడును.

రాధాకృష్ణుల ప్రణయవృత్తాంతమును చిత్రించు రాధావినోద *మను కావ్యమును స్వకీయవ్యాఖ్యా విలసితముగ రచించిన నైష్ఠికకవి రామచంద్రాగమి. ఈయన జనకుడు విఖ్యాతవిద్వద్వతంసుడగు జనార్దన భట్టు ; పితామహుడు జగద్గతకీర్తి నందిన పురుషోత్తమాగమి. ఈ యంశము లీతని కృత్యాది పద్యములను బట్టి తెలియుచున్నవి :

i శ్లో. 'రామచన్ద్రకవినా కవినాదః,
పూరుషోత్తమసుతేన సుతేన,
రాధికాహృదయశోకద మాసీత్
రాధికాహృదయశోకద మాసీత్.'—౧౯

(వ్యాఖ్య :—రాధికా హృదయశోకదమ్—రాధికాహృదయే యస్య స రాధికాహృదయః = హరిః, తస్య శోకం హన్తి తత్ తద్భక్తికర మిత్యర్థః)

## వ్యాఖ్యారంభ శ్లోకములు :

ii శ్లో. 'ఆసీ దాగమపారగో రవికర
ప్రౌఢప్రకాశో బుధః,
శ్రీమాన్ శ్రీపురుషోత్తమః
సురగురుప్రఖ్యః సతాం సత్తమః,
శ్రోత్రాస్య భూమలయే, రసాతలతలే
యత్కీర్తినారీ శ్రమం,
స్వర్గఙ్గాజలగాహనా దపనయ
త్యేషా సుధాస్పర్ధినీ.' ౨

iii శ్లో. 'తత్సూను ర్విబుధో జనార్దన
ఇతి ఖ్యాత స్త్రిలోకీతలే,
యద్వాక్యామృతసిక్త మత్రిని
చయః సాక్షాత్పురః స్ఫూర్తిదః.
తత్సూనుప్రవరేణ శఙ్కరపురీ
శ్రీరామచన్ద్రేణ సత్-
కావ్యస్యాస్య వినిర్గతస్య
సుధియా భావప్రకాశః కృతః' ౩

ఈ క్రింది వ్యాఖ్యావతారికాపద్యమును బట్టి రామచంద్రకవి బాల్యమునందే యీ కృతిని రచించి నట్లు తెలియుచున్నది :

వసన్తతిలక—

'భో భోః, కుశాగ్రమతయః పరకాయదక్షాః,
బాలోఽహ మఞ్జలికృతం కరవై భవత్సు,
యల్లోలు పేన గదితం వచనే మయేదం,
చిత్తే నిధాయ కలయన్తు కృపాసముద్రాః ౪

## సజ్జన ప్రార్థన

శ్లో. 'సజ్జనస్తోష మాయాతి యదిచేత్ కిం ఖలేన నః,
దివాకరహితానాం హి శశినా కిం సరోరుహామ్. ౪

## ఇష్టదేవతా ప్రార్థన :

శ్లో. 'బ్రహ్మాదిభిః సురవరైః పరిచీయమానం,
సంగీయమాన మనిశం శ్రుతిభి ర్మురారిమ్,
గోపాంగనానయనవిభ్రమలాస్యమానం,
సచ్చిత్ స్వరూప మనఘం హృది భావయామి'.౧

శ్లో. 'కుశేశయదళాకారశయకాయిని మాన్తికే,
ముహుర్ముహు రుదాసీనా మాశ్రయే...శ్రియమ్.'

* Printed in Kavyakatapa, Vol. IV, p 124 (1864. Bombay) and published by Haridas Hirachand.

శ్లో. 'రాధావినోదకావ్యస్య ప్రకాశః పరితన్యతే,
సుధియా రామచన్ద్రేణ భాష్యరూపేణ సరోరుహమ్.'

## కావ్యోపసంహారము :

'ఇతి రామచన్ద్రాగ్నికవి విరచితం
రాధావినోదకావ్యం సంపూర్ణమ్.'

## వ్యాఖ్యోప సంహారము :

'ఇతి రామచంద్రకృత-రాధావినోదకావ్యస్య స్వవిరచితమేవ భావప్రకాశాఖ్యటిప్పణం సంపూర్ణమ్.-౩౭౫ గ్రంథ సంఖ్యా'.

కావ్యాద్యశ్లోకము నుల్లేఖించి ప్రసంగాంతరమునకు మఱలుదము—

'మాలీనో ఘనమాలీ మాలీనో బలమాలీ,
మాలీనో వనమాలీ మాలీనో ఒకటు మాలీ.'

## నామసామ్యము గల యితరకవులు :

(అ) అయోధ్య రామచంద్రభట్టు—ఈతడు శాలంభట్టపౌత్త్రుడు, లక్ష్మణభట్టుపుత్త్రుడు, విఖ్యాత మతాచార్యులగు వల్లభాచార్యులకనుజుడు. క్రీ. ౧౪౯౪ ప్రాంతముల నవతరించిన యీ రామచంద్రభట్టు రచించిన కృతులు—కృష్ణకౌతూహలము, గోపాలలీలాకావ్యము, రసికరంజనము (వ్యాఖ్యతో), రాధాచరితము, రోమావళీశతకము.

(ఆ) రామచంద్రాధ్వరి—రామచంద్రచంపూ రచయిత. ఈతడు విశ్వవిఖ్యాతినందిన రత్నఖేట శ్రీనివాసాధ్వరికి ప్రపౌత్త్రుడు, శేషాధ్వరికి పౌత్త్రుడు, పతంజలిమఖికి బుత్త్రుడు,

ఇంకను తన్నామముగల సంస్కృత రచయితలెందరో కలరు. రామచంద్రాగ్నికవి సమకాలిక వాఙ్మయ ప్రపంచమున విఖ్యాతినందినవాడే యని నాటి సుభాషితశ్లోకములు మా కుద్బోధించుచున్నవి. విశేషవిఖ్యాతినందిన కవియే సంధాన గ్రంథములలోని కెక్కును. కాని, సామాన్యకవుల కట్టి విశిష్టగౌరవము లభింపదు.

## ముక్తకములు :

వేణీదత్త సంకలితమగు పద్యవేణిలో రామచంద్రాగ్నికృతములగు పద్యములు తొమ్మిది యుల్లేఖింపబడినవి. ఇందొకటి హరిభాస్కరుని పద్యామృత తరంగిణియందును, నాలుగు సుభాషితసారసముచ్చయమునందును అగుపడుచున్నవి.

ఈ క్రింది పద్యమున మానసింహుడు చైత్రయాత్రకు సన్నద్ధుడుకాగా కాంచీ, కేరళీ, కర్ణాట్యాది నారీమణులు సంభ్రమము నొందుచున్నట్లు వర్ణింపబడెను. ఈ మానసింహుడే అక్బరుచక్రవర్తికి (క్రీ. శ. ౧౫౪౨—౧౬౦౫) కుడిభుజమైన మానసింగు. జయపురాధీశ్వరుడగు రాజా భగవాన్‌దాసునకు దత్తపుత్త్రుడు. భగవాన్‌దాసు అక్బరుచక్రవర్తికి సామంతుడు, సేనాధిపతి, విశ్వాసపాత్రుడుగా నుండెను. మానసింగు 'మన్‌సబ్‌దారు', బెంగాల్ (బంగాళా) రాష్ట్రమునకు 'గవర్నర్' గా నుండెను. అక్బరువలె నీతడును విద్వత్కవిపోషకుడు, కళావ్యసని, సహృదయశేఖరుడు. అక్బరు సామ్రాజ్యమున మహోద్యోగిగా నుండిన 'అబ్దుల్‌రహీం' మహాకవియై, బహుభాషాకోవిదుడై, కవిపోషకుడై ఖ్యాతి నందెను. గంగాప్రసాదను హిందీకవి రచించిన యొక్క పద్యరత్నమునకీ రసికశేఖరు డమందానందము నంది ముప్పదియాఱులక్షల రూప్యముల పారితోషికము నొసగెనట. రసికతలో దత్తుల్యుడగు మానసింగొకానొక కవి రచించిన పద్యరత్నమునకు లక్షరూప్యములు బహుమానముగా నొసగెనట! మానసింగు క్రీ. ౧౬౧౪ లో నిర్యాణము నందినట్లు చరిత్రలవలన దెలియుచున్నది. కావున నీతని కాశ్రితుడగు రామచంద్రాగ్నికవి క్రీ. ౧౬ వ శతాబ్దము నుత్తరార్ధమునకును, ౧౭ వ శతాబ్దమున మొదటి పాదమునకు జెందియుండునని నిర్ణయింపదగును.

## ౧. మహారాజ చైత్రయాత్రా వర్ణనము :

(స్రగ్ధర) —
'కాఞ్చీ కాఞ్చీం న ధత్తే
కలయతి న దృశా కేరలీ కేలితల్పం,
సిన్దూరం దూరఏవ
క్షితిపతి కరతలన్యస్త మాధ్వీ పురన్ధ్రీ,
సౌరాష్ట్రీ మార్ష్టి భూయః
పపది నయనయో రక్తయో రక్తిమానం
కర్ణాటీ కర్ణి కాయాం
మలినయతి మనో మానసింహప్రయాణే'.

[పద్యవేణి (కలకత్తా ౧౯౪౪). ౧౧౩ వ. రామచంద్రాగ్నికః

పద్యామృత తరంగిణి, ౯౩ వ. (అనామకముగా)

రసికజీవనము, (కలకత్తా ౧౯౪౪). ౬౯ వ. (అనామకముగా;)]

సూక్తిసుందరము (కలకత్తా ౧౯౪౩) ౧౪౬ ప. (అనామక.)]

౨. దుష్టమదగజ వర్ణనము :

(స్రగ్ధర)—
'ఆలాన ముద్ధూయ బద్ధాం
నిజమపి సహసా కూలమున్మథ్య సద్యో
నిర్యాతత్రస్త వాజి-
వ్రజకృతనినదాకర్ణనక్రుద్ధచేతాః,
సంరమ్భారమ్భభగ్న
ద్రుమవిటపశతైః ప్రోథయ న్నాపణస్థా-
నాయాతి వ్యాళనాగ-
స్త్వరిత మిహ జనాః సావధానా భవన్తు.'
—(ప. వే. ౧౨౧ ప.—'రామచన్ద్రాగమినః')

౩. నాయికా విప్రలంభము :

(ప్రాకృతము)
'అయి పరదేసి సినేహో
పఢమం మహుఅరో తదో కహరో,
తా పరవసణి అ-హి అఓ
జీవఇ కన్తాజణో కేణ.'
—(ప. వే. ౨౯౫. 'రామచన్ద్రాగమినః.)

౪. శరద్విరహిణి :

(ప్రాకృతము)
'కుసుమాఉహా కుసుమాఇ
పఞ్చసరాఓం పుణోణగ్గో,
తా భణ భవిఅ మణోజ్జో
విద్ధపి హిఅఅఇం కుణంకేణ'
—(ప. వే. ౬౪౬. 'రామచన్ద్రాగమినః.')

పై ౩, ౪ సంఖ్యలుగల ప్రాకృతగాథలను బట్టి మనకవి ప్రాకృత కవితాకుశలుఁడనియు విశద మగు చున్నది.

౫. సూర్యోదయకాలమున మృగపక్ష్యాదులు :

(మందాక్రాంత) 'బర్హైర్వ్యాతం రచయతి శిఖీ
వల్లభాయాః శరీరే,
క్రోడే రథ్యోఙ్గ ర్విశతి హరిణీ
శృఙ్గకణ్డూయితాఙ్గీ,
కోకీ కోకం శ్రయతి నళినీ-
పత్రమధ్యాన్తరస్థం,
హంస శ్చఞ్చ్వా ధరయతి దల-
చ్ఛత్ర మఙ్గే ప్రియాయాః.'
—(ప. వే. ౫౧౯. 'రామచన్ద్రాగమినః.')

౬. పుష్పాపచయము :

'దూరా దాపతితా స్ఫురత్సరసిజ
భ్రాన్త్యా ద్విరేఫావళీ,
కాన్తానాం వదనేషు సీధుభి
రక్షవ్యక్త స్మితోల్లాసిషు,
అక్షిప్తాపి తతః కరై ర్నవదళ
ప్రఖ్యై ర్గళతావిభ్రమాద్
వక్షోజద్వయ మచ్ఛగుచ్ఛ
రుచిరం ముగ్ధా ముహు ర్ధావతి'
– (ప. వే. 'రామ చన్ద్రాగమినః ;' సు. సా. ప. ౭౯.)

౭. హిన్దోల క్రీడ :

'కేశై రున్నమితామ్బుదం, స్మితకరైః
జ్యోత్స్నాన్వితం, వీక్షితై-
ర్భృఙ్గాళీలలితం, పయోధర త
టా ఘాతోచ్ఛల న్మౌక్తికైః,
తారారాజివిరాజితం ముఖరుచా
చన్ద్రోపదాతం నభ-
స్తన్వత్యా నమకోఽప్యయం
విజయతే దోలారసః సుభ్రువః.'
—(ప. వే. ౫౩౫. 'రామచన్ద్రాగమినః;' సు. సా. ప. ౧౦౯.)

౮. సూర్యాస్తమయము.

(వసన్తతిలక.)—
'ఆగత్య సత్వరమసౌ రవిరమ్బరాన్త-
ముల్లాస్య పాదపతనైః స్ఫుటసాన్ద్రరాగః,
పశ్య ప్రసాదయతి రాగవతీం ప్రతీచీ-
దిక్కామినీం ప్రకుపితా మివ మన్యమానః'
—(ప. వే. ౫౫౦. 'రామచన్ద్రాగమినః'; సు. సా. ప. ౧౨౪.)

## ౯. గ్రీష్మము :

'వాసన్తి కుసుమాన్తరాణిమధుపాః,
శాఖాః ఖగాః శాఖినాం,
సేవన్తే సరితాం తటాని హరిణా -
శ్ఛాయావివిక్తాని చ,
హంసా భుక్తబిసాః శ్రమాలసవధూ-
మాహూయ నిద్రాతురాః,
ఫుల్లామ్భోజ పలాశే మణ్డపతలే
నిద్రాం భజన్తేతరామ్.'

—(ప. వే. ౬౧౭. 'రామచన్ద్రాగమినః'; సు.సా. స. ౩౨౬,)

రాధావినోదకావ్యాంతమున నీ క్రిందిశ్లోకము (రామచంద్ర కవికృతమనియే తోచును) కానవచ్చుచున్నది:

(పంచచామర)—
'జగద్విలక్షణే క్షణే, క్షణే క్షణే మదీయకం
కదమ్బకోరకద్వయం, న గోపి గోపినం కురు,
ఇదం నిగద్య రాధికాం, పయోధరామ్బరం హరన్
కళిన్దనన్దినీతటే, ననన్ద నన్ద నన్దనః'.*

పూనానగరమున భండార్కర్ ప్రాచ్యగవేషణ నిలయమున రాధావినోద కావ్యమునకు నారాయణ పండితుని వ్యాఖ్య యొకటియు, కర్తృనామరహితములగు వ్యాఖ్యలు మూడును తాళపత్రగ్రంథములలో (ఈ మూడు నేకకర్తృకములే కావచ్చును) లభించుచున్నవి. ఇందు నారాయణసూరి వ్యాఖ్యాద్యంతపద్యముల నుదాహరింతును—

(పుష్పితాగ్ర)—
'పితృవచన మవశ్యమేవ పాల్యం,
జగతి జనని శాసితుం వనాన్తం,
గతమితి కరుణారసార్ద్రచిత్తం
రఘుపతి మేక ముపాస్మహే సదారమ్.' ౧

"రఙ్గనాథాఙ్గజనుషా
నారాయణమనీషిణా,
రాధావినోదకావ్యస్య
వ్యాఖ్యా విఖ్యాపయిష్యతే. ౨

### ఉ ప సం హా ర ము :

'శుకదేవసమాఖ్యస్య పణ్డితశ్రీ శిరోమణేః,
తనయస్య నిదేశేన భట్టనారాయణో బుధః, ౩
'రాధా వినోదకావ్యస్య
వ్యాఖ్యానం స్వయమవ్యధాత్,
పరోపకారరసికాః
శోధయన్తు తదాదరాత్.'†

## ౨. హరినారాయణ మిశ్రుడు :

(క్రీ. ౧౭ వ శతాబ్దము.)

మహారసికశేఖరుడగు మొగల్ చక్రవర్తి షాజహాన్ (పాలన-క్రీ. ౧౬౨౮-౫౮) జగన్నాథ పండితరాయలు, మొదలగు సంస్కృతవిద్య త్కృవుల కెందఱకో పట్టుగొమ్మ. తదాస్థాన కవిపండిత మండలిలోనివాడే హరినారాయణ మిశ్రుడు. ఈతని జన్మాదిక వృత్తాంతములు గాని, తత్కృతులుగాని లభించుటలేదు. ఈ కవి రచించిన పద్యములు రెండు మాత్రము పద్యవేణిలో నుపలబ్ధము లగుచున్నవి.

### ౧. షాజహాన్ పరాక్రమ వర్ణనము :

శా. 'భూభృన్మౌళితటీషు వర్షతి మహా-
ధారాధరేఽస్మిన్నసౌ,
జాతా భూప, సరస్వతీ విజయినీ
కల్లోలినీ పావనీ,
శ్రీమచ్ఛాహిజహాన్ బ్రవీమి తదిదం
మాహాత్మ్య మస్యాః కథం,
యస్యాం మజ్జతి పఙ్క్తీయతి శిర-
స్తన్మార్గణో ఽలీయతి'.

—(ప. వే. ౧౪౧. 'హరినారాయణ మిశ్రాణామ్'; సూక్తి సుందరము, ౧౩౮. 'హరినారాయణ మిశ్రస్య'.)

### ౨. గంగానదీ వర్ణనము :

(రథోద్ధత.)—
'నిర్గుణాపి సగుణా యత స్తరి-
స్తద్ భ్రమాత్ త్రిపథగే సమాగతమ్,
త్వం కరోషి సగుణం హి నిర్గుణం
నోచితం తదిహ తే జగద్ధితే.'

—(ప. వే. ౪౭౨. 'హరినారాయణ మిశ్రాణామ్')

---

*—(P. 308 of vol. XIII-part 2, of the 'Descriptive Catalogue of the Govt. Collections of manuscripts' at the B. O. R. Institute—poona.—1942)

†—(Pages 311—'12 of D.C' Mss. in Govt. Mss. Library, Poona.—1944)

పెద్ద కథ:



# రాగమయి

శ్రీ కాశీపట్నపు రామారావు

కాంతురుముఖం చూడగానే పలకరించటం కూడా మఱచిపోయి కళ్లప్పగించి ఊరుకున్నారు గిరిజమ్మ. జానకికూడా గుమ్మందాటి లోనికి వచ్చి అలానే గోడ నానుకొని నిలుచుండిపోయింది.

జట్కావాలా సామాను లోనికి తేవటంతో గిరిజమ్మ మేల్కొని 'ఆ పెట్టె యిలా ఇక్కడ పెట్టవోయ్' అని స్థలం నిర్దేశించి తర్వాత కూతురు వంక తిరిగి "నీవంట్లో కులాసాగా ఉందా తల్లీ" అన్నారు మెల్లిగా.

జానికి తల ఊపింది. కాని తల్లి శంకాకుల హృదయానికిదేమీ ఊరట కలిగించలేకపోయింది. ఆమె కుమార్తె పరిశుష్క శరీరాన్ని ఆపాదమస్తకం మరి ఒకసారి పరిశీలించి—

"మరి యిలా చిక్కిపోయావేం?" అన్నారు మెల్లిగా

జానికి జవాబివ్వలేదు. గిరిజమ్మగారింకొక ప్రశ్న వేసేలోగా వీథిలోనుండి శేఖరం, నూతివద్ద నుండి ఉమా ఒకేసారి వచ్చారు. ఉమ—

"ఏమువెన్నోయ్ మరదలా—" అంటూనే ఆగిపోయి జానకిని ఆపాదమస్తకం దీక్షగా చూచి— "అయితే పెళ్లాళ్ళ కాపరానికే యిలా ఒరుగైపోతే ముందుముందు నూరేళ్లలో గడుపుతావమ్మా" అంది నవ్వుతో.

నవ్వైతే సహజంగా ముగించింది కాని లోన గుండెలు కొట్టుకోసాగాయి.

శేఖరం కోటు విప్పుతూ అన్నాడు—

"చూశావా పెళ్లాళ్లయేసరికి జానకి ఎంత మారిపోయిందో! ఎవరో కొత్తవారింటికి వచ్చినట్లు ద్వారందగ్గరే నిలుచుండిపోయింది!!"

జానకి సిగ్గుపడుతూ లోనికి నడిచింది.

జానకివెంటే తల్లీ, వదినా కూడా లోనికి వెళ్తున్నారు. శేఖరం లాల్చీ విప్పుతూ అన్నాడు—

"ఏమువొయ్యోయ్! ఊరునుండి వచ్చినది మీ మరదలొక్కర్తే కాదు. నీ ఫ్రెండొకడున్నాడు. నువ్వు కాస్త వీడి విషయం చూడు. తర్వాత రాత్రి పడుకొనే వరకూ మీ మరదలూ నువ్వూ ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ విషయాలన్నీ ఓపిగ్గా చర్చించవచ్చు."

శేఖరం భార్యనుండి కనీసం ఒక చిరునవ్వైనా లభిస్తుందని ఆశించాడు. కాని ఉమముఖాన అట్టి చిహ్నాలేవీ కనుపించలేదు. ఆమె తొందరగా తువ్వాళ్లు వెదికి తెచ్చియిస్తూ "వేగం రండి మరి" అంటూ తను నూతివంక నడిచింది. శేఖరంమనస్సు కాస్త చివుక్కుమంది.

౨

జానకిని చూసి ఇంట్లో వారే కాక యిరుగుపొరుగులవారు కూడా ఆశ్చర్యపోయారు. ఆమెరాకను తెలుసుకొని సఖులు, సహపాఠినులూ చూడవచ్చారు. వారుకూడా 'అదేమోయ్...' అనేవారే.

ఈ వేరినతర్వాత కన్యలు క్రమంగా లావె క్కటం, పెండ్లయి కాపరానికి వెళ్ళాక కొత్త పల చబడటం సహజమే. కాని అలా పలచబడిన శరీరా లకు ఒక క్రొత్త చురుకుదనం, కండ్లలోకి ఒక క్రొత్త కాంతీ ప్రవేశిస్తాయ్.

జానకిలో అవి లోపించటానికి తోడు ఎప్పుడూ యేదో ఆలోచిస్తూ దిగులుగా ఉంటుంది. ఆమెను రంజింపచేయటానికి ఉమ చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమే అయాయి. ఆమె ఎదో గ్లానితో బాధపడు తోందనే విషయం స్పష్టంగా గోచరిస్తూనే ఉండెను. దానికి కారణంమాత్రం ఎవ రెన్ని విధాల ప్రశ్నిం చినా ఆమెనుండి తెలుసుకోలేకపోయారు.

జానకికీ, చిన్నక్కకూ మధ్య చనువు అధికం. జానకిరాక పిదప వారంరోజులతర్వాత ఆమెకూడా వచ్చింది. కాని ఆమెకూడా జానికి హృదయమంది రాన్ని తెరువలేకపోయింది.

చివరి కొకనాడు గిరిజమ్మ విసిగిపోయి ఉత్తేజి తస్వరంతో అడిగారు—

"అయితే అత్తమామలు మంచివారయి, ఆడ బడుచులతో కలివిడిగానే తిరుగుతుండి మొగుడు తోనూ కీచులాటలు లేకపోతే—మరి నీ కేం మూడిం దని అలా ఉంటావు?"

జానకి వంచిన తల ఎత్తకుండా కొంతసేపు అలానే ఉండి తరువాత ఉన్వేత్తుగా లేచి పడకగది లోకి పోయి తలగడలోకి ముఖం దూర్చి వెక్కి వెక్కి ఏడవసాగింది. అక్కడే ఉన్న చిన్నక్కా, తల్లీ కొంతవరకూ అప్రతిభులై నిలిచిపోయి పిదప ఆమె వద్దకు పోయి ఓదార్చసాగారు. వారు ఓదార్చేకొద్దీ ఆమె దుఃఖం పెరుగుతూవచ్చింది. చివరి కేదో పనితో వంటయింటవున్న ఉమ వచ్చి విషయం తెలుసుకొని అత్తగారినీ ఆడపడుచునూ బయటకు తీసుకుపోయింది. కొద్దిసేపట్లోనే జానకి ఊరటపొందింది.

కాని ఆ రాత్రిమాత్రం ఆమెను ఉమకూడా ఏ ఉపాయంచేతా భోజనంవద్ద కూర్చోపెట్టలేక పోయింది.

దానితో ఆమెవిషయం మళ్లా ఎత్తటానికి ఎవ రికీ సాహసం చాలింది కాదు.

3

సంవత్సరాది వెళ్లిందనగా శేషగిరి విశాఖ పట్నంనుండి వచ్చాడు. ప్రయాణపు బడలికవల్ల మధ్యాహ్నం భోజనమవగానే పండుకున్నాడు. లేచేసరికి చాలా ఆలస్యమయింది. ఉమ రాత్రివంట చేస్తుండటంచేతనైతేనేం గిరిజమ్మగారు తీరికగా ఉండటంచేతనైతేనేం ఆమే కొడుక్కు ఫలహారం పెడుతున్నారు.

జానకి తల వంచుకొని నూతివద్దకు పోతోంది. సోనురిగా ఉన్న శేషగిరి ఆమెను చూచి అన్నాడు.

"జానకేం అటా ఉంది?"

తల్లి వెంటనే జవా బివ్వలేదు, క్షణకాలం పోయాక తమ ధోరణిలో అన్నారు,

"దాని బ్రతుకంతే!" అని క్షణ మాగి "—సంగ తేమిటే అంటే యేడుస్తుంది."

శేషగిరి కొంతసేపు ఊహించి చివరి కొక బజ్జీ కొరుకుతూ అన్నాడు "మీరు కోరిం దదే కదూ"

గిరిజమ్మగారి కిది అలుసులా తగిలింది. కానీ ఆమె తల్లి, పైగా ఆ కొడుకుసంగతి బాగా తెలుసు. అందుచేత ఆమె ఒక గుటక వేసి ఊరుకున్నారు.

శేషగిరికి ఎదుటి హృదయం ఏ స్థితిలో ఉందో చూచుకుని మాట్లాడ్డం ఏనాడూ తెలియదు. అతడు తన ధోరణిలో పోసాగాడు.

"డబ్బు-డబ్బు-డబ్బు? డబ్బు చూసి ఇచ్చారు చూడండి! ఇప్పుడు చూస్తున్నారా—మీ కుమార్తె ఎట్టి సౌఖ్యవారాశిలో ఈదులాడుతోందో?"

చూస్తుండగానే శేషగిరి ముఖం జేవురించింది. అంతేకాదు. చిత్రంగా గిరిజమ్మగారి కోపం స్థానంలో భయం ఆవహించసాగింది.

శేషగిరి మళ్ళా ఆరంభించాడు. పళ్లు బిగించి ఒక్కొక్క ముక్కే జారవిడువ సాగాడు.

"దాని నూరేళ్ళ బ్రతుకూ— బూదిపాలు చేశారు."

శేషగిరిధోరణి చివరి కెక్కడకు పోతుందో ఊహించి గిరిజమ్మగారు తత్తరపాటుతో ఎలాగో ధైర్యం చిక్కబట్టుకొని అన్నారు—

"పోనీ యిప్పు డూరుకుంటూ — మళ్లా రగడ పెట్టకు."

శేషగిరి వెంటనే జవా బిచ్చాడు.

"ఊరుకుంటూరు! ఊరుకోక ఊరెట్టు వుంటూరా!" అని కాస్తనే పాగి "—అలా ఊరుకో బట్టే చివరి కిలా అయింది" అంటూ పూర్తిచేశాడు.

చివరిమాట లనేటప్పటికి అతని ఉత్తేజిత స్వరం శాంతముఖంగా ఉంది. గిరిజమ్మ కాస్త శేలిగ్గా ఊపిరి తీసుకోగలిగారు.

శేషగిరి రెండుమూడు బజ్జీలు ఒగబడిచి కాఫీ త్రాగటం ఆరంభించాడు. తల్లి 'ఆ రెండూ తినేయ కూడదూ?' అంటుండగానే కాళీకప్పు క్రింద పెడుతూ అన్నాడు.

"ఏ యింట్లో ఆడుదాని పెత్తనం తలెత్తుతుందో ఆయింట సుఖం సంతోషం అనేవి మరి ఉండవు—" అంటూ లేచి "—స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః అని పెద్దలు చెప్పింది వట్టిదేనా?" అని ప్రక్కకు తిరిగాడు,

ఎదురుగా ఉమ రెండుచేతులమధ్యా అన్నపు గిన్నెతో నిల్చుని ఉంది.

క్షణకాలం ఆ ముగ్గురి ముఖాలూ రంగులు మార్చుకున్నాయి. చివరకు పెద్దావిడ గిరిజమ్మ ముందుగా తమ ముఖాని కెక్కిన కాళిమను చెరుపు కుంటూ అన్నారు.

"ఊహూ పోమా!... వెధవ పోడికబుర్లూ నువ్వూనూ... అవతల వడిన చేతిలో బరువుతో కూడా నిం మండిపోయింది."

కాని ఉమ యేమీ అమాయకురాలు కాదని వాళ్ళిద్దరకూ తెలుసు. అంతేకాదు. తేలిగ్గా బయట పడే తొందరపాటు మనిషికూడా కాదు.

౪

ఆఫీసులకు పోయేవా రుండటంచేత పంతులు గారి యింట వంటలు వేగమే అవుతాయి. కాని ఆ వేళ సంవత్సరాది వంటలు. అందుచేత పూర్తయే సరికి పన్నెండూ వేశారు.

పెద్దలుకూడా విస్తరిముఖం ఎంతెట చూస్తాము అన్నట్టుంపటంచేత పిల్లలూ పెద్దలూ, పిలిచిందే తడ వుగా పీటలమీద కూర్చున్నారు.

గృహమేధి ఆదినారాయణమూర్తిగారు పంక్తి మొదట పట్టుపంచలో నుదుటను గంధాక్షతలతో, పంక్తిమొదట ఇద్దరికి సరిపోయే పెద్ద పీటమీదకూర్చు న్నారు.

ఆయనపక్కగా అంతకు ముందురోజు నే వచ్చిన రెండవ అల్లుడూ, పెద్దకొడుకు శేఖరం, చిన్నవాడు శేషగిరీ, వరుసగా కూర్చున్నారు. ఆసరసను శేఖరం కొడుకు, కూతురూ, తర్వాత రెండవ అమ్మాయిబిడ్డ లిద్దరూ ఉన్నారు. వారి ప్రక్కగా తల్లి కూర్చుంది. చివరను జానకి.

అత్తాకోడళ్ళిద్దరూ తొందరగా వడ్డిస్తున్నారు.

వడ్డన జరుగుతున్నంతసేపూ పెద్దవాళ్ళంతా మౌనంగా కూర్చున్నారు. పిల్లలుమాత్రం గొడవ చేస్తున్నారు. ఉమ బిడ్డ లిద్దరూ ఒక పక్షంగానూ, రెండవ అమ్మాయి బిడ్డ లిద్దరూ ప్రతిపక్షంగానూ 'మా చిన్నాన్న' అంటే 'మా చినమామయ్య' అనీ మా చిన్న త్తంటె మా పిన్ని అనీ, నాకు కూర ఎక్కు వంటే నాకు పప్పు ఎక్కువ, నాది పెద్దకంచమంటే నాది వెండికంచమనీ 'గిల్లి కజ్జాలు' పెట్టుకు పోట్లా డుకుంటున్నారు.

చివరకు తొలివడ్డన పూర్తయింది. పంతులు గారు అభిఘారం కాగానే మహానైవేద్యం కావిచ్చి పరిషేచనా ప్రక్కనున్న అల్లుడితో సాభిప్రాయంగా 'ఊ ఊ' అని, మనుమల్ని హెచ్చరించారు.

"ఇంక వ్రేళ్లన్నీ కంచాలమీద చూపాలి. ఏదీ ఏదీ, ఎవరు ఎక్కువగా తొందరగా గబాగబా తింటారో చూడాలి!"

ఈ హెచ్చరికతో పిల్లలు చప్పున కంచాలలో చేతులు పెట్టారు. పదార్థాలు వేడిగా ఉన్నాయేమో చేతులు చురుకాయి. "అమ్మో! ఊఫ్" అంటూ చేతులు విదిలించి వేళ్లు నోట్లో పెట్టుకున్నారు.

తొందరపడిన ఉమకూతురుచేయి కాలలేదు. ఆమె తక్కినవాళ్లవంక కుతుకంగా చూస్తూ మౌన హాసం చేసింది.

మనుమలరవళి వరుసా శ్రీకంఠ కని పెడుతున్న

తాతగారు నవ్వకుండా తమాషా చూపినట్టు నటిస్తూ అడిగారు:

"ఏమమ్మా సరస్వతీ నువ్వు తినవేం"

సరస్వతి తాతముఖంలోకి వంగి చూస్తూ

అంది "ఎక్కువ తింటే ఏమిస్తారు?"

నలువురూ పకాలున నవ్వారు. అయితే ఆబాలముఖం చిన్న పువ్వు కోవటానికి బదులు తనూ నవ్వింది. కాని ఆ నవ్వులో కాంతి లేదు.

నవ్వకుండా ఊరుకున్న రెండవ అమ్మాయి అంది—

"దీనికి ప్రతిదానికీ లంచం గావాలట్రా... లంచంగొండి భడవ!"

ఈ విమర్శ కెవ్వరూ జవాబివ్వలేదు. కాని ఇది ఎక్కడో ఒక హృదయాన్ని గాయపరుస్తుందని జానకి భయపడింది:

ఎక్కువ తిన్నవాళ్లకి ఆ రాత్రి తమ ప్రక్కలో నిద్రించేందుకు స్థానం దొరుకుతుందని తాతగారు ప్రకటించగా మనుములంతా పోటీ ఆరంభించారు

కొంతసేపటివరకూ 'కావాలీ' 'చాలు' 'మరి కొంచం' మొదలైన ఆత్యావశ్యకపదాలు తప్పిస్తే ఎవరూ ఏమీ మాటాడలేదు. కొస్త తాపీచిక్కాక పంతులుగారన్నారు—

"రాజశేఖరంకూడా వచ్చేస్తే అక్కడకు లోటు లేకపోను"

ప్రక్కనున్న అల్లుడు పరధ్యానపు మనిషి. సరిగా వినిపించుకోక మామగారి ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

"...మీ తోడల్లుడి మాట! అతడుకూడా వచ్చేస్తే తీరిపోను!"

ఈసారి వినిపించి ఉంటుంది. అందుచేత తల ఊపుతూ "అవునవును. అంతే." అని తిరువాత యింకేమీ తోచకపోయేసరికి విస్తరాకువంక తిరిగాడు.

మామగారు కొంతసేపు శూన్యదృక్కులతో ఎక్కడెక్కడో చూస్తూ అలానే వెనుకటి వాక్యం అందుకుంటూ అన్నారు—

"...అక్కడకు మా జానకమ్మ ముఖంకూడా కలకలలాడుతుండును" అంటూనే ఆయన జానికి ముఖంలోకి ఒకసారిచూసి పిదప ఆల్చోచనలో పడ్డారు.

అల్లుడు 'మామగారు తనను మధ్యపెట్టి చూస్తున్నారా లేక నిజంగానే ఆయనకు తెలియదా' అని ఆలోచిస్తున్నాడు. తక్కినవాళ్లుకూడా ఏమీ మాటాడలేదు. నిశ్శబ్దంగా భోజనా లవుతున్నాయి.

శేషగిరిప్రక్కనున్న మనుమ డేదో అడిగాడు. గిరిజమ్మ వడ్డిస్తున్నారు. శేషగిరేదో గోణిగాడు. తల్లి తీక్షణంగా చూసింది. కాని కొడుకు గమనించ లేదు. ఇదంతా చూస్తున్న పంతులుగారు అడిగారు.

"ఏమిటే?"

లోపలినుండి వస్తున్న కోడల్ని గమనిస్తూ గిరిజమ్మ మాటాడకుండా లోనికి వెళ్ళిపోయారు. పంతులుగా రలానే మౌనంగా ఉండి ఉండి అడిగారు.

"నువ్వుకూడా చిన్నతనంలో యిలానే ఉండే వాడివోయ్ బుచ్చిబాబూ?"

అల్లుడు తలెత్తిచూస్తూ అన్నాడు.

"అంటే?"

మామగారు నవ్వుతూ అన్నారు —

"మూర్ఖత్వం! తాబట్టిన కుంటేటికి మూడే కాళ్ళనడం!!"

బుచ్చిబాబు జవా బివ్వలేదు. స్ఫురించక కాదు— లేకా కాదు— రాజుతున్న మంట కా జవాబు ఆజ్యధార అవుతుందని. కాని పంతులుగా రూరుకో లేదు.

"ఆ వయస్సులాంటి దనుకొంటాను లేక కొంత మంది తత్వమో!?..." కొంతసేపాగి,

"— ఈపుస్తకం ఆ పుస్తకం చదవడం— అంతటితో పెద్దలోకానుభవం సిద్ధించినట్టు మాట్లాడటం!!"

తమ స్వరం చిక్కబడుతుండటం గుర్తించా రేమో పంతులుగారు ఆగిపోయారు.

తర్వాత కొస్త శాంతించాక మళ్లా ఆరంభించారు. ఈసారి మెమ్మదిగా—

"భర్తృహరి ; కాబోలు అంటాడు— 'తెలివి కొంచంకూడా లేనప్పుడు అంతా తెలుసునని గర్వంగా

ఏనుగులా తిరిగానట. తర్వాత మహానుభావుల వేరిచ యిస్తై వాళ్లు కొత్త కనువిప్పు కలిగించగానే ఆ గర్వమంతా ముక్కలైపడగా నాకు తెలివిందేమీ లేదే అని గుండె కొట్టుకున్నాట్ట'... అలా ఉంటుంది వీళ్ల వ్యవహారం,

వీడే కాదు. ఆ వయస్సులో అంతా అలానే అగపడతారు. పోనీ వయస్సు మాహాత్మ్యమే అనుకుందామంటే అందరూ అలా అగపడరు. పెద్దవాడున్నాడు కదూ— వాడెప్పుడూ యిలాంటి మిడిమిడిజ్ఞానం ప్రకటించలేదు. అని నవ్వి "వీడికే—" అంటూ లేని విస్తట్లో వడ్డిస్తున్న భార్యవంక చూస్తూ పూర్తిచేశారు. కొత్త మేనమామపోలిక వచ్చింది."

కాని గిరిజమ్మగారీ ఆహ్వానాన్ని అందుకోలేదు.

ఆదినారాయణగారు సాధారణంగా ఎల్లప్పుడూ హాస్యరసవాతావరణంలోనే ఉంటారు. దానికి తక్కిన వారంతా యథాశక్తి తాళం వెయ్యడం పరిపాటి. కాని ఆవాళ అంతవరకూ వాతావరణం బహు కటువుగా ఉండేసరికి అందరూ నీటిఒడ్డున పడేసిన చేపల్లా ఉంటూవచ్చారు. చివరి కేలానో ఆయన గాలిని మార్చబూనారు. అయితే అట్టి సమయాల చేయూత నిచ్చే గిరిజమ్మగారానాడు ఎందుచేతో మౌనం వహించారు. ఇది గమనించి బుచ్చిబాబే అందుకున్నాడు.

"మీరు చుట్టూ తిరిగి అత్తగారిమీద పడతారేం?"

పంతులుగారు ఉచ్చస్వరంలో ఎదుటి మాట క్రిందపడకుండా అందుకున్నారు—

"మరెవరిమీద పడమన్నావ్!...

చచ్చిపోయిన మామగారిమీదా, అత్తగారిమీదాపడలేం కదా? మరదళ్లు పడ-నివ్వరుకదా? పోతే యిదీ దీని తమ్ముడే నాకు దక్కారు."

పంతులుగారిలా తమ ద్రావిడసహవాసవాసన ప్రకటించటం అప్పుడప్పుడు అలవాటు. కాని అట్టి సమయాల్లో ఎవరూ మాటాడరు. కొంతసేపు పోయాక పంతులుగారే అన్నారు:

"వీళ్ల తమ్ముడుకూడా చిన్నప్పుడు మహా నీలిగేవాడులే. తర్వాత పెళ్లవగానే ఆ ఆట కట్టేసింది." అంటూ చిన్న కొడుకుముఖంలోకి చూచి చిన్నపోయి ఉండటం గుర్తించి "—అలా వీడికీ ఒకతెను కట్టేస్తే సరిపోతుంది" అంటూ నవ్వారు. కాని శేషగిరినిగాని ఇంకొకరునిగాని ఈ కవిత్వంపు పులకరింపజేయలేదు.

మామగారికి సహాయపడేఉద్దేశంతో బుచ్చిబాబన్నాడు—

"మీరు ఊ అంటే ఈ వైశాఖమాసంలోనే అయిపోతుంది"

పంతులుగారు గట్టిగా నవ్వుతూ అన్నారు—

"నేను 'ఊం' అనడ మేమిటి మఖ్య! మునిలివాణ్ణి కూడానూ!! వాడు ఊ అనాలి"

"అతడి కిష్టమే. మీ ఆటంకం లేకపోతే..."

మాట పూర్తికాకుండానే పంతులుగారన్నారు

"అలా అని నీతో చెప్పే దేమిటి?"

"సంవత్సరంక్రిందట చెప్పాడు"

"నేను రెండుసంవత్సరాలక్రిందట అనుజ్ఞ ఇచ్చాను"

తక్కినవారెవ్వరూ నవ్వకపోయినా అల్లుడు మామలు మాత్రం తమ హాస్యానికి తామే వినోదిస్తున్నారు. అల్లుడన్నాడు.

"సరే—అయితే రేపే సంబంధం వెదుకుతాను." అంటూ బావవంక తిరిగి "అయితే చిన్నబావా! నీకు తెల్ల పిల్ల కావాలా? నల్ల పిల్ల కావాలా" అన్నాడు దీర్ఘాలు తీస్తూ.

శేషగిరి జవా బిస్తాడని ఒక్కరుకూడా అనుకోలేదు. కాని అతడు జవా బిచ్చాడు శాంతధీరస్వరంతో "నాకా? బాగా డబ్బున్న పిల్ల కావాలి" అని, క్రమంగా హెచ్చేస్వరంతో పూర్తిచేశాడు "తెల్లనిదైనా, నల్లనిదైనా, చదువుకోని నిరక్షరకుక్షైనా పల్లెటూరిపశువైనా— డబ్బుంటే చాలు. అదొక్కటే ముఖ్యం."

అందరూ స్తంభించిపోయారు, శేషగిరిమాత్రం తొందరగా చేయి కడుగసాగాడు.

వారిలో చైతన్యం కొలుకొనేసరికి వంటింటిలో టంగ్‌న పళ్లెం ఎత్తివేసిన చప్పుడవడం. వెనువెంటనే రెచ్చగొట్టబడిన పులి గుహను వీడి వచ్చినట్లు ఉమ బయటికి రావడం, చేయి కడుక్కున్న శేషగిరి నిష్క్రమించటం అతిత్వరగా ఒకే క్షణాన జరిగినట్లు

జరిగిపోయాయి. కాని ఉమ మరిదిని విడువలేదు తడబడే కాళ్లతో అతనివెంటనే నట్టింటిలోకి వెళ్లింది. కాని అప్పటికప్పుడే శేషగిరి వీధితలుపు చప్పుడు చేస్తూ మూసుకొని బయటకు వెళ్లాడు.

౫

కాని చివరికా అగ్నిపర్వతం బ్రద్దలవటం ఎలాగూ తప్పలేదు.

శేషగిరి చెయ్యిదాటిపోవడంతో ఆమెలోని ఉగ్రకోపం మరీ రెచ్చిపోయింది. అత్తమామలూ భర్తా ఆడబడుచులూ తనను గమనిస్తున్నా లక్ష్యం చెయ్యకుండా దురితగమనంతో వెనుకటింటిలోకి పోయి అక్కడ వాల్చిఉన్న పీటమీద చతికిలపడింది.

కోపం అణచుకోవాలనే విషయం ఆమెకు తెలుసు. అయినా ఏవో జ్ఞాపకాలు వచ్చి ఆమె కోపాన్ని ఉత్తేజపరుస్తూనే వచ్చాయి.

సరిగ్గా యిలాంటి సమయంలోనే రెండవ ఆడుపడుచు వచ్చి ద్వారం తెరిచింది.

"అయితే వదినా మీ అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్లూ, మామగారూ కలిసి మాకు పండుగ లేకుండా చేస్తారేమిటి?!...చెప్పరూ?!...ఏమిటి మీ ఉద్దేశం!" అని క్షణం ఆగి "ఊరికేనే ఎత్తిపొడుపుమాటలన్నీ అని నాన్నగారు వాడిని గాయపరిచారు. దానిమీద ఆయనగారు ఊరుకోకుండా మహా పెద్ద తెలివైన వాళ్లలా తెలిసీ తెలియని హాస్యాలాడి వాణ్ణి రెచ్చగొట్టారు. అసలే కోతి, అందులో కల్లు తాగింది. దానిమీద తేలుకుట్టింది. పైగా దానిచేత నిప్పుకూడా తొక్కించారు — ఏదో చిందులు తొక్కింది. ఇప్పుడు నువ్వుకూడా ఆ కోతితో సమంగా చిందులు వేసి ఇల్లు బీభత్సం చెయ్యదల్చుకుంటే చెప్పు?!"

ఇట్టి ప్రౌఢోపశమన వాక్యాలతో కొంతమంది కోపం తగ్గుతూ ఉంటుంది. కాని ఉమకోపం ప్రత్యేకించి ఆవేళ దాని ఉన్నతోన్నత పథాలంటింది.

కోపం తొణికిసలాడ మెఱిసే పెద్ద కండ్లలోనుండి రూక్షంగా చూస్తూ దీర్ఘోచ్ఛ్వాస నిశ్వాసాలతో మూసిఉన్న పెదవులు విప్పుతూ అంది.

"అయితే తప్పంతా మాదే అంటారు."

ఆ స్వరం, ఆ ముఖం వినగా కనగా ఎదుటి మనిషికి భయమే వేసింది. కాని తాను ఆడపడుచటంచేత వెనుకంజ వేయటం నామోషీ! అందుచేత అంది.

"కాదూ! వయసు మాటెల్లా ఉన్నా నీ కొడుకువంటివాడు మరిది. వాడి మాటలకు కోపగించుకోవటం తప్పు కాదూ?!"

శతాబ్దాల తరబడి మహోతపజ్వాలలు గర్భకుహరాలు భరిస్తుంటే మూగగా కనుపించే అగ్నిపర్వతాలు చివరికొకనాడు ప్రళయభీభత్సధ్వనులతో పగిలేటప్పుడు ఎవరి ఆజ్ఞలూ, గౌరవాలూ కూడా నిలువవు. సమీపంలో చిక్కుకున్నప్పుడు, సృష్టికర్తైనా, సృష్టిభర్తైనా ఆ ఉడుకుముద్దలు మీదపడగా బాధపడవలసిందే.

ఉమ వదన గహ్వరాలనుండి పొగలు, సెగలూ ఊముస్తూ విరుచుకపడింది.

"నా కొడుకా! అదే నా కొడుకైతే రెండు చెవులూ పట్టుక యీడ్చుకవెళ్ళి వారిముందర కుదేసి 'చెప్పవయ్యా ఇతడికేం లోపం వచ్చిందో' చెప్పనే దాన్ని. అంతేగాని ఎవరిలానూ వెనుక వేసుకవచ్చే దాన్ని కాదు. ఇలా అందరూ, వెనుక వేసుకరాబట్టే ఆయన అనవలసినమాటా అనరానిమాటా తెలుసుకోకుండా తాను దేనితో చెలగాటం ఆడుతున్నదీ కూడా ఎరుగక నోటికి వచ్చినట్లల్లా మాటాడుతున్నారు. దాని నూరేళ్ళ బ్రతుకూ బూడిపాలు చేశారట. ఎవరు చేశారూ! తమ చేస్తున్నారు. ఎవరి ముందే మాటనాలో తెలుసుకోకుండా తెలివి తక్కువగా మాట్లాడి అభమూ, శుభమూ ఎరుగనిపిల్ల మనసు పాడుచేసి ఆమె సంసారాన్ని అగ్నిగుండంగా మారుస్తున్నది అతను కాని నే కాదు.

క్షణకాలం ఆగి—"అడపెత్తనంట, స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః ట!! నా పినతల్లి కొడుకని చెప్పి నేనేం ఎవరికన్నా మోసం చెయ్యలేదే యీ పెళ్ళి— వాళ్ల ఆస్తినిగూర్చి కాని, వారి చదువునుగూర్చి గాని వాడి ప్రవర్తనగూర్చిగాని నే చెప్పినమాటలో ఒక్క అక్షరం తప్పని ఋజువుచేస్తే నా పుస్తెక ఇస్తాను. అటువంటప్పుడు......"

అప్పుడే వచ్చిన గిరిజమ్మగారు మాటమధ్యలో అన్నారు—

"వాడు నిన్నన లేదే ఆ మాటలూ—— నువ్వెందుకలా తడుముకుంటావ్?"

పెద్దతనం అండగా ఆడిన ఈ అబద్ధంతో ఉమ శరీరాన్ని పూర్తిగా మరిచిపోయింది. తారకస్థాయిలో అరవసాగింది.

"అనలేదూ! అనలేదూ! తల్లి అయినంతమాత్రాన మీకొక్కరికే అభిమానం ఉంటుందనుకోకండి. నిజంగా మీరే ఆ కుర్రవాణ్ణి నానా అబద్ధాలూ ఆడి చెరుపుతున్నారు. అతని పిచ్చిమాటలూ, తెలివితక్కువ వ్యవహారాలూ అన్నీ మామగారికి తెలిసి ఉంటే ఏనాడో అతణ్ణి చక్కపరచి ఉంచేవారు.

ఈ పెళ్లి అతనికి ఇష్టంలేక పెళ్ళిముందు దొంగ జబ్బు సృష్టించి పెళ్ళికొప్పుకోకుండా అతను వెళ్లిపోతే ఆ విషయం మీకు తెలిసీ మామగారికి చెప్పకుండా దాచిపెట్టి ఆయనకబద్ధాలు చెప్పారు.

ఆనాడే ఈ విషయం ఆయనకు తెలిస్తే కొడుక్కి ఇష్టంలేని పెళ్లిమాని వేసేవారో లేక అతనికి నచ్చచెప్పి ఒప్పించేవారో......"

ఆమె అకస్మాత్తుగా ఆగిపోయింది.

ఉమ కోపతాపాలకు లోనై అంతరంగంలో రగులుతూవచ్చిన అగ్నిజ్వాలలన్నీ వెలిగక్కుతూనే ఉందిగాని అంతసేపూ "తొందరపడుతున్నావు!" "వద్దు." అంటూ అంతరంగంలో హెచ్చరికలు వినవస్తున్నాయి. కాని ఆ వివశత్వంలో, ఆగలేకపోయింది అత్తగారిపై ఒక్కొక్క మణుగురాతిమాటా అంటూనే ఉంది గాని ప్రతిమాటా విసరిన వెంటనే హెచ్చరిక వినవస్తూనే ఉంది. అయినా నిలద్రొక్కుకోలేకపోయింది. చివరికి జేవురించినముఖంతో రక్తారుణ నేత్రాలనుంచి విస్ఫులింగాలు రాలుస్తూ ఎదురుగా భర్త కానవచ్చేసరికి అప్పటికే కొంతవరకి మందు వేసిన హృదయంఒక్క అదటున దిగజారిపోయింది. అతనితో కూడా పోరాడవలసివచ్చేవని అనుకున్నా ధైర్యం ఏమాత్రంకూడా సమకూరింది కాదు.

చూస్తుండగానే ఆమెముఖంలో చేరు రక్తమంతా కాళ్లలోకి పాదాలలోకి పరుగులుతీసింది. పెదవులకు బదులు కాళ్లు చేతులు కంపింపసాగాయి. హృదయస్పందనం పదిరెట్లెక్కువగా పనిచేయసాగింది.

శేఖరం అన్నారు——

"ఏం ఊరుకున్నావ్, కానీయింకా"

ఉమకుయింక అతనికండ్లలోకి చూడ్డం అసాధ్యమనిపించింది. అతను తల ఊపుతూ అడిగాడు.

"నువ్వు ఈ పెండ్లి సంబంధంగూర్చి మొట్టమొదట నాతో అన్నప్పుడే నేను చెప్పానా?... నువ్వేమన్నావ్? 'వాళ్ళిద్దరూ నాకు బహిఃప్రాణాలు వాళ్ళకు పెళ్ళయితే నా కంతకుమించిన సంతోషం మరి ఉండదన్నావ్' దానిమీద నేనన్న మాటలు నీకానాడొక్కటైనా తలకెక్కాయా? ఇప్పు డవన్నీ ప్రత్యక్షంగా అగపడుతున్నాయా?"

ఝంఝామారుతానికి కంపించే లతలా ఆపాదమస్తకం చమటలు కారుస్తూ వెల్లముఖంతో నిల్చున్న భార్యను చూస్తుండగా శేఖరానికొక వంకనుండి జాలి పీడించసాగింది. అంతేకాక ఆమె పౌరుష స్వభావం జడిపింపసాగింది. అయినా అతడు ఆగలేదు.

"వాడికి తోచిందేదో వాడన్నాడు. అది పొరపాటైతే నిజంచూపి బోధించు. అంతేగాని పౌరుషం దేనికి?"

"నీపిన్నతల్లి కొడుకునంటేనే నీకంత పౌరుషమేడిసినప్పుడు వీడినంటే మాకు కోపంరాదూ?"

ఆసరికి ఉమచెవులో ఒక్కమాటైనా పడటం లేదు. అల్లాగే వెడుతున్నాయి.

తర్వాత ఏభావంతలలో మెరిసిందో కాని, శేఖరం అకస్మాత్తుగా కోపోద్రిక్తుడై దంతఘట్టనం చేస్తూ అన్నాడు.

"చెప్పు! 'మాకు కోపంరాదా?' అంటాను."

ఉమ జవాబివ్వలేదు. యింక ఆమె ఒంటి మీద దెబ్బపడి పోతుందనగా పంతులుగారు జవాబిచ్చారు.

అంతవరకూ ఒక చీపురుపుల్ల పుచ్చుకొని పళ్లు కుట్టుకుంటూ అదోదృష్టితో తన కాపోట్లాటతో ఎట్టి సంబంధం లేదన్నట్టుగా ఓ ప్రక్కగా ఉంటూవచ్చిన ఆయన శేఖరం చివరి ప్రశ్న వినగానే మరేమనుకున్నారో చేతిలోపుల్ల అకస్మాత్తుగా పారవేసి కొడుకునుద్దేశిస్తూ అన్నారు——

"ఊఁ. చెప్పుతానురా. ఏమిటీ నీప్రశ్న ?"

అత నిలా ప్రతిపక్షంలో అడుగుపెట్టడంతో అతని గొంతు శాంతంగానే ఉన్నా శిఖరం కళ్ళెం లాగినట్టు ఆగిపోయాడు. పంతులుగారిది గమనిస్తూనే అన్నారు.

"వాళ్ళ పినతల్లి కొడుకు నంటే దానికి కోపంవచ్చినట్టు మీ తమ్ముణ్ణంటే మీకు కోపం రాదా అంటావు ? అదేనా నీ 'లా పాయింటు' ?

సరే దానికి జవాబు విను,

వాళ్లన్నను, మీ తమ్ముడు అన్న దానికి ఒక్క ఆధారంలేదు. నిజానికి అతన్ని అనడానికి ఈ విద్వాయి అతడి కాలిగోరును పోలడు. నాలుగు ఇంగ్లీషు ముక్కలు రాగానే యీ వెధవాయికి వచ్చి పడిసినది ఏమిటీ? మనిషితో ఎట్లామాటాడాలో,ఎలా గౌరవించాలో కూడా తెలియదు. ఏ మాట కే అర్థమైనా తెలియదు. వీడు ఇంటకు వెలిగిస్తున్నాడని వీడి నీలుగు. కాని వచ్చిందేమిటీ ? తెలుగులో తెలుగు కావ్యాల కర్థంరాదు. కావ్యనామాలకు అర్థంచెప్ప మనూ ? ఇంక ఇంగ్లీషు—చిలకపలుకులు తప్పితే వీడికి అందులోమాత్రం తెలిసిందేమిటీ ?

ఇంక అతడు

తెలుగులో అతను చదువని కావ్యంలేదు. పైగా వీడి కింగ్లీషుభాష తెలుస్తే ఆయన సంస్కృతంలో పంచకావ్యాలు క్షుణ్ణంగా చదువుకున్నాడు.

"ఏంచూసయ్యా వీడినీలుగు ?"

క్షణకాలం ఆగి—

"వీడికంటే, ఈ పూట కుంటే ఆపూటకు గతి లేదు. నాకీ ఉద్యోగం ఏడిశివన్నాళ్ళ వీడి మిడిసిపాటంతా. పొట్ట పోషించుకోవడానికి పట్టాలుంటే గాని గతిలేదు కాబట్టి చదివిస్తున్నాను. అతడికేం మహరాజు ! వీడిలాటి వాళ్ళను పదిమందిని పోషించ గలడు ! అందుచేతే అతను వీడి బానిస చదువుకు తలఒగ్గలేదు. అంతేగాని ఏదో జులాయిగా తిరిగే తెలివితేటలు చాలకా సోమరితనం చేతా కాదు.

వీడు పదేళ్లు అతనిదగ్గర శుశ్రూష చేసినా అతని కడుపులో ఉన్న విద్యలో పదోవంతు నేర్చుకోలేడు.

ఏం చూశయ్యా వీడతణ్ణి తృణీకరించడం ?"

పంతులుగారు చాలా సాఫీ అయినస్వరంతో నే ముగించారు. అయితే మాటా స్వరం ఎంత మృదువుగా ఉండెనో ధోరణి అంత పదునుగా ఉండెను.

కుమార్తెలూ, కొడుకూ, భార్యా, అల్లుడూ ఎక్కడి వాళ్లక్కడ అలా నిల్చుని వింటున్నారు. పిల్లలుకూడా తమకు ఏమీ తెలియకపోయినా నలుగురి ముఖాల్లోకీ చూస్తూ అక్కడే ఉన్నారు.

ఉమమాత్రం మధ్యలో కండ్లు తిరిగాయేమో చతికిలపడిపోయి తలవేల వేసింది. దూరంగా ఉన్న జానకి పరిస్థితి గమనించి చన్నీరు తెచ్చియిచ్చింది. ఉమ అవి త్రాగి తేరుకుంది. జానకి విసనకర్ర తెచ్చి విసరబోయింది. కాని ఉమ వారించింది.

పంతులుగారిదేమీ గమనించలేదు. అతను కొంతసేపు ఊరుకొని ఆరంభించారు.

"యింక ఆపిల్ల మీతమ్ముణ్ణంటే కోపంరాదా అన్నావు. ఏల రావాలి ? ఆమె ఆరోపణలలో ఏది కాదనగలవో చెప్పవూ ?" అని కొనసాగి "దోషాదోషవిచారణ సాగించేటప్పుడు తల్లయేది, పిల్లయేది, భార్యయేది, చెల్లెలయ్యేది ఒక్కలాగే చూడాలి, అలా చూసేదమ్ము లేకపోతే చూస్తూ ఊరుకోవాలి. అంతేగా ?......" అంటూ వాక్యంపూర్తిచేయకుండా నే ఆగిపోయారు.

కొంతసేపటికి ఎవరు మట్టుకవారు లోనికి వెళ్ళిపోయారు.

ఆదినం సంవత్సరాదన్నమాటేగాని అట్టి దుర్దినాన్ని ఆ కుటుంబం ఎన్నడూ గడిపిఉండదు.

ఆరాత్రి పడకగదిలో బుచ్చిబాబూ భార్యా మధ్యాహ్నపు గొడవను గూర్చి చర్చించుకొంటూంటే భార్య అంది—

"మీరు లక్షచెప్పండి, నాన్నగారట్లా మాట్లాడ్డం తగదు, చిన్నా, పెద్దా తారతమ్యం లేకుండా ఆమె నోటికి వచ్చినట్టూ అత్తగారనైనా ఆలోచించకుండా దానినికూడా అంతంలేని మాటలంటే—ఈయన ఊరుకున్నది పోయి పైగా వాడు మందలించబోతే మళ్లా ఆవిణ్ణే వెనుకవేసుక రావడం కూడానా ?

ఆవిడవల్ల తప్పుందనే కడదాం, అయితే కోడలైపుండి అలా వాగుతుందా ?

అవిడెంత ఏడ్చిందనీ ?"

భార్య మామాగారిళ్ల తప్పును యింకా అనేక విధాల ఎత్తి చూపింది. కాని బుచ్చిబాబు ముఖ స్తంగా చివరకు అంగీకరించినా అంతరంగికంగా కొస్తకూడా ఏకీభవించలేదు. ఆలోచించిన కొద్దీ అతనికి ముసలాయన దూరదృష్టి విస్పష్టమై అతని యందుంటే గౌరవం హెచ్చింది.

## ౬

మర్నాటి ఉదయంకల్లా అంతా కొస్త కలక దేరారు—ముగ్గురుతప్ప. వారుముగ్గురూ రాత్రెల్లా నిద్ర పోలేదు. నిద్రించివుంటే వారూతక్కినవారిలా జరిగినదానిలో చాలామట్టుకు మరిచిపోయి ఉండే వారు.

శేఖరం స్నానంచేసిబట్టలు వేసుకుంటూ ఉంటే ఉమనిశ్శబ్దంగావచ్చి ద్వారంవద్ద నిలుచుంది. శేఖరం చూసికూడా చూడనట్టు ఊరుకున్నాడు. ఉమకొంతసేపు భర్తవంక మాసి నిశ్చలస్వరంతో అంది.

"అలా వెళ్ళినప్పుడు అన్నయ్యకు ఒక ఉత్తరంగాం యివ్వండి— సాయంకాలంలోగా ఎలా నేనా రమ్మనండి.

శేఖరం యీ సారిమాత్రం భార్యవంక ఒకసారి చూసి మళ్లా తలదువ్వుకోవడంలో నిమగ్నుడయ్యాడు

ఉమ కొంతసేపు వేచిఉండి తర్వాత ఎలా వచ్చిందో అలానే వెళ్లిపోయింది.

సాయంకాలం ఆరుగంటలకు హరిప్రసాదరావు చేతిలో సైలుసంచితో హాజరయ్యాడు. సరస్వతీ అన్నా మామయ్య వచ్చాడంటూ పోయి కౌగలించు కున్నారు. అలవాటుచొప్పున చేతిలోనిసైలు సంచీ వంకమాచారు. కాని మామయ్య 'క్షమాపణ'తో అందులో ఏమీలేదని చెప్పి అనుకోని ఆశాభంగం కలిగించాడు.

రాత్రి భోజనాలవద్ద హరిప్రసాదరావు తను వచ్చిన కార్యం బయట పెట్టాడు.

భార్యకు పురిటిరోజులు సమీపించాయట. చేసుకోలేకుండా ఉంది. తల్లి ఉమఅక్కకు ఒంట్లో బాగు లేకపోతే వెళ్ళిందట. వచ్చేసరికి ఎంతకాలం పడుతుందో తెలియదు. ఇంట్లోయింకొక మనిషి లోడులేకపోతే అది అనేకవిధాల బాధాకరంగా ఉందట.

ఇంక—

ఉమని పండుగముందే పంపమంటే ఆడపిల్లల్ని తీసుకువస్తున్నామని వ్రాశారు, తన క్షేమనటానికి అవ కాశం చిక్కిందికాదుట. కాని పరిస్థితుల ఒత్తిడికొద్దీ వచ్చినపండుగ ఇంకా పొలిమేరయినా దాటకుండా తాను రావలసివచ్చిందట!

అబద్ధమాడే టప్పుడు నాలుగువంకల నుండీ చూచుకొని కొస్తపెద్దదీ ఆడులే ఒకప్పుడది కాయ వచ్చు. కాని అబద్ధంఆడకుండా, నిజంచెప్పకుండా ఆడితేమాత్రం అది ఎదటివాడు మరీ మూర్ఖుడైతే తప్ప బయటపడి తీరుతుంది.

అంతేజరిగింది. కాని ఆదినారాయణమూర్తి పంతులు యిట్టిసందర్భాలలో మాత్రం తన ప్రాబిడ సహానాసంప్రదర్శించడు— విషయాన్నంతా ఆక ళింపుచేసుకొని 'ప్రగ్గడల వంశీకునకు' తగినట్టుగా ఇలా అన్నారు.

"అయ్యోనాయనా కష్టసుఖాలందరికీ ఒకటే నోయ్! ఇవాళనీపిల్లయింది—రేపునాపిల్లవుతుంది—' అంటూకోడలిని పిలిపించి అన్నారు.

"ఏమమ్మా అన్నయ్య తీసుకవెళ్తానంటున్నాడు ఏమంటావ్?"

అధోముఖియై నిల్చునిఉన్న ఉమ మౌనంగా ఊరుకుంది. హరిప్రసాదరావు అడ్డుపడి అన్నాడు.

"అదేమంటుంది మామగారూ? పెద్దలు! మీరే మంటే అది కాదనగలదూ?"

పంతులుగారు అడ్డంగా తలఊపుతూ అన్నారు.

"అలా కాదునాయనా! నీకు తెలియదు. అది యీ యింటికి వచ్చిందిలగాయితూ యీ యింట్లో యేకార్యమైనా దానిసలహా లేకుండాగాని, దాని ఇష్టానికి వ్యతిరేకంగాగాని జరిగిందేమో ఆపిల్లనే అడుగు. లేక అది యీపని ఇలాజరగాలీ అంటే దానికి విరుద్ధంగా ఏమైనా జరిగిందేమో అడుగు" అని క్షణకాలంఆగి "అది ఒక్కొక్క ఇంటిఅదృష్టం నాయనా! ఒక్కొక్క కోడలు వచ్చాక ఇల్లువాలు గిళ్లుగా చీలిపోతుంది— ఒక్కొక్క కోడలు వచ్చాక

పట్టిందల్లా బంగారమై ఇల్లు ఏకసూత్రంమీద నడుస్తుంది,

ఈ యింటి ఆడపడాని పూర్వపుణ్య ఫలమే అనులేక మా తల్లికడుపు చలవే అను— ఏమైనా మాకీ జోర్టి కోడలుగా లభించింది.

ఇలా యింట్లో పాదం పెట్టింది, పెద్దవాడికుద్యోగ మయింది. ఆరుమాసాల్లో నాకు ప్రమోషను వచ్చింది. తరువాత తరువాత దానిచేతిమీదుగానే ఇద్దరాడుపిల్లలకు సలక్షణమైన సంబంధాలతో పెళ్ళిళ్ల చేసింది. మాయింట కష్టమేపడిందో సుఖంపొందిదో మమ్మల్ని మాత్రం సుఖపెడుతోంది."

అని ఎవ్వరూ మాటాడకపోగా—

"అంచేతే దాన్ని ఎక్కడికైనా పంపటమంటే ప్రలోభించుపిస్తూ ఉంటాను. కాని నా కెంత ఆశ ఉంటుందో కనుక్కున్నవాళ్లు మీకూ అంతే ఆశ ఉంటుంది. అదినాకు తెల్సు. అయి నా ప్రలోభం గొప్పది చూడరూ!"

పంతులుగారు ప్రశ్న వేసి ఆగిపోయారు.

హరిప్రసాదరావు నిజానికి చదువుకున్న వాడూ, తెలివైనవాడూ అవును. ఏ గణితశాస్త్రపు సమస్యనో యిస్తేదాన్ని నిముషంలో పరిష్కరించటంలోనూ, ఏరాచకీయసాంఘిక విషయాలుగూర్చో చర్చించటమంటే ఎదుటివాణ్ణి నోరెత్తనీయకుండా వివిధ గ్రంథాలలోంచి ఉల్లేఖితాలిస్తూ ఉపన్యసించటంలోను ఘటికుడే. కాని లౌకికాల్లో మాత్రం అతడు సద్ద మూఢుడు. దూరదృష్టియుతమూ, భావగర్భితమూ అయిన ఆ వృద్ధుని ఉపన్యాసానికి అతడిచ్చిన జవాబు చూస్తే అదే ఋజు వవుతుంది. అతడన్నాడు.

"ఎంతమాట. ఏదో ఇబ్బందిగాఉంది కాస్త సహాయంగా ఉంటుందనిగాని మిమ్మల్ని యిబ్బంది పెట్టడం ఎన్నడూ నా ఉద్దేశంకాదు" అని కాస్సేపాగి "మీరూ..." అంటూ నసుగసాగాడు.

పంతులుగారు గ్రహించి అన్నారు.

"అబ్బే దానికేముంది నాయనా! పరిస్థితి చెప్పాను." అని క్షణమాగి తర్వాత కోడలినుద్దేశించి.

"సరేనమ్మా! అన్నయ్యకు అవసరమంటు న్నాడు. నీకూ వెళ్ళాలనే ఉన్నట్టుంది. వెళ్లిరా.

కాని ఒక్క విషయం జ్ఞాపకం ఉంచుకో. మీ అత్త ముసలిది—వట్టి చాదస్తురాలు. యింక మీ ఆయన పరమసోమరి. నామాట యెల్లాఉన్నా వీళ్ళిద్దరూ క్షణం వేగలేరు. అందుచేత వీలైనంత వేగిరం బయలుదేరిరా,"

పంతులుగారు ముగించారు. క్షణకాలం అంతా నిశ్శబ్దం. తల్లికొంగు పుచ్చుకుని నిల్చుని ఉన్న సరస్వతిఅకస్మాత్తుగా ఆనిశ్శబ్దాన్ని చీలుస్తూ మాట్లాడింది.

"వెళ్లమన్నారు కదే. ఇంకెందు కాలస్యం"
అంది దీర్ఘంతీస్తూ.

ఉమ చప్పున కూతుర్ని ప్రక్కకు నెట్టి అక్కడనుండి వెళ్ళిపోయింది. సరస్వతి చిన్నబోయిన ముఖంతో తాతవంకా మేనమామవంకా చూచింది. వారు వినేలేదో, వినినా విననట్టు నటిస్తున్నారో సరస్వతి చూపులను గుర్తించకుండా మౌనంగా భోజనాలు ముగిస్తున్నారు. భోజనాలయాక శేఖరం కూతుర్ని తోడ్కొని వీథిగదిలోకి వెళ్ళిపోయాడు.

౭

రాత్రి పదకొండు గంటలవుతుంది. పంతులుగారింట్లో ఒక్కొక్కరే నిద్రాముద్రితు లౌతున్నారు. నిద్రపట్టని జానికి మెల్లిగా డాబామీదకు వెళ్ళింది.

ఉమ ఒక చాపపరుచుకొని ఒక్కర్తే పడుకొని ఉంది. జానకివంగి ఆమెముఖంలోకి చూస్తూ నెమ్మదిగా అడిగింది—

"నిద్రేనా వదినా ?"

ఉమకండ్లు విప్పిచూసి ఆ చీకట్లోనే జానకిని గుర్తించి అంది.

"లేదమ్మా! ఏం ?"

"నేను కూడా నీ ప్రక్కపడుకోనా ?"

"రాఅమ్మా పడుకో" అంటూ చోటుచేసింది. జానకి ఒదినప్రక్క ఒరుగుతూంటే పదేండ్లక్రితం యిలానే తను అడగటం చిన్నఘర్షణపిదప ఆమె తనను ప్రక్కలో పడుకోపెట్టు కోవటం జ్ఞాపకం వచ్చింది.

అప్పుడు తనకు ఆరేళ్లు. రాత్రులు ఒదినా, అన్నయ్యా డాబామీద పడుకుంటుండేవారు. ఒక

నాడు రాత్రి భోజనాలయిన పిదప వదిన సాయంత్రం అన్నయ్య తెచ్చిన మల్లెపూలదండ తుంపి చిన్నది తన తల్లో పెట్టి పెద్దది తాను తురుముకుంది. ఆవాళ వదిన చాలానీటుగా ముస్తాబయింది. వెన్నెలరాత్రి కూడా. తనకు ఆవాళ ఆమె ప్రక్కలో పడుకోవాలని బుద్ధిపుట్టింది. డాబామీదవదిన ప్రక్కలు పరుస్తూ వుంటే తనూ వెనక వెళ్ళి,యివాళ నేను నీప్రక్కలో పడుకుంటాను వదినా, అంది. వదినకాస్త సేపాలోచించి సరేకానిమ్మంది. తను పడుకొంది. వదిన క్రిందికి వెళ్లింది.

కొంతసేపటికి అన్నవచ్చి క్రిందికి పొమ్మన్నాడు. వీలుకు వీలుకు మంటూనే వదిన అనుజ్ఞ ఇచ్చిందని చెప్పింది. అన్నవల్ల కాదు పొమ్మన్నాడు. ఇంతలో వదినవచ్చింది. అన్నా వదినా వాదులాడుకున్నారు. అన్న కోపంగా మాట్లాడి ఊరుకున్నాడు.

తర్వాత కొంతసేపటికి తన్ను వెతుక్కుంటూ తల్లి అక్కడికివచ్చి 'ఇదేమే యిక్కడకుచేరావ్' అని కోప్పడింది. తనకోర్కెలో ఏదో తప్పుందని అంతకుముందే కొంత అర్థమయింది. తల్లి మందలింపుతో పూర్తిగా అర్థమయింది.

తను లేవబోతూఉంటే ఉమ రెక్క పట్టుకు నీడకు లాక్కుంటూ 'ఉండనివ్వండి అత్తయ్యా! పాపం సరదాపడుతోంది' అంటూ తల్లికి నచ్చ చెప్పి పంపించేసింది.

మర్నాడు చిన్నక్కకు కథంతా చెప్పి 'ఏమిటే తప్పు?' అని తను అడిగితే— 'కాదటే' అంటూ ఏదో విప్పిచెప్పింది. తనెంతో సిగ్గుపడింది.

ఆ వాళ వదిన ఒక్కమాటఅంది. తనకుబాగా జ్ఞాపకం. తల్లితనను విడిచిక్రిందికి వెళ్ళిపోయాక అన్న రేదోగొణిగాడు కాబోలు. వదిన తననుపొదివి పట్టుకుంటూ అంది—

"ఎవళ్లకు కోపంవచ్చినా మనమిద్దరం ఒకటమ్మ, ఏం?" అంది. జానికి ఆపురాతనగాథకు నేటిగాథకూ గలసంబంధసామ్యాలు ఊహించుకుంటూ నల్లని ఆకాశంలో మెరసే చుక్కల్లోకి చూస్తోంది.

కొంతసేపటివరకూ అవిశాల వినీలాకాశంలో మెరసే నక్షత్రాల అస్పష్టపుకాంతిలో వారిద్దరూ మూగ గా గడిపారు.

ఉండి ఉండి జానకిమనస్సులో ఓ భావం కదిలింది. వదిన కీసమయాన అనాటిగాథ జ్ఞప్తికి వచ్చి ఉంటుందా? తను జ్ఞాపకంచేస్తే?

సరిగ్గా అదేసమయాన ఉమఒత్తిగిలి జానికిని పొదివి పట్టుకుంది. జానికి హృదయం ద్రవీభూతమయింది.

"వదినా?"

"ఏమమ్మా?"

వదిన గొంతులోకూడా ఏదో అస్వాభావికత కానవస్తుంది.

"నిజంగా వెళ్తున్నావా వదినా?"

వదిన మాటాడలేదు. ఆమె ఊపిరికూడా పీలుస్తున్నట్టులేదు. ఒకసారి గుటక వేసినట్టుంది.

"నువ్వు వెళ్తున్నావు. నామీద కోపంవచ్చి కాదుకదూ?"

ఉమచప్పున కౌగిలి బిగించింది. జానకిహృదయం కరిగి కళ్లలోంచిప్రవహింప సాగింది. కోకార్ద్ర స్వరంతో అడిగింది.

"ఇదంతా నామూలానే నా వదినా. చెప్పు, నీకు నా మీదనిజంగా ఏమీకోపంలేదా?"

వదినకూడా అట్టిస్వరంతోనే జవాబిచ్చింది.

"లేదమ్మా కొంచంకూడా లేదు."

జానకి స్పష్టాస్పష్టపు పలుకులతో వాపోవ సాగింది—

"నాకు తెలుసు. ఉండదు. నువ్వట్టిదానివే. కాని పండుగపూటా నిన్ను నువ్వు తగని హింస పొందావు వదినా! మొదటినుండీ నాకోసం చీవాట్లే తిన్నావు, చిన్నవాడూ యీనాడూకూడా. నువ్వు మాత్రంయిది కడుపులో పెట్టుకోవుకదూ. నీ నరూ ఒకటి, నే ఒకటీకాదు కదూ ఒదినా?......"

తర్వాత ఆవేళనోట మరిమాట ఊడిరాలేదు. బహుశా చెప్పడానికికూడా ఏమీలేదేమో.

తర్వాత వాళ్లిద్దరూ కళ్లలో నీరంతా ఖర్చయేవరకూ అలా ఏడ్చారు. ఇరువురూ చివరకు అలసి ఊరటపొందారు. పిదప వదిన జానకితలను తనగుండెలపై చేర్చుకొనగా చల్లనిచేయి ముంగురులు సర్దుతుండగా ఎప్పుడు నిద్రపోయిందో నిద్రపోయింది.

తెల్లవారుజామున కౌశోలు తల్లితనను తట్టి లేపింది. లేచికళ్లు నులుముకుంటూ ఉంటే.

"అదేమే మంచంలోనే పడుకుండిపోయావూ? రేపు ఏ జొప్పమో వస్తే ఎవరుచేస్తారు?" అని కొంత ఆగి "అవిడనికూడా లేపు" అంటూ క్రిందికి దిగిపోయింది.

తన బట్టల్లానే ఒదినబట్టలుకూడా మంచుకే నేమో తడిసిఉన్నాయి. అప్పుడే పడుకుందేమో రెండుమూడుసార్లు తట్టితేగాని లేవలేదు. పిదప ఇద్దరూ క్రిందికిపోయి పడుకున్నారు.

మర్నాడు ఉదయం తను లేచేసరికి ఒదినా పిల్లలూ అప్పుడే ప్రయాణమై వెళ్ళిపోయారు.

* * * *

౮

ఊరునుండి వచ్చిన మూడవరోజున కౌశోలు ఉమా హరిప్రసాదరావూ వట్టింటకూర్చుని లోకాభి రామాయణం చర్చిస్తున్నారు. కొంతసేపుపోయాక హరిప్రసాదరావు స్వరంతగ్గించి అడిగాడు.

"అయితే జరిగిందేమిటమ్మా?"

అంతవరకూ స్వేచ్ఛగా మనఃకవాటం తెరచి మాటాడుతున్న ఉమ టప్పున కవాటం మూసేసుకుంది. కొంతసేపుపోయాక కొంత ఓరవాకిలిగా తెరిచి మాటాడసాగింది.

"ఏంజరిగింది. నవ్వుపిల్చావు నేవచ్చాను." హరిప్రసాదరావ్ కొంతసేపు ఊరుకుని అడిగాడు.

"అదికాదమ్మా! నువ్వు వైర్ చేయవలసిన అవసరం ఏం వచ్చింది?"

"కింద ఎవరిసంతకం ఉంది?"

అన్నవవ్వుతూ అన్నాడు—

"మీ ఆయనదే అనుకో"

"అయితే ఆయననే అడగవలసిందినువ్వు"

"అడిగాను. అడిగితే ఆయన నువ్వు రప్పించ మన్నావు, రప్పించానన్నాడు."

"ఎందుకని నువ్వడగలేదా?"

"అదీ అడిగాను. 'ఏమో తెలియదు. బహుశ మీతో రాదలచుకుందేమో!' అన్నాడు, నేనా ముఖ వైఖరీ వాగ్ధోరణీ గమనించి ఏదో కీచులాడుకున్నా రనుకున్నాను. తరువాత అతడు నాతో బజారువరకూ వచ్చి తను పనిమీద వెళ్లాలని చెపుతూ నన్ను యింటికి వెళ్లమన్నాడు. నేను కొంతదూరంపోయాక పిలిచి, మళ్లా, ఏమీ లేదంటూ వెళ్ళిపోయాడు.

ఇంటికివస్తే మామగారి ధోరణి ఇంకోలా ఉంది. నారాకకు ఆశ్చర్యపోవడం చూసి వైర్ సంగతి ఆయనకు తెలియదనుకున్నాను.

తర్వాత అన్నిటికీ తగినట్టు ఏవో అబద్ధాలు ఆడవలసి వచ్చింది!"

హరిప్రసాదరావు కొంతసేపు ఆగి తన ప్రశ్నను పునరుద్ధరించుకున్నాడు.

"ఇంతకూ ఇదంతా ఏమిటో తెలియకుండా ఉంది".

ఉమ మొఖం అదోలాపెట్టి, అంది—

"ఏముందీ నేను! మా అత్తారితో పోట్లాడివచ్చే శాను. తెలుస్తూనే ఉందిగా?"

హరిప్రసాదం అప్రతిభుడై ఊరుకున్నాడు ఉమ వదినను పిల్చి ఆమె వచ్చాక తీక్షణంగా అడిగింది.

"ఏమమ్మా, ఇది నీమంత్రాంగమా లేక ఆయన గారి స్వబుద్ధా? అక్కడ ఎలాగూ పోట్లాడి వచ్చింది ఇక్కడినుండి కూడా తరిమేదామని ప్రయత్నిస్తున్నా రేమో! మీరేంచేసినా పోయేదాన్ని కాదు."

వదినగారు విచ్చరపోతూ అడిగారు—

"ఇప్పుడేమయిందమ్మా?"

"మీ ఆయన నిన్న నీముందు చెప్పనిరహస్యాన్ని ఇప్పుడు ఏకాంతంగా అడగటంలో ఉద్దేశమేమిటి? నీకూ నాకూ పోట్లాటపెట్టే నేర్పు కాక పోతే?"

వదిన తేలికపడ్డ హృదయంతో నవ్వుతూ.

"అదటమ్మా! నీకా భయమేమీవద్దులే. ఇద్దరి మధ్యా ఇడుముళ్లు పెట్టేపాటి తెలివితేటలే ఉంటే ఆయన B. A. చదివాక B.L. కే పోయి ఉందురు. ఇలా మేష్టరెందుకౌతారూ?"

"అయితే ఇది నీతెలివితేటల ఫలమా అన్న మాట"

వదిన, మాటల్లో ఉమకేమీ తీసిపోదు.

"సహవాస దోషబలిమిని అయినా అనవచ్చు. ఎంతైనా నీఅంత తెలివి నా చేతకాలేదు."

"నా ఇడుముళ్లలేవ మేలు చూశావ్"

"నువ్వు ఇప్పుడు చూస్తుండగానే మాయిద్దరి నడుమ తగువు పెట్టచూడలే ?"

"నేనా ?"

"అమ్మో. అడుగుతోందయ్యో సంగనాచిలా. ఆయన, చెల్లెలుకదా అని నమ్మి, నాముఖంచాటేసి ఏకో అడుగుతూ ఉంటే, పని వేళ నన్నుపిలిచి చూసు నీమొగుడెట్లా నీముందు రహస్యాలు దాస్తున్నాడో అనటంలో ఉద్దేశమేమిటో ?"

ఉమ పకపకనవ్వి అంది

"గడుసుదానివే! ఎట్లానైనా ఆలుమగలు ఒకటే."

వదినమాట పూర్తికాకుండానే అభినయం చేస్తూ అంది.

"ఆమాటే అంటే ఈ పిచ్చిబ్రాహ్మడికి అర్థమయింది కాదు. అయితే పోయి అడగండన్నాను. అడిగారు. నువ్వు మెత్తని చెప్పుతో యీ లెంపా ఆలెంపా వాయించావు. ఇకనైనా బుద్ధివచ్చిందో లేదో కాస్త అడిగిచూడు."

ఉమ దాగని నవ్వు పెదవుల అంచులబడి జారుతుండగా మునిపళ్లు కరచిపెట్టి తొందరగా పోయి వదిన బుగ్గలు నులుముతూ అంది—

"బుద్ధొచ్చిందా—బుద్ధొచ్చిందా ?"

వదిన నవ్వుతూ తప్పించుకొని అంది

"నాకుకాదు మీఅన్నకు."

ఉమ వదినబుగ్గలు వదిలి ఆమె ముఖంలోకి చుర చుర చూస్తూ అంది.

"ఏమో మేమింకా అంతపాటి రాగలం కాలేదు. నీకుందేమో అట్టి సామర్థ్యత !" వదిన నవ్వుతూనే అంది

"అబ్బే. నువ్వురాగలవని ఎవరనగలరూ ? చేలవుకముకే అంతపెద్ద పోట్లాట పోట్లాడికూడా మాఅన్నద్వారానే నీఅవసరం నెరవేర్చుకున్నావు."

ఉమ వదినను పట్టుకోబోయింది కాని ఆమె తొందరగా అవతలకు వెళ్లిపోయింది.

౬

వెళ్లాళనాడు ఒకసాయంకాలం వదిన వంట యింట్లో వండుతోంది. పిల్లలంతా వీధివాకిట్లో గొడవగా ఆడుకుంటున్నారు.

హరి ప్రసాదరావు ఇంకా ఇంటికిరాలేదు. వారంరోజుల క్రిందట ఊరునుండివచ్చిన తల్లికూడా ప్రక్కవీధిలో ఉన్న చుట్టాల యింటికి వెళ్లి యింకా రాలేదు.

ఉమచేతిలో ఉత్తరంతో ప్రవేశిస్తూ అరవ సాగింది.

"ఏమమ్మో రేపటితో మీ పీడ వదులుతుంది."

వదిన పరధ్యానంగా ఉండి వినిపించుకోక ఏమిటే అంది ఇటుతిరిగి.

"రేపు నాప్రయాణం"

వదినకు తన మరదలుసంగతి బాగాతెల్సు. అందుచేత పులుకూ పులుకూ మని చూసి అంది.

"కృతఘ్నురాలా, ఇన్నాళ్లూ మాయింట్లో పడి మేసి—'ఇప్పుడింక ఇవాళోరేపో పురుడువస్తుంది కదా ; చాకిరీ చెయ్యాలి' అని పారిపోతావా ?"

ఉమకొంత అలస్యంగా జవాబిచ్చింది—

"నువ్వు ఏ ఉద్దేశంతో వాడేవోగాని వదినా మామంచిపేరుపెట్టావ్—నాకాపేరు సరిగ్గా సరిపోతుంది."

వదిన సందేహిస్తూ అడిగింది—

"ఏం ?"

"తొమ్మిదవనెల వెళ్లినా నిన్ను పొయ్యిదగ్గర నుండి లేవనెత్తగలిగానా ?"

"నువ్వు మాట మారుస్తున్నావు."

"లేదు"

"అయితే నీయింట్లో నీ ఆడపడుచులచేత అట్లానే చేయించుకుంటున్నావా ?

"నేనా ? నేను అత్తగారినే నోటికివచ్చినట్టు వదిరే భ్రష్టురాలను !"

ఉమ స్వరంమారిపోయింది. వదిన గమనించి కొంతసేపటివరకూ ఏమీ మాటాడ లేకపోయింది, తర్వాత మెల్లిగా అంది—

"నేను నీకన్నా మూడేళ్లు ముందుగా కాపురం ఆరంభించాను. కాని నీలా ఎప్పుడూ అత్తగారిని మందలించలేదు. మాఅత్తగారూ నాకట్టి పరిస్థితి కల్పించలేదు. ఒకవేళ కల్పించి ఉంటే నీలా మందలించగలిగే దానినా లేదా అని ఇప్పుడు ఆలోచిస్తున్నాను.

నిజానికి మందలించ గలిగితేనే నేను సంతోషి స్తాను.

ఎవరమ్మా అత్తనూ, భర్తనూ, మరదుల్నీ, గదమాయించ గలిగిన భాగ్యశాలినులు—ఎంతమంది ఉంటారు.

నువ్వు ఎవర్ని గదమాయించగలవ్ ? అవార్ని కలా కండ్లు వేయికండ్లుగా చేసుకొని, నానాచాకిరీ చేసి ప్రాణంగా పెంచుకునే నీబిడ్డల్ని, నీప్రాణం కన్నా ప్రాణంగా ప్రేమించే నీబిడ్డల్ని గదమాయించ గలవ్. ఇతరులను కూడా గదమాయించ గలిగావంటే వాళ్లనుకూడా నీబిడ్డలను చూసినట్టు చూచుకుం టున్నా వన్నమాట. లేనప్పుడు నీకా స్వతంత్రం ఎక్కణ్ణుంచి వస్తుందీ ?"

వదిన అలా ప్రశ్నవేసి పొగలు చిమ్ముతున్న పొయివంక తిరిగింది, విసనకర్ర తీసివిసరగా కొంత సేపటివరకూ పొగలు చెదరి మరీ యిబ్బంది కలిగిం చాయి. చివరకు చక్కగా మండసాగింది.

ఉమ అడిగింది—

"అయితే వదినా లోకంలో అత్తమామలమీదా మొగుడు మీదా విరుచుకపడే కోడళ్లందరూ అట్టి అభిమానం కలవారే అవుతారా ?"

"ఎలా అవుతారూ ?" వదిన తను చేస్తున్న పనినుండి దృష్టి మరల్చకుండానే చెప్పసాగింది "నీబి డ్డలను తప్పుపనినుండి మందలిస్తున్నప్పుడు నువ్వు చేస్తున్న పనినిగూర్చి నీఅంతఃకరణలో ఎలా ఎట్టి జంకూ ఉండదో అల్లానే నీ అత్తమామల్నిగాని మొగుడునుగాని మందలించేటప్పుడు కూడా నీ అంతః కరణలో లోకభీతికాని ధర్మభీతికాని లేక మరెట్టి భీతికాని ఉండరాదు. అది అంతఃకరణ శుద్ధమైన ప్రేమ ఉంటేనే కాని సాధ్యంకాదు."

వదిన చెప్పేది పూర్తికాకుండానే ఉమ అంది—

"అవును. అవునువదినా! నేనూ అలానే అను కున్నాను. కాబట్టే నేను భ్రష్టురాలనని చెప్పుకుంటు న్నాను."

ఈసారి వదిన మరదలి ముఖంలోకి చూచి అంది.

"ఏమో నే నలా అనుకోను."

"నువ్వనుకోవని నాకు తెల్సు. లోకమంతా నీవంటివారే అనుకుంటావు."

"నువ్వంత మూర్ఖురాలవా ?"

"కాకపోతే గ్రుడ్డిదానిని! అంతేనా ?"

వదిన ఊరుకుంది.

కొంతసేపు వరకూ ఎవరూ మాటాడలేదు.

తర్వాత ఉమ ఉత్తరంమాట జ్ఞాపకంరాగా అంది.

"ఉత్తరం వచ్చింది"

"నువ్వు ప్రయాణమైనప్పుడే నేననుకున్నాను"

—అంటూనే వదిన నవ్వింది.

"నువ్వనుకుంటావు! అనుకోవూ ? అయితే మీఅన్నయ్య వ్రాశారనికూడా అనుకున్నావా ?"

వదిన ఎదురు ప్రశ్నతో జవాబిచ్చింది—

"ఎంతనువ్వు మడినికట్టుకున్నా మాకు పౌరుషం కొదువయిందంటావా ?"

"ఉన్నమాటన్నావు—ఈసారికూడా ఆడపిల్లే పుట్టి—"

"సార్థంతో చేసిన ఆశీర్వచనం ఫలించదు గానీ—ఏం వ్రాశారు"

"అయితే రెవరు వ్రాశారంటావు ?"

"నాకేం కేరళం తెలుసను కున్నావా ?"

"చెప్పవూ !"

"మీజానకమ్మే మో !"

"నీకెట్లా తెలిసిందీ ?"

"ఎలానో తెల్సిందిలే ఏంవ్రాశారూ ?"

"నేనువచ్చి నెల్లాళ్లయినా ఉత్తరంవ్రాయలే దట. అన్నయ్య అయినా క్షేమంగా చేరినట్టే వ్రాసిన ఉత్తరం తప్పితే మళ్లా వ్రాయలేదట. అమ్మ వచ్చిందా అనీ వస్తే వెంటనే బయలుదేరి రమ్మనీ తన తప్పులన్నీ క్షమించమనీ వ్రాసింది. మధ్యను ఒక వాక్యంవ్రాసిక్రింద గీరగీసింది. ఏమిటో అదిచెప్పుకో"

"అన్నయ్యకు చాలాకోపంగా ఉంది. అనా"

"కాదుగాని అదే అర్థం. ఒంట్లో బాగులేదట"

"అమ్మో జానకి ఇంకా చిన్నపిల్ల అనే అను కుంటున్నాను. ఇంత ప్రౌఢత్వం ఎక్కడ నేర్చిందీ ?

ఉమ దీర్ఘాలుతీస్తూ జవాబిచ్చింది.

"మీ అక్కచెల్లెళ్లకు వెన్నతో పెట్టినదమ్మా!" అంటూనే ఉంది. వదిన జవాబిచ్చేలోగా యింటికి వచ్చిన హరిప్రసాదం చెల్లెల్ని పిలిచాడు

అతడు తెచ్చిన సామాను లందుకొని భద్రం చేసివచ్చి ఉమ తన ప్రయాణంసంగతి బయట పెట్టింది.

"అదేమిటమ్మా!" అంటూ అతడు భార్యదగ్గరకు బయలు దేరాడు. సరిగ్గా అదేసమయంలో తల్లి కూడా చుట్టాల యింటినుండి వచ్చింది. వదిన తగాయిదాను అత్తగారి ముందుకు పెట్టింది. ఉమ ఆటంకం చెపుతూ అంది—

"మీరంతా ఒకటే. మీ తీర్పుకు నేను కట్టుబడ నవసరంలేదు. నావాదమిదీ. మీరు నన్ను తీసుకురాలేదు. నా అంతట నేను వచ్చాను. నా అంతట నేను వెళ్తాను. మీరు తీసుక వచ్చినప్పుడు మీ యిష్టానుసారం పంపుదురుగాని"

చివరికి తల్లి విసిగి అంది.

"అయితే వాళ్లు ఉత్తరం ముక్కైనా వ్రాయందే వెళ్తావుటే"

ఉమ పొరపాటును గుర్తిస్తూ అంది—

"ఇప్పుడు అక్కడకు ఎవరు వెళ్తారూ?"

తల్లి ఆశ్చర్యపోతూ అంది—

"అది ఒకటా! అయితే మరెక్కడకు?"

"పిన్నిగారింటికి?"

క్షణకాలం ఎవ్వరూ మాటాడలేదు. తరువాత వదినఅంది—

"అక్కడకు అయితే వెళ్లి నాల్రోజులుండి మళ్లా వచ్చేయండీ!"

ఉమ పేచీ విడవకుండా అంది—

"ఏమో నాల్రోజులే అవుతుందో పదిహేను రోజులే అవుతుందో నాకేమీ తెలియదు. అందుకే తిరిగిరాను."

తల్లికి కోపంవచ్చి అంది—

"ఏమిటే నీపనికి నాకేం తెలియకుండాఉంది! ఏమిటో చెప్పవేమి?"

ఉమకూడా తల్లిని వెక్కిరిస్తున్నట్టుంది—

"ఏమిటైతే నీకెందుకే నాసంసారం ఊసూ"

అన్నావదినా నవ్వారు. కండ్లనిండా కోపం వచ్చి నప్పుడు తన స్వభావాన్ననుసరించి తల్లి అక్కడనుండి వెళ్లిపోతుంటుంది. నేడు కూడా అలానే వెళ్లిపోయింది. కాని ఆమెకోపం తాటాకుల మంటకన్నా శీఘ్రంగా శమిస్తుందని అందరికీ తెల్సు. ఆమె వెళ్లాక వదిన అడిగింది.

"అయితే భారసాలకైనా రావటమ్మా!"

ఉమ కొంచెంసేపు ఊరుకుని అంది—

"నువ్వు నాకేమైనా అతచూపినప్పుడు మాద్దాంలే" అంటూనే ఆమెలేచి "ఇంతకూ నేనొక్కర్తను తక్కువైతే వచ్చిన నష్టమేముందీ?" అని ప్రశ్నించింది. అలుమగ లిద్దరూ జవాబుకోసం తడుము లాడారు. ఉమ కొంతసేపు ఆగి అంది "ఇప్పుడు పరిస్థితులెలా ఉన్నాయో మీకు తెలియంది కాదు." ఇలా అంటూనే ఆమె లోనికి వెళ్లి పోయింది.

ఉమగొంతు తడవ తడవకూ ఆర్ద్రమౌతూ రావటం గుర్తించిన అన్న పంజచీకటులలో నిశ్చలంగా నిలిచిఉన్న చెట్లలోకి దృష్టిని పోనిచ్చి ఏదో ఆలోచించ సాగాడు.

## ౧౦

ఉమనూ, పిల్లలనూ తీసుకొని హరిప్రసాదరావే బయలు దేరాడు. రైలు దిగగానే ఓ రెండెడ్లబండి లక్ష్యించింది.

ఇంటికి వచ్చేసరికి రాజశేఖరం వీర్రాజు పంతులుగారూ ఇద్దరూలేరు. రాజశేఖరం ఎవరో పట్నంలో చదువుకుంటున్న స్నేహితునివద్దకు మొందు రోజునే వెళ్లాడట. ఎప్పుడు వస్తాడో తెలియదు. వీర్రాజుగారు ఏదో వ్యవహారం పురస్కరించుకొని పొరుగూరు వెళ్ళారు. సాయంకాలంకు వచ్చేస్తారట.

హరిప్రసాదం శెలవు లేదనిచెప్పి వచ్చిన బండిలోనే స్టేషనుకు బయలుదేరాలన్నాడు. పినతల్లి సుందరమ్మ చాలా బలవంతంచేసి చివరకు నిష్ఠురంగా మాట్లాడసాగింది. హరిప్రసాదం అన్నిటినీ భరించి 'నీమాట కెన్నడైనా ఎదురు చెప్పానా పిన్నీ? ఈసారి గత్యంతరంలేదు. ఏం చెయ్యమన్నావ్?' అంటూ పరిస్థితులు వివరించాడు.

చివరకు పినతల్లి నిజం బయటపెట్టింది.

"మా చిన్నాన్న లేరు. ఆయన సంగతి మీకు తెల్సు. నా కెలాగూ చీవాట్లున్నాయి. పోతే

మీ వంతుకు వచ్చినవాటిని మీరు తీసుకోవడానికి సిద్ధపడితే వెళ్లిరావచ్చు" అంది.

కాని ఈ జడిపింపు కూడా అతణ్ని ఆపలేక పోయింది. చివరకు హరిప్రసాదరావు వెళ్ళాడు.

సాయంకాలం ఐదుగంట లవుతుంది.

ఉమ పినతల్లికూతురు సుమిత్రకు జడవేస్తోంది. సుమిత్ర పైటపరికిణీకోసరం లేసల్లుకుంటోంది. సుందరమ్మగారు వీధిలో ఉన్న పసువులశాలనుండి వస్తూ 'మీ చిన్నాన్నగారు వస్తున్నారులే!' అంది ఉమ నుద్దేశించి. ఉమ చిరునవ్వుతో పినతల్లివంక చూసింది. సుందరమ్మగారు తనపనిలో వెళ్ళి పోయారు.

వీర్రాజుగారు జోళ్లు చప్పుడుచేసుకుంటూ మెట్లెక్కి ద్వారం బయటవుండే చేతిలోని గొడుగు గోడనున్న మేకుకు తగిలించి జోళ్లు స్తంభంమీద పెడుతూ పెద్ద గొంతుకతో ధార్ష్టికం చేస్తున్న ట్టున్నారు.

"ఇదిగో ఏమేవ్ కాళ్లు కడుక్కోడానికి నీళ్లు పట్రా?"

ఉమ ఒక పెద్ద ఇత్తడి చెంబుతో నీళ్లు తీసుకు వెళ్ళి పరధ్యానంగా ఉన్న పినతండ్రి కందివ్వ బోయింది. అతను చెంబు అందుకుంటూ చెయ్యివంక చూసి చప్పునతలఎత్తి ఉమముఖంలోకి చూశారు. క్షణకాలం ఆ తెరచిన నోరూ, ఆ బొమముడీ అలానే ఉండిపోయాయి.

ఉమ నవ్వుతూ అంది—

"ఏమిటి చిన్నాన్నా అలా చూస్తారూ. నే నే"

చిన్నాన్న తన సహజ ఉచ్ఛస్వరంలో సక్రృత్తగా చెదరే గంభీరముద్రతో అన్నారు.

"అవును నువ్వే లే—ఎక్కణ్ణుంచని!"

ఉమ చిరునవ్వు మరికొంత వికసింపగా అంది.

"నీళ్లు తీసుకోండి చెప్తాను!"

కాని పంతులుగారు చెంబు అందుకోకుండానే అడిగారు. ఆయన ముఖంలోనే కాకుండా గొంతులో కూడా ప్రమాదశంకా చిహ్నాలు స్పష్టంగా అగపడు తున్నాయి. ఆతృతగా అడిగారు.

"కోడల్ని తీసుకు నేనా?"

"మీరుకాళ్లూ, చేతులూ కడుక్కొని రండి చెపుతాను" అంటూనే చెంబు క్రిందపెట్టి ఉమ తువ్వాలు కోసరంలోనికి వెళ్ళింది.

పంతులుగారు ఏమర్థం చేసుకున్నారో కాళ్లు కడుక్కుంటూ అరంభించారు. గొంతు సుందరమ్మ గారు నూతిదగ్గి వున్నా వినగలిగే అంత పెద్దది పెడుతూ తిట్ట నారంభించారు.

"అంతే! నే ననుకున్నంత పనీ అయింది. లేకపోతే యీ ద్రాపి ముఖాలకు పెత్తనమివ్వ మని ఎవరు చెప్పారు? వెధవలు వెధవలా అని. నేను వందసార్లు చెప్పాను. వింటేనా? మంచీ మర్యాదా లేని మనుషులు!" అంటూనే లోనికివచ్చి అప్పుడే వచ్చినభార్యను చూసి గొంతురెట్టిస్తూ అభినయంతో సహా అరంభించారు.

"చూశావా? చూశావా ఏం జరిగిందో? నే చెపితే విన్నా! నీకు తగినట్టు బుద్ధి చెప్పారు. కాదు! కుక్కకాటుకు చెప్పు దెబ్బ అన్నట్టు చెప్పారు."

అంటూనే ఆయన అక్కడవున్న మడత కుర్చీలో చతికిలపడి మేను వాల్చారు. ఇంతలో తువ్వాలు దొరకక తిరిగివచ్చిన ఉమకూడా అక్కడకు వచ్చింది. ఏమయిందో బోధపడక సుందరమ్మ గారు కూతురుముఖంలోకీ, భర్తముఖంలోకీ చూస్తూ చివరకడిగారు.

"ఇప్పుడేం జరిగిందీ?"

వీర్రాజుగారు చప్పున కూర్చుంటూ వెక్కిరిస్తు న్నట్టన్నారు—

"ఏం జరిగిందీ? ఏం జరగాలో అదే జరిగింది. మంచీ మర్యాదా ఉన్న మనుషుల కింకేంగావాలి?"

సుందరమ్మగా రడిగారు.

"ఇదేం దారమ్మా! ఏ విషయం చెప్పకుండానే తిరకాటం."

ఈసారి ఉమధైర్యంచేసి అడ్డుపడింది.

"జానకిని తీసుకురాలేదు. - చిన్నాన్నగారూ" అంది నెమ్మదిగా, ఆయన చప్పున వెనుదిరిగి ఆశ్చర్య పోతూ అడిగారు.

"ఏమిటే? కోడలురాలేదూ? ఇప్పుడు వచ్చిందని చెప్పావే?"

సుందరమ్మ జవాబిచ్చింది.

"మీ కెప్పుడూ అదే తలంపాయె. ఏమి విని ఏమనుకున్నారో"

"ఊరుకుందూ! వెధవమాటలూ నువ్వూనూ" అని భార్యను కసుగుకొని ఉమవంక తిరిగి అడిగారు.

"అయితే నువ్వెక్కడనుండి వస్తున్నావు?"

"ఈమధ్య నెల్లాళ్లయి అన్నయ్య దగ్గర ఉంటున్నాను. ఇలా ఒకసారి చూసిపోదామని వచ్చాను. పంతులుగారు కాస్తసేపు ఊరుకొని అన్నారు.

"ఊఁ. అయితే ఒక్కర్తివే"

"అన్నయ్యకూడా వచ్చాడు."

"ఏడీ వాడూ?"

ఉమ నవ్వుతూ పిన్నివంక చూసింది. పిన్నికూడా నవ్వుతూ "చెప్పే! ఇంద్దా కటి మాటలే మరొయ్యేయ్"అని ఆమె మాటాడకపోగా తనే చెప్పింది.

వీర్రాజుపంతులుగారును మళ్లా రుద్రావతారం తాలుస్తూ ఆరంభించారు.

"వెళ్లిపోయాడూ! శెలవులేదూ, మరి నువ్వేం చేశావ్?"

సుందరమ్మగారు నవ్వుతూ అన్నారు—

"అయితే వాణ్ణి పట్టుక కూర్చోమన్నారేమిటి?" మాట పూర్తి కాకుండానే—

"నోరుమ్ముయ్! వెనక నవ్వొకటావు! వెధవ ముఖమా అని! మంచీ మర్యాదా తెలియని మనుషులు!! ఎట్లా వెళ్తావంటే ఎటువెళ్తాడు? వాడి సంగతి నాకు తెలియదూ?"

"అయ్యో వాడికి శెలవులేందే"

మళ్ళా భార్యను వెక్కిరిస్తూ "శెలవులేక పోవట మేమిటే శెలవూ! మేష్టరుకు శెలవు లేకపోవడ మేమిటి!!"

సుందరమ్మగారికి కోపంవచ్చింది.

"అయితే నేనే పంపేశాను! సరా!" అంటూనే ఆమె విసురుగా లోనికి వెళ్లిపోయారు. వీర్రాజు గారు ఆమె వెళ్లినవంకే చూసి చూసి చివరకు ఉమవైపుతిరిగి 'ఇంతే' అంటూ పెదవి విరిచి కుర్చీలో చేరబడ్డాడు. ఉమమాటాడ లేదు. క్షణం ఊరుకుని పంతులుగారు మళ్ళా సరిగా కూర్చుంటూ ఆరంభించారు.

"మీ అన్న చూశావా ఏం చేశాడో! వాళ్లు సలక్షణంగా వచ్చి పిల్లను తీసుక వెళ్ళారు. అల్లుణ్ణి పిలిచారు. మళ్ళా పంపుగనుందర వాళ్ళ మామగారు ఉత్తరం వ్రాశారు. ఇన్ని చేస్తే ఈపంతులుగారికి మెదడులో మరేం పురుగు పుట్టిందో వెళ్ళను పొమ్మన్నాడు—" గొంతుక తగ్గిస్తూ "వాళ్ళమ్మ చెప్పింది, నేను చెప్పాను—చిలకకు బోధపరచినట్లు బోధపరిచాను! పెద్దవాళ్ల చేత చెప్పించాను! వెళ్ళకపోవడం—పైగా నాతో వచ్చి 'వాళ్లతో వీళ్లతో ఎందుకు చెప్తారూ?' అంటాడు!

"నువ్వు చెప్పు—" అని స్వరం హెచ్చిస్తూ "తప్పు పనిచేస్తే పెద్దవాళ్లచేత గడ్డిపెట్టించక ఊరుకుంటారా? ఇవాళ నేనూరుకుంటే వాళ్ల మామగారూరుకుంటారా?...చెప్పట్టుకు కొట్టించరూ?" క్షణమాగి.

"అయినా కాక పోయినా మరోకపంపుగ కాదాయెను. అందులో తొలిపండుగాయెను. వాళ్ళ మనస్సెంత క్షోభిస్తుందీ? తక్కినవాళ్ళమాట ఎలా ఉన్నా ఆపిల్లమనస్సెలా క్షోభిస్తుందీ?" అని మళ్ళా స్వరం ఉదాత్తంకు మారుతుండగా "ఇన్ని చెపుతే 'అ ఏమీ ఫరవాలే దంటాడు!!

పోనీ నాకు తెలియకుండా మీరూ మీరూ ఏమైనా మాటామాటా అనుకున్నార్రా అంటే అదీ లేదంటాడు. వా డబద్ధ మాడుతున్నాడేమోనని దాని నడిగితే అదీ నాకు తెలియదంటుంది. పిల్లలనడిగితే పిల్లలూ తెలియదంటారు. 'మరేమీ లేనప్పుడు ఈ గొడవంతా ఏమిట్రా' అంటే బెల్లంకొట్టిన రాయిలా మాటాడడు!'

వీర్రాజుగా రాగా రు. సుందరమ్మగారు ఎప్పుడు వచ్చిఉన్నారో కొంతసేపు మౌనంగా ఊరుకొని పిదప అన్నారు. ఆమె ముఖంలో కోప చిహ్నాలు కానవస్తున్నాయి.

"అయితే అవన్నీ దానికి తెలియవనే చెపుతున్నారేమిటి?"

కాని వీర్రాజుగారు లొంగిరాకుండా అంతకన్నా కోప్పడుతూ అన్నారు.

"తెలుస్తే చెప్పకూడనిదేమిటి ? కాదు! నాకు తెలియకడుగుతాను; తెలిస్తే చెప్పకూడదూ" అని క్షణమాగి "అంత పౌరుషం ఏడిచిన మొగాలు బుద్ధిగా మసలుకోవాలి. ఇవాళ నానోరు మూస్తావు. రేపు తక్కినవాళ్లనో రెలా మూస్తావ్"

సుందరమ్మగారు ఈ దెబ్బతో మాటాడకుండా అక్కణ్ణుంచి నిష్క్రమించారు.

౧౧

మరునాడుదయం ఉమ ఏకాంతంలో సుమిత్రను ప్రశ్నించింది. ఆ కిశోరి ఏమీ చిన్న పిల్ల కాదు. తన వయోనుగుణ్యంగా కొన్ని విషయాలు తెలిసినా తెలియనట్టు నటించేది, మోసం చేసే ఉద్దేశంతో కాదు. అట్టి విషయాలు తన కర్థం అవటం సిగ్గుచేటనే భయం చేత.

ఉమ ఎన్నో ప్రశ్నలు వేసి ఆమెనుండి తెలుసుకో గలిగిందల్లా భార్యాభర్తలు ఒకే గదిలో పడుకుం టున్నారనీ - ఒకసారి తల్లి కోడలితో ఏదో రహస్యంగా మాటాడిందనీ—

ఉమ అడిగింది. "వాళ్లేమి మాటాడుకుని ఉంటారే ?"

సుమిత్ర వెంటనే జవాబివ్వలేదు తర్వాత అంది.

"అదేమో అమ్మ పొమ్మనగానే నే నవతలికి వెళ్లిపోయాను."

పదమూడేళ్ల ఆడపిల్ల 'రహస్యం మాటాడుకుం టున్నాం పొమ్మని' అంటే బుద్ధిగా బయటకు వెళ్ళిపోయిందంటే నమ్మరాని విషయం. కనీసం ఉమ నమ్మదు. అందుచేత ఇంకొకలా ప్రశ్నించింది.

"బహుశా 'వాళ్లిద్దరూ పోట్లాడుకున్నారా !' అని అడిగి ఉంటుంది.'

"అయివుంటుంది."

సుమిత్ర ముఖం చూస్తే ఆమాట నిజంలానే అగపడింది. తర్వాతకూడా సుమిత్ర అదే బలపరచింది.

"అవును ఒకనాడు అమ్మా నాన్నా కూడా ఆ విషయమై మాట్లాడుకున్నారు." అని చప్పున ఊరుకుంది.

ఉమకూడా బలవంతపెట్టకుండా వదిలింది.

"ఏ విషయమై ?"

ప్రశ్న వేశాక తన తప్పు గ్రహించుకుంది సుమిత్ర. కథ అల్లసాగింది.

"రాత్రి నేను నిద్రపోతున్నాను. చిన్నమాగన్నా గావుంది. నాకు సరిగా జ్ఞాపకం లేదు—"

చివరకు ఉమ విసిగి ఆమెను విడిచి పుచ్చింది.

మధ్యాహ్నం అందరి భోజనాలూ అయాక సుందరమ్మగారు భోజనంవద్ద కూర్చున్నారు. ఉమ వడ్డిస్తోంది.

పనికాలం—మధ్యాహ్నం అయినా మసాబుగా ఉండడంచేత ఎండబాధ అట్టే లేదు. సుందరమ్మగారు పోమరిగా భోంచేస్తున్నారు.

కొంతసేపు పోయాక ఉమ అడిగింది—

"పిన్నీ నేనొకమాట అడుగుతాను నీకు కోపం రాదుకదా ?" అంది నెమ్మదిగా.

పరధ్యానంగా ఉన్న పిన్ని కూతురువంక తిరిగింది. ఆమె యింకా పూర్తిగా సావధానం కాలేదు. కాని స్వస్థతాదూరమైన ఉమ ఆరంభించేసింది.

"నువ్వూ ఆడపిల్లల్ని కన్నదానివి. ఒకత్తెను కాపురానికి పంపించావు. ఇవాళో రేపో యింకొకతె పెరుగుతుంది. ఇంకా పెళ్లకాల్సిన వారున్నారు. తల్లివై యుండీ యిలా చెయ్యడం ధర్మమా చెప్పూ ?"

ఉమ ప్రశ్న వేసి ఆగిపోయింది. ఉమమాటలూ, మాటలుకన్నా ధోరణీ నిశితములై సుందరమ్మగారికి తగిలి వచ్చాయి.

నిశ్చేష్టమై కళలు మార్చుకుంటున్న పిన్ని ముఖాన్ని చూడగానే ఉమ మళ్లా ధైర్యచ్యుతి కాసాగింది. అంది.

"నీదగ్గర ఉండే చనువు కొద్దీ నేనిలా అడుగుతున్నాను. నువ్వు కోపం తెచ్చుకుంటే చెప్పలేను"

కాని ఈ వాక్యాలు పిన్ని నేవిషంగానూ స్వస్థురాలను చేయలేక పోయాయి.

ఆమె కోపాన్ని దిగమ్రింగుతున్నట్టు ఒక గుటక వేసి అన్నారు.

"కోపం కాదమ్మా నీకలాతోచి ఉంటుంది. నువ్వని ఉంటావు ! దానికి కోపమెందుకూ ? కాని 'వాకప్పిడి' అని నిరూపించి అను !"

పిన్ని గొంతు వినగానే ఉమగొంతు పూడుక పోయింది. పిన్ని వెనుకటంతవాడిగానూ ఆరంభించింది.

"—నేను నిజంగా చెపుతున్నాను. దేవుడి ముఖం చూసి నలుగురుకట్టినయింటిక్రింద అన్నం తింటూచెపుతున్నాను. ఇందులో నాతప్పేమీ లేదు. ఉంటే నువ్వు వేసినవట్టు."

పిన్ని ఊరుకున్నారు.

అంతటా నిశ్శబ్దం, వాకిట్లో మెతుకులు తింటున్న రెండుకాకులు మాత్రం ఉండీ ఉడిగీ అరుస్తున్నాయి. ఉమముఖంలోని విహ్వలత చూచీ, తన కాఠిన్యానికి తానే సిగ్గుపడీ, సుందరమ్మగారు స్వస్థుల వటమే కాక కొంత్తగా పశ్చాత్తాపంకూడా పడసాగారు. ఉమ మౌనంగా ఉండటం చూసి అనునయిస్తున్నట్టన్నారు.

"నాకు మీరు ఒకటీ కోడలు ఒకటీకాదమ్మా! ఏ పదిమంది ఉన్నారనీ? నువ్వు దానినే అడిగి చూడూ, ఎప్పుడైనా ఎందులోనైనా పక్షపాతం చూపానేమో...ఎంత చెడ్డా మీ అమ్మకు చెల్లెల్ని కాదునకదా!"

సుందరమ్మగారు ఆగిపోయారు. మరికొంతసేపు పోయాక ఆమే అన్నారు.

"ఇంతకూ నీకు మాత్రం నాగుణం తెలియదు కనుకా!?

ఈసారి ఉమమాటాడ గలిగింది.

"నేను ఈశ్వరసాక్షిగా చెపుతున్నాను పిన్నీ! ఇందుకు నువ్వు కారకురాలవని కాదు, నా ఉద్దేశం. కీలకమంతా అన్నయ్య చేతులోనే ఉందని నాకు తెలుసు: అంతే కాదు, భగవంతుడు మేలుచేస్తే, అన్నయ్య ఇలా చేయటానికి కారణం కూడా తెలుసు. గాని నేననేది అన్నయ్యకు నువ్వెందుకు నచ్చచెప్పావు కాదని. ఒక వేళ చెప్పినా వినకపోతే నువ్వెందుకు స్వతంత్రించావు కావని? నువ్వు 'అలాకాదురా—' అని ఒక్క మాటంటే వాడు ఎదురు చెప్పగలడా?"

ఈసారి పిన్ని తలకదేరి మాటాడింది—

"ఆమాట నిజమే మరి. కాని నామాటకూడా నువ్వు విను. వాడి మనస్సుకు వ్యతిరేకమైన పని చేయడమంటే నా చేయాడదు. అది తప్పే అయి వుండవచ్చు. కాని ఏం చెయ్యను? నా మనస్సు నొవ్వకుండా వాడు మసలుకుంటున్నప్పుడు వాడి కిష్టంలేనిపని నన్నెలా చేయమన్నావో చెప్పు?"

పిన్ని ప్రశ్నవేసి అడిగింది. క్షణకాలం ఉమకి ఏమనటానికీ పాలుపోయింది కాదు. కొంతసేపు ఏమేమో మననం చేసుకొని అంది.

"—కాని పిన్నీ, ఆ పిల్లవల్ల ఏం తప్పుందో నాకింకా తెలియదు—ఆ పిల్లవల్ల తప్పం దనేటట్టు అయితే అది చుట్టాలూ పక్కాలూ ఊరూ వాడా తెలిసేటట్టు యిలా యింత బహిరంగ శిక్ష వేయడానికి తగివదయ్యుండదు!"

ఉమ తన జవాబుతోపాటు సూటిగా తన పినతల్లి కళ్లలోకి చూడసాగింది. సుందరమ్మగారు ఈజవాబు అర్థం చేసుకోటానికి కొంతకాలం తీసుకొన్నారు. అర్థ మవగానే ఆమె మరి మాటాడలేకపోయారు. ఉమ మళ్లా అంది.

"ఒక వేళ అది అంతగొప్ప నేరమే అను. అయినా అది చేసినది అర్థం శుర్థం ఎరుగని బిడ్డ. అట్టి బిడ్డమీద ఇంత కఠినత్వం పూనటం తగునంటావా? తగునవే అను— అయితే అది నీవంటిదానికీ వాడి వంటి వాళ్లకూకూడా తగునంటావా?"

ఉమ మాటలు ఒక్కొక్కటి ఒక్కొక్క అస్త్రమై చివరివాక్యం సమ్మోహనాస్త్రంకాగా సుందరమ్మగారు అప్రతిభులై ఊరుకున్నారు. ఉమ కూడా కొంతసేపలానే ఊరుకుని తిరిగి కన్నీటిని చీర చెరుగుతో అద్దుకొని దుఃఖాన్ని దిగమ్రింగుతూ.

"అది నాఆడబడుచుకాదు పిన్నీ! కూతురు" అంది కంపించే గొంతుతో.

సుందరమ్మగారు కరిగిపోయిన గుండెతో అన్నారు.

"నేను నిజంగా చెపుతున్నానమ్మా, నే నింత అనుకోలేదు! ఇందులో అబద్ధం ఏమైనావుంటే నువ్వు వేసినవట్టు! ఏదో పండుగకు అలిగివెళ్లడం మానేకాడంటే మానేకాడనే అనుకున్నాను. కానీ ఇందులో ఇంతగొడవ వుందని నేనేమాత్రం ఊహించినా ఇలా చెయ్యను. నేనే కాదు వాడైనా ఇలా

చేసి ఉండరు. ఒకవేళ చేసినా—నిజంగా చెపుతు న్నాను—నేను స్వతంత్రించి ఉండను"

ఉమ జవాబివ్వలేదు. పిన్ని కూడా మరేమీ మాటాడలేదు. వాకిట్లో ఎంగిళ్లు ఏరుకుంటున్న కాకులు కూడా ఎప్పు డెగిరి పోయాయో. ఎగిరి పోయాయి. మబ్బు విడిచిందేమో ఒక్కసారి మధ్యాహ్నపు ఎండ కనులు మిరుమిట్లు గొలుపుతోంది. దూరాన చెట్టుపై కాకి అరుస్తున్నట్టుంది. ఉమ పినతల్లి వంక దృష్టి తిప్పుతూ అంది.

"తప్పున్నప్పుడు శిక్షించవచ్చు పిన్నీ. కాని ఆడపిల్లను పుట్టింట ఉంచి శిక్షించడం కూడదు. నీ యింటికి తెచ్చి ఏమైనా చెయ్—కాదనను."

పినతల్లి ఏమీ జవాబివ్వలేదు. కొంతసేపువరకూ ఎవరూ మాటాడలేదు. తర్వాత సుందరమ్మగారే లేరు కాని తొందరగా భోజనం ముగించసాగారు.

## ౧౨

నాల్గవనాడు పగలు పది గంటలకల్లా జానకి అత్త వెనుకబండి దిగింది.

ఆనాటి మధ్యాహ్నపు ఉమతోటి సంభాష ణతో సుందరమ్మగారు పశ్చాత్తప్తులై మర్నాడే కోడలిని తీసుకురావడానికి ప్రయాణమయ్యారు. బండి ఎక్కుతూ ఎక్కుతూ మళ్లా అన్నారు.

"సరే. ఎందుకైనా కీడెంచి మేలెంచడంమంచిది' వాళు లేనప్పుడు నీమాట మీద నేను బయలుదేరు తున్నాను. ఒకవేళ ఎందుచేతనైనా వాళ్లు ఇప్పుడు పిల్లను పంపటానికి కాదంటారనుకో ఏం చెయ్యి మన్నావ్!!

ఉమ అంది—

"నీకా సందేహమేలపిన్నీ! దైవికమైన ఆటంక మేదైనావస్తే చెప్పలేను. లేకపోతే తప్పక పంపు తారు. అలా జరగనప్పుడు మామగారితోగాని ఆయన లేకపోతే జానకితోగాని నేనిక్కడున్నానని చెప్పు. జానకి నీవెంటవచ్చి తీరుతుంది. కానినువ్వువెళ్తున్నది నీకోడల్ని తీసుకరావడానికి. ఆమాటమాత్రం మరిచి పోకు"

పిన్ని నవ్వుతూ బండి ఎక్కింది. బండి అరవై గజాలు పోయింది. ఉమ లోనికి పోతున్నదల్లా వెను తిరిగి మనిషిని పంపి, బండి ఆపించి తను దగ్గరకు వెళ్లాక అంది.

"నేనిక్కడ ఉన్నానన్న విషయం అనవస రంగా చెప్పకు"

పిన్ని విచిత్రంగా చూస్తూ అంది.

"అదేమిటే ఇప్పుడు చెప్పమన్నావు ?"

"అవసరమైతేనే చెప్పు, లేకపోతే ఊరుకో." పిన్ని ఇంకా బోధపడక అంది.

"నన్ను అబద్ధం ఆడమన్నావా ?"

ఉమనవ్వుతూ—

"నేనలా చెప్పలేదే, నిజం చెప్పవద్దన్నాను." అంటూ తనస్థానంనుంచి కదలలేదు. పిన్ని మళ్ళా అంది.

"చెపితే వచ్చే నష్టమేమిటే ?"

ఈసారి ఉమ సరిగా జవాబిచ్చింది.

"ఇది అని చెప్పలేను. అలా అనటానికో కారణం ఉంది. అది యిప్పుడు చెప్పటానికి అవ కాశంలేదు."

సుందరమ్మగారు మరికాస్త సేపు ఆలోచించి "సరే" అంటూ బండితోలించారు.

ఉమచెప్పినట్టే మూడోనాటికల్లా కోడలితో తిరిగివచ్చారు.

వారు వచ్చిన అరగంటకు పొలంనుండి పిచ్చి రాజుగారు వచ్చి కోడలిరాక వింటూనే లోనికి వెళ్లి "ఏమమ్మా వచ్చేశావా...ఇన్నాళ్లు చేసేశావేం..." అంటూ అక్కడి వారందరి యోగక్షేమాలూ పైపైవాల వారిగా అడిగి తెల్సుకొని "...నీ మొగుడు చూశావా వారం రోజులై వెళ్లిపోయాడు. అక్కడ కవితా సభలో ఏవో జరుగుతున్నాయట, నేటివరకూ ఉత్తరం లేదు..."అంటూ కోడలు సిగ్గుతో తలవంచుకోవటం గమనించి అక్కడనుంచి వెళ్లిపోయాడు.

మధ్యాహ్నం భోజనాలయ్యాక ముసలాళ్లిద్దరూ నిద్రపోతున్నారు. పిల్లలంతా చదువుకునే వాళ్లు చదువుకుంటుంటే ఆడుకొనేవారు ఆడుకుం టున్నారు. సుమిత్ర ఆపూటపాఠానికి ఎగనామంపెట్టి వదినగారివెంట పడింది.

ఉమా జానకీ సుమిత్రా రాజశేఖరం గదిలో ప్రవేశించారు.

గదిలో దక్షిణపు గవాక్షంవద్ద ఎత్తైన పరుపులతో పరిశుభ్రమైన దుప్పటంతో పూర్వకాలపు నగిషీ పనితోడి పందిరి మహాలు మంచం ఉంటుంది. ఈశాన్యమూలను ఒక టేబిలూ, కుర్చీ. వాని ననుసరించే పెద్ద బీర్వా ఉన్నాయి. టేబిల్ మీద పుస్తకాల అరలో తరుచు ఉపయోగంలోఉండే పుస్తకాలు పేర్చబడ్డాయి. టేబిల్ మీద—ఓ వంకగా వ్రాత పరికరాలు అమర్చబడి ఉన్నాయి. మంచం కెదురుగా ఉన్న గోడను ఎత్తైన నిలువుటద్దం. పరపనే బట్టల స్టేండూ, గోడలను అన్ని తెగలకు చెందిన చిత్రపటాలూ కానవస్తాయి.

ఉమ వస్తూనే పుస్తకాల అరలోంచి ఒక పుస్తకం ఎంచుకొని అక్కడే ఉన్న కుర్చీలో కూర్చుంది.

జానకి కొంతసేపు ద్వారం దగ్గిరే నిలువబడి తర్వాత మంచంప్రక్కనున్న పడకకుర్చీలో కూర్చుని దిక్కులు చూడసాగింది. సుమిత్ర కొంతసేపు పుస్తకాలు తిరగవేసీ, నిలువుటద్దంలో నీడ చూచుకుంటూనూ, పటాలవంక చూస్తూనూ కాలం గడపసాగింది. అసలు సంగతి అక్కా వదినా ఏమైనా శాతాఖానీ వేస్తారేమో విందామని వచ్చింది. వాళ్లింకొకలా ఉండేసరికి కొంతసే పయ్యాక అక్కడ్డించి కదిలి వెళ్లిపోయింది.

పావుగంట తర్వాత ఉమ అకస్మాత్తుగా పుస్తకం ప్రక్కను పెడుతూ అడిగింది.

"నే నిక్కడ ఉన్నానని పిన్ని యింటిదగ్గర చెప్పిందా ?"

జానకి తల ఊపుతూ,

"ఊఁహూఁ. నాకైనా త్రోవలో ఎదో మాటల్లో చెప్పారు..." అని క్షణమాగి "తర్వాత ఇంటిదగ్గర ఏమైనా గొడవ జరిగిందా అని అడిగారు."

తర్వాత సంగతి జానకి చెప్పలేదు. ఉమ కూడా కాస్త ఊరుకొని అడిగింది.

"నువ్వేం చెప్పావ్ ?"

"నే నూరుకున్నాను. ఆమె ఏమనుకున్నారో మళ్ళా అడగలేదు."

ఉమ కొంతసేపటివరకూ మళ్లా ఏమీ ప్రశ్నించలేదు. ఆ జ్ఞాపకాలూ అమానం ఇద్దరికీ చాలా యిబ్బందిగా ఉంది. ముఖ్యంగా జానకికి. పోనీ మాటాడదామంటే ఏం మాటాడాలో తెలియదు. చివరకు తన కెప్పుడో కలిగిన ఒకసందేహం జ్ఞాపకంరాగా దానిని కదలు చొచ్చింది:

"వదినా! ఇంగ్లీషు చదువువల్ల లాభం ఉన్నా లేకపోయినా నష్టం ఉందా?"

జానకి ప్రశ్నించి ఊరుకుంది. కొంతసేపటివరకూ ఉమవినిన జాడే కానరాలేదు. తర్వాత ఉమ అంది.

"దానికి నేను సూటిగా జవాబివ్వలేనమ్మా?" అని కాస్తసేపాగి "పన్నెండేళ్ల క్రిందట నేను థరుఫారం చదువుతుండేదాన్ని. మీఆయనకూడా అప్పుడు మాయింటే ఉండి చదువు కుంటుండేవాడు. వాడు కూడా అప్పుడు అతరగతే. మాకు రామనారాయణగారని ఒక మేష్టరుగారుండేవారు. ఆయనసంగతి చెప్పాలంటే చాలా ఉంటుంది. ఆయన మాకు చరిత్రపాఠం చెప్పేవారు. ఆయనకు సుడ్డైద్దు చేనుమేలంటే తగని మంట. ఆయన ఒకసారి ఏదో చెపుతూ అన్నారు.

"ఇంగ్లీషు చదువులకు ఇలా భూములమ్మీ, పుస్త్రెలమ్మీ ఎగబడుతున్నారు—ఏలా?" అన్నారు.

ఆయనసేది ఇదీ—ఉద్యోగం కోసరం తప్పిస్తే ఇంగ్లీషు చదువు ప్రయోజన రహితమని. అందుచేత ఉద్యోగం అవసరంలేనివారు ఇంగ్లీషు చదవటంవల్ల ఉపయోగం లేకపోవడమే కాక జాతికి అది ద్రోహమని."

జానకికి వదిన జవాబుపై అనేక సందేహాలు బయలుదేరాయి. కాని ఆమెనోరు తెరచి అడగకుండా గ్రహించి తీర్చబాధ్యత తన మౌనంద్వారా ఉమపై విడిచి ఊరుకుంది.

"ప్రతిజాతికీ ఒకభాషా, ఒక సంస్కృతీ ఉంటాయి. మన భాషనూ, మన సంస్కృతినీ వ్యాప్తిలో ఉంచవలసిన బాధ్యత మన అందరిమీదా ఉంటుంది. దానిని అశ్రద్ధచేసి పరాయివానిని పోషించటం ఎంతచేయదగిన పనో, మీరే చెప్పండి' అంటారాయన."

ఉమ ఆగిపోయింది. జానకి యుక్తి ప్రయుక్తులాలోచిస్తోంది. ఉమఅంది.

"మీా ఆయన ఆయూ డాది చదువుమానివేయ టానికి ఆచంట్టరుగారి ఉపన్యాసాలు ఒక కారణం ఇంక నేను మానివేయడానికి కారణం మీా ఆయన"

ఉమ ఎందుకో నవ్వింది. జానకి కొంతసేపు ఊరుకుని అడిగింది.

"మరినువ్వు సంస్కృతం చదువుకోలేదేం?"

"అయ్యో ఆదీ ఒక ఆరుమాసాలు వెలిగించాను. తర్వాత మీా ఆయన ఆ ఊరు విడవటంతో ఆగిపోయింది."

మళ్లా కొంతసేపటివరకూ ఎవరూ మాటాడలేదు. జానకి మరొక ప్రశ్న వేసింది. "కాని మన చదువులో ఇప్పటి ప్రపంచానికి సంబంధించిన జ్ఞానం ఉంటుందా ?"

ఉమ వెంటనే జవా బివ్వలేకపోయింది. తర్వాతైనా—"జీవితానికి అవసరమైన ప్రపంచజ్ఞానం ఇంగ్లీషు చదువుకోక పోయినా తెలుగులో వ్రాయబడిన ఈనాటి గ్రంథాలమూలంగా నే తెలుసుకోవచ్చు......"

ఉమ ఆగిపోయింది. ఇద్దరూ ఏమేమో ఆలోచిస్తూ అలా చెరో కుర్చీలోనూ కూర్చున్నారు.

ఉమ ఆలోచించి ఆలోచించి అంది.

"విజ్ఞానం బహుముఖం. ఏ ఒక్కరూ అన్ని రంగాలలోనూ విజ్ఞానం సంపాదించలేరు. ఏకోతమకు సాధ్యమైనదానిలో నే—లేక ఇష్టమైన దానిలో నే సంపాదించగలుగుతారు. ప్రతి రంగానికీ సమానమైన గౌరవమే ఉంటుంది. కాని జనాభిమానం ఎక్కువగా పొందేదే ఉన్నతమైనదని అనుకుంటాం. ఇంగ్లీషు చదువుకుంటేనేగాని విజ్ఞానం సంస్కృతీ లభించవని చాలామంది నమ్మకం. అసలు చదువుకీ, వాటికీ సంబంధంలేదు. ఉన్నకొ స్తలో నైనా వాటిని సంపాదించటానికి ఇంగ్లీషే చదువుకొని ఉండనక్కరలేదు. ఎందుచేతంటే అవి భాష నేర్చుకొనే తరగతి పాఠాలలో లభింపవు. ఆ భాషలోని ఉద్గ్రంథాలు చదవటం వలన లభిస్తాయి. ఉద్గ్రంథాలు ప్రతి భాషలోనూ ఉంటాయి. ఎందులో ఉన్నా, లేక పోయినా మనభాషలో చాలా ఉన్నాయి. అందుచేత సంస్కృతి, విజ్ఞానాల కోసరం మనం ఇంగ్లీషే చదవనక్కరలేదు.

ఉమ ఆగిపోయింది. తను చెప్పింది జానకికి అర్థమయిందో లేదో గాని ఆమె మాత్రం చాలా శ్రద్ధగా వింది.

కొంతసేపు పోయాక ఉమ అడిగింది.

"అసలు నీకిట్టి సందేహం ఏల కలిగింది?"

జానకి కొంతసేపు ఏమీా లేదంటూ కారణం చెప్పకుండా తప్పుకోటానికి ప్రయత్నించింది. కాని ఉమ బలవంతం మీాద చెప్పక తప్పిందికాదు.

"సుమిత్ర సరదాపడి నాలుగుసార్లు ఇంగ్లీషక్షరాలు నేర్చుకుంది. తర్వాత...తర్వాత మానేసింది."

ఉమ ఆ రెండు 'తర్వాత' లమధ్య ఏర్పడిన గండికి కారణం సులభంగా నే ఊహించుకోవటంచేత మౌనంగా ఊరుకుంది.

## ౧౩

ఉమా, జానకీ దొడ్లో స్నానాలు చేస్తున్నారు. సుమిత్ర పరుగెత్తుకుంటూవచ్చి రాజశేఖరం ఆగమనాన్ని తెల్పింది. దగ్గరలో వున్న ఉమ కూతురు సరస్వతి 'మామయ్యొచ్చాడ్ మామయ్యొచ్చాడ్' అంటూ పరుగెత్తింది. ఉమ మరదలి వంకచూచి ఆమెనుండెలు కొట్టుకోవటం దూరంనుంచే వింది.

స్నానాలయాక కూడా జానకి వెనుకటింటే ఉండిపోయింది. ఉమమాత్రం తల నూనె సీసాకోసరం లోనికి వచ్చింది.

రాజశేఖరం వట్టింట మంచంమీాద కూర్చుని తల్లితో మాటాడుతున్నాడు. పిల్లలు అతడు తెచ్చిన మిఠాయి పంచుక తింటున్నారు.

ఉమ ముఖాన గంభీర ముద్రతో ఈ వంకా ఆవంకా చూడకుండా తిన్నగా లోనికి వెళ్లిపోతోంది. కృతజ్ఞురాలైన ఉమ కూతురు 'అమ్మా మామయ్యొ' అని ఆమె కర్తవ్యాన్ని జ్ఞాపకం చేసింది కూడా. అయినా ఉమ వినిపించుకో లేదు. రాజశేఖరం ఆమె ననుసరించే కొంతసేపు చూచి తరువాత చూపులు భూమివంక త్రిప్పుకున్నాడు.

అచిరకాలంలో నే ఉమ చేతిలో సీసాదువ్వెనా అద్దాలతో, తిరిగి వారి మధ్యనుండి పోతోంది.

సుందరమ్మగారు తమాషా చూస్తున్నప్పటివలె చిరునవ్వుతో చూస్తూ గడ్డంచుట్టూ మునివేళ్లు చేర్చి

తలకాస్తగా ఊపుతూ 'ఏంజాణతనమే మాఅమ్మ' అంది స్వగతంలో.

ఉమ కళ్లెం వేసినట్టు ఆగి కుటిలభ్రుకుటితో పోట్లాటకు పోయేదానిలా మీది మీదికి పోతూ "ఏం అమ్మా? ఏం చూశావు నాజాణతనం? చెపుదూ కాస్త!" అంది తల తాటిస్తూ.

సుందరమ్మగారు కోపం నటించటం చేత కాక పోగా నవ్వుకూడా దాచుకో లేకుండా—

"జాణతనం కాదుటే? వాడు నీమీద కోపగించవలసిందిపోయి, ఎదురు నువ్వు వాడిమీద కోపం చూపిస్తున్నావ్?" అన్నారు.

"కోపం? ఎవరిమీద? ఎందుకూ? ఏం చేశానమ్మా?"

సుందరమ్మ నిరుత్తరరై కొడుకు వంక తిరిగి అన్నారు.

"చూశావురా దీని ఆగడం!"

కొడుకు చూస్తూనే ఉన్నాడు. ఇంకో అప్పుడైతే తల్లి కోరకుండానే ఆమెకు అడ్డు పడేవాడు కూడా. కాని ఆనాడు తల్లినోరు విడిచి అడిగినా అతడు సహాయ నిరాకారణం చేస్తూ ఊరుకున్నాడు. ఆమౌనానికర్థం తల్లీకూతుళ్లిద్దరికీ అర్థమయ్యింది కూడా. అయినా ఉమ ధైర్యం వహించి అంది.

'ఆగడం నాది కాదు పిన్నీ. ఆ మాటకు అర్థం తెలియక నువ్వంటున్నావు. ఆగడం అత్యాచారం అంటే ఏమిటో ఆ పండితుణ్ణడుగు చెపుతాడు'

ఇలా అంటూనే ఆమె పెరటిలోనికి వెళ్లిపోయింది.

రాజశేఖరానికీ, ఉమకీ వయస్సులో ఒక్క సంవత్సరమే తేడా. ఉమ చిన్నదే అయినా రాజశేఖరాన్నేనాడు గౌరవించి ఎరుగదు. చిన్నప్పుడు పోట్లాటల్లో చాలకపోతే నోటికి వచ్చినట్లు తిట్టి సాధించేది. రాజశేఖరం కూడా మించి వచ్చినప్పుడు మాట్లాడ్డం మానేసి సాధించేవాడు. సుందరమ్మగారా పాతికేండ్లలో ఇట్టి పోట్లాటలెన్నో చూశారు. కాని ఆమె ఎన్నడూ భయపడ లేదు. ఇవాళ మాత్రం ఆమెకు ఎందుకో జంకు వేసింది.

మాధ్యాహ్నిక భోజనాలు పరిసమాప్తి కాగానే ఉమ నిద్రపోవటానికి ప్రయత్నించింది. కాని ఆమె అస్వస్థచిత్తం నిద్రపోనిచ్చిందికాదు. కొంతసేపు ఇటూఅటూ దొర్లి చివరకు లేచి రాజశేఖరం గది లోకి వెళ్లింది.

రాజశేఖరం నిద్రపోవటంలేదు.

ఉమ వెళ్లి మాటాపలుకూ లేకుండా టేబిల్ వద్ద కుర్చీలో కూర్చుంది. చివరకు రాజశేఖరమే మాట్లాడాడు.

"దొడ్డమ్మవాళ్లూ క్షేమమా?"

"నీదయవల్ల"

అంతే. మళ్లా కొంతసేపటి వరకూ ఎవరూ మాటాడలేదు. రాజశేఖరం ఎదురుగా తెల్లనిగోడ మీద దారితప్పి తిరుగుతున్న ఎర్రచీమవంక చూస్తూ ఉంటే ఉమకుడిచేతి బొటనవ్రేలిగోరును తీరుగా కొరుకుతోంది.

చివరకి ఉండిఉండి ఉమ అడిగింది.

"అవునయ్యా, నీకేంహక్కు ఉందని అట్టి ఆజ్ఞ వేశావ్?"

రాజశేఖరం నెమ్మదిగా అడిగాడు. అతని గొంతు బహుశాంతంగా ఉంది. "ఎట్టిఆజ్ఞ"

"ఆమెను నువ్వు చెప్పేవరకూ తీసుకరావద్దని."

రాజశేఖరం క్షణకాలం తాళి అన్నాడు. అతనిచూపు ఉమవంకకాక ఎక్కడో ఉంది. అన్నాడు.

"అవును అందులో తప్పేముందీ?" ఉమస్వరం హెచ్చించి అంది—

"ఆమె తన యింటికి రావడానికి, నీఅనుజ్ఞ ఏమిటయ్యా వేషం కానీ!"

రాజశేఖరాన్ని ఏమాటనొవ్వ చేసిందో ఏమో— వికలితప్రసన్నుడై ఉమవంక చూస్తూ నిశితస్వరంతో అన్నాడు.

"ఇది ఆమెయిల్లే. అయితే ఆమెఇంటి కామెను పిలవటం ఏలా?" ఉమకొంతకాలం వరకూమాటాడ లేకపోయింది. ఎంతకాలం వరకూ అంటే రాజశేఖరం కండ్లలో మళ్లాశాంతం కానవచ్చేదాకా. అప్పుడంది.

"అయితే, యిది ఆమెయిల్లు కాదంటావా?"

"అవునూ కాదూ అంటున్నది నేకాదు"

ఉమ అంతరాంతరంలో కీమాట ప్రవేశించే సరికి గిక్కురుమంది. క్షణకాలం ఊరుకుంది. పిదప హీనస్వరంతో అడిగింది.

"ఇంకొకరు మాత్రం అంటూన్నారా?"

రాజశేఖరం వెంటనే జవాబివ్వలేదు. అత డబద్ధం ఆడలేదు. అందుచేత ధర్మరాజు చూపిన మార్గాన పోయాడు—

"నోటితో అనలేదు." ఉమకెందుకో కోపం వచ్చింది. తీక్షణంగా అంది.

"నువ్వు సర్వాంతర్యామివా— మనోగతాలు తెల్సుకోవటానికి?"

కానిరాజశేఖరం చలించకుండా అన్నాడు

"అమాత్రపుపనికి సర్వాంతర్యామి కానక్కర లేదు. అవిషయ మటుఉంచు. మనోగతాలు తెల్సుకోవడానికి వాక్కు తప్ప ఇంకొక నమ్మదగ్గ సాక్షి లేనట్టు మాటాడుతున్నావు. అదిపొరపాటు. మనుష్యులు బట్టకట్టనిస్థితిలో వారిమనోగతి విషయాలు వారి వాక్కు ద్వారా తెలుసుకోవచ్చు. అదే ఆధారం కూడా. కాని బట్టకట్టి తిరిగేవారు తమనగ్న శరీరాలను కప్పేబట్టలు లానే వాక్కును తమమనస్సులను దాచ డానికి మాత్రమే ఉపయోగిస్తారు. అందుచేత మనుష్యుల మనోగతాలు తెల్సుకోవటానికి నువ్వన్నట్టు నోటితో చెప్పిన దానిని నమ్మటం, మార్గమే కాదు."

రాజశేఖరం ఆగిపోయాడు.

ఇప్పుడు ఉమ ఇరుకునపడింది. సంగతేమంటే ఆమె ఈ అతిలోకదంపతుల నడుమ కలతకు కారణా న్నూహించటంలో ఇంతవరకూ తానుతప్పదారే పడు తూవచ్చినట్టు రాజశేఖరం మాటలతో ఆమెకు సందే హంకలిగింది. అందుచేత ఏమాటంటే కథ ఎటునుండి ఎటుతిరుగుతుందో అనే భయంపట్టుకుంది. ఏతావాతా ఆమె మౌనం వహించి వినసాగింది.

రాజశేఖరం ఎక్కడికో చూస్తూచెప్పసాగాడు— "జీవుల మీద పరిసరప్రాబల్యం అమోఘమైనది. ఒక విధమైన పరిసరాలకు అలవాటుపడ్డవారు— విభిన్న మైన పరిసరాల్లో సుఖజీవనం సాగించలేరు.

నువ్వు హంసబకోపాఖ్యానం వినే ఉంటావు. మానససరోవరం నుండి దారితప్పి తిరుగుతున్న హంసను చూచి కొంగలు అడిగాయట 'ఎవరయ్యా నువ్వు' అని. హంసచెప్పింది. ఎక్కణ్ణుండి వస్తున్నావన్నాయి. దానికిజవాబిచ్చింది. మానససరోవరంలో ఏందొరుకుతాయన్నాయి. 'బంగారు తామరలూ మంచి ముత్యాలూ' అంది. కొంగలు వినిపించు కోకుండా 'నత్తగుల్లలు దొరకవా' అన్నాయి. హంస 'అవేమిటో నాకు తెలియవంది' కొంగలు మానససరో వరంయొక్క దారిద్ర్యానికీ అట్టిచోట నివాసంచేసే హంస దౌర్భాగ్యానికీ పకపక నవ్వాయట."

ఉమ ఈ ఒక్క ఉపమానంతో సర్వం అర్థం చేసుకుంది. అయినా ఆమె మరికొంత తెలుసుకునే వరకూ ఏమీ మాటాడదల్చుకోలేదు. కొంతసేపుండి రాజశేఖరమే మళ్లా ఆరంభించాడు.

"ఒకవేళ నువ్వు బకపక్షపాతివి— కాదంటే న్యాయపక్షపాతివే అను— అయితే ఒకప్రశ్న వేయ వచ్చు. నత్తగుల్లలకన్నా మంచిముత్యాల ఉత్కృష్టత నీకూ నాకూగాని కొంగకేముంది. అది నిజమే. అందు చేతే నేనంటాను "నత్తగుల్లలకన్నా మంచిముత్యాలు ఉత్కృష్టమైనవి ఎట్లాకావో, అట్లానే నత్తగుల్లలూ మంచిముత్యాలకన్నా ఉత్కృష్టమైనవికావు!"

రాజశేఖరం ఆగాడు. ఉమకు పరిస్థితి పూర్తిగా అర్థమయ్యిందేమో నోరువిప్పింది—

"—అని నాకుబోధించి ఏంలాభం."

రాజశేఖరం నిరుత్తరుడై ఊరుకున్నాడు. కొంతసేపు ఇరువురూ నిశ్శబ్దంగా ఉన్న పిదప ఉమఅంది—

"కొంగకు నవ్వటం వచ్చునా?"

రాజశేఖరం జవాబివ్వలేదు. ఉమ ఏదో అన బోతుంటే అప్పుడన్నాడు.

"నవ్వటమంటే నోరుతెరిచి హహా హహా అన్నదే నవ్వు కాదు."

ఈ సారి ఉమ జవాబివ్వలేదు. ఆమె తన వంక చూడని రాజశేఖరం ముఖంలోకి చూసిచూసి అంది—

"అన్నయ్య కాబోలు ఒకప్పుడు నాకోవిషయం గూర్చి బోధిస్తూ అన్నాడు—" అని అతడు సాగ

ధానుడైన పిదపపూర్తి చేసింది "—ఆత్మన్యూనతా శంకచే (Inferiority Complex) బాధపడే వాళ్లు ప్రతిస్వల్ప విషయానికి విచక్షణాశూన్యంగా ఉద్రేకాను హింసించుకుంటారు— అన్నాడు. దానికి నేను యింకోమాట చేరుస్తాను. 'అంతేకాదు ఎదుటి వాళ్ళను కూడా హింసిస్తారు"

ఇలా అంటూనే ఆమె లేచి బయటికి వెళ్లిపోయింది. రాజశేఖరం అలా చూస్తూ ఊరుకున్నాడు.

## ౧౪

మరునాడుదయమల్లా రాజశేఖరం తనగదిలోనే ఉన్నాడు. రోజూ ఏదో పుస్తకం తీసిచదివేవాడు. కాని ఆవాళఅదీలేదు. పదిగంటలప్పుడు ఉమమళ్లా వచ్చి టేబిల్ వద్ద కుర్చీలోకూర్చుంది. రాజశేఖరం ఒకసారి ఆమెవంక చూడటం మాత్రంచూశాడు. అయితే ఆ చూపులో ఆవాహనాలేదు, విసర్జన అంత కన్నా లేదు.

ఉమ వేనినీ లక్ష్యపెట్టకుండా ఆరంభించింది.

"అవునయ్యా కొంగలు నవ్వాయి! అలానే అంగీకరిస్తాను. అయితే అదివాటి అజ్ఞానాన్ని తెలియ చేస్తుంది. కానిహంస ఆ నవ్వుచే గాయపడి కొంగలపై కోపం తెచ్చుకున్నా, వాని నసహ్యించు కున్నా లేక మీ నత్తసుల్లలకన్నా నామంచిముత్యాలు ఎట్లాహీన మైనవని పోట్లాటకుదిగినా—దీనిసంస్కారమేదీమరి!"

ఉమ జవాబుకోసరం ఆగింది. కాని రాజు మాటాడక పోయేసరికి మరొక ప్రశ్న వేసింది—

"అంతేకాదు వీటితో నాకేమనిఊరుకోవటం కూడా హంస అసమర్థతతోపాటు కర్తవ్యాన్నుపేక్షించటం తెలియచేస్తుంది."

ఉమ ఆగింది. కొంతసేపుపోయాక మళ్లా ఏదో అనబోతోంది. అది గమనించి రాజశేఖరం వ్యంగ్య స్ఫురద్దరహాసంతో ఆమెవంకచూస్తూ అడిగాడు.

"అయితే యీ యుక్తులన్నీ ఆలోచించటానికి ఒకరాత్రీ ఒకపగలూ పట్టిందా?"

"లేదు లేదు... నెల్లాళ్లూ... ఏ కాలంగా మదుత కుర్చీలోపడి ఆలోచిస్తేనే గాని స్ఫురించలేదు."

ఉమఅకస్మాత్తుగా రోషాసక్త కాసాగింది మొదట జవాబు ఆరంభించేసరికి ఏమీ లేదు, బొక్కక్క మాటే అంటుంటే రోషం పెరుగసాగింది.

"నీకు ఆడవాళ్లంటే ఉంటూవచ్చిన చులకన భావం యింకాపోలేదు. నీమాటల్లో నీ ప్రతివాక్యంలో అదే కానవస్తుంది. నీవేదో గొప్పపండితుడవనుకుంటు న్నావ్. నలుగురూ ఉత్తముడనేసరికి అందరూ నీ కంటికిహీనంగా కానవస్తున్నారు. నిజానికి నీవంటి మూర్ఖుడు ఇంకొకడులేడు." అనిక్షణమాగి—

"నువ్వుచదువుకున్నావనే అనుకున్నాను కాని నీ గ్రంథపుచదువు నిన్నిలా గ్రంథసుణ్ణి చేసివిడుస్తుందనుకోలేదు—" అంటూనే అకస్మాత్తుగా ఆవరించే కోపంతో "ఆమెవల్ల ఏం నేరముందని ఇలాశిక్షిస్తావూ? మగవాడ వనికదా..." అంటూ అక్కడనుండి పిడుగులుమియసాగింది—

"ఆమెవల్ల తప్పంటే భరించవలసిందెవరూ? నీ భర్తృత్వానికి అర్థమేమిటి?

ఆమెనుపుట్టినింట దిగవిడచీ, వారుమర్యాదగా పండుక్కి పిలుస్తేవెళ్లకపోయీ— ఆమెనూ, వారినీ బాగుచేస్తావా? ఇదేనా నీ తెలివితేటలు? నీకు తెలియకపోతే పెద్దవాళ్లుచెప్పేదైనా వినవద్దూ. నాన్నగారిమాటను కాదనడానికి నీకుగుండెలెలా వచ్చాయి? నీకా అహంభావం ఏలా? ఏమిచూచి".

అని అదత్తప్రతివచనరై,

"ఒకవేళ నీకొకఉద్దేశం ఉండవచ్చు—నీకున్న మడిమాన్యాలుచూచి— నీకుపిల్లనిచ్చా మనుకుంటున్నావేమో. మేమైనా అంతగతిమాలిలేము. నీకుపిల్లనిచ్చింది డబ్బుచూచికాదు. నీ యింటిమర్యాదచూచి పిన్నిమొహంచూచి, నువ్విట్టి పండితుడవు కాకముందు నీ వ్యక్తిత్వాన్నిచూచి. ముఖ్యంగా నువ్వింతనీచుడివైనా యింకాచావని నీమీద నా మమకారంచేతా."

ఇలాఅంటూనే ఆమె తనకన్నీళ్లు దాచుకొనటానికి గిరుక్కున వెనుతిరిగి తొందరగావెళ్ళిపోబోయింది. ఉమఉన్నతస్వరం విని వచ్చి ద్వారందగ్గర నిలచిఉన్న సుమిత్రా, మరికాస్త ఎడాన ఉన్న జానికీ, ఒరిగి దారిచ్చారు.

నిస్తేజములైన కండ్లతో ఉమనెంటనే చూస్తూ ఉన్న రాజశేఖరం కండ్లు క్షణకాలం జానకి భీతిలో

చసాలతో కలుసుకున్నాయి. తర్వాత జానకికూడా అక్కణ్ణుంచి వెళ్లిపోయింది.

రాజశేఖరం అపూటట్లా పడకకుర్చీలోంచి లేవకుండానే గడిపాడు. అతని ఎదుటఉన్న ప్రశ్న ఒక్కటే. ఉమ కంతకోపం తెప్పించేమాట తానే మన్నానా అని. కాని ఉమ వాక్ప్రహరణాలకు దిమ్మెక్కి ఊరుకున్న తలలోంచి గతంలోని ఒక్క జ్ఞాపకాన్నికూడా బయటికి తీయలేకపోయాడు.

మధ్యాహ్నం భోజనమయ్యాకకూడా అత నలానే ఉన్నాడు. కుర్చీలో కూర్చుని ఎదురుగా ఉన్న మహాత్మునిపటం వంక చూడసాగాడు.

కొంతసేపటికి పెరటివరండాలో భోజనాలు చేస్తున్న ఆడువారి ప్రసంగంవినిపించ సాగింది. ఉమ గొంతుమాత్రమే సుస్పష్టంగా వినిపిస్తోంది.

"అవునుపిన్నీ! దానివల్ల లక్షతప్పులు ఉండ వచ్చు. నేను కాదనను. కానిదిద్దుకోవలసింది ఎవరు? అదేల తప్పులు చేయాలంటావేమో— ఎవరైనా తప్పులు చేయకుండా పెద్దవాళ్లు కాగలిగారా? అసలు మీచేత పెట్టించేందుకూ? మీబిడ్డలా చూచుకొనిదిద్దు కొనే ఉదారులనేకదా? నువ్వుకాని, వాడుకాని అదితప్పుచేస్తుంటే మందలించారా? మందలించాక కూడా అది దిద్దుకోకపోతే అప్పుడుమీ రే చెప్పులో కొట్టినా న్యాయం ఉంది. అసలు అదిచేసిన తప్పే మిటో బయట పెట్టరు?"

తర్వాత తల్లిమాటలు కావోలు వినిపించలేదు. మళ్లాఉమ—

"అడుగుతే చెపుతుందనే అనుకున్నావా"

"........."

"అత్తింటినుట్టు దాచిపెట్టే బుద్ధిశాలినులు లోకంలో మీయింటి ఆడపడుచులుమాత్రమే అను కోకు. ఎంతమేము పట్టణవాసులమే అయినా కుటుంబమర్యాదలలో మీకేమీ తీసిపోము."

"........."

"కాదూ! నీకొడుకేల చెప్పకపోవాలంటాను"

"........."

"సరే ఏకాంతమే అనుకో. అయితే ఆ ఏకాంతం లోనే నా వాడు 'ఇదితగదు. ఇదిమంచి ఇది, చెప్తా' అని హృదయమిచ్చిచెప్పేడేమో అడుగు"

"........."

"వాడుచెపితే నమ్మనూ? అంతనమ్మకం లేక పోతే బిడ్డనెలా ఇస్తామూ?"

"......"

"బిడ్డనిచ్చు కున్నాను కాబట్టే దెబ్బలాడ తాను. దెబ్బలాడక ఊరుకుంటానా? నీ కొడుకు కాబట్టి వాడు తప్పు చేస్తున్నా నువ్వూరుకుంటున్నావు. నీకొడుకు ముల్లు. అరటాకుమీద ముల్లుపడ్డా, ముల్లు మీద అరటాకుపడ్డా, ముల్లుకు వచ్చేనష్టంలేదు. నేను నీలా ఊరుకుంటే ఎలా?" క్షణమాని 'నేను వీణ్ణి ఎంతనమ్మాననీ? నానమ్మకమంతా దుమ్ము చేశాడే!! పెళ్లయి ఆడుదానినుంచు నిలకగానే వీడిలా వ్యక్తిత్వం కోలుపోయి యుక్తాయుక్తాలూ ధర్మాధర్మాలూ సర్వం మరచిపోతాడని నేనెన్నడూ అనుకోలేదు. లేకపోతే వీడిలా చేయవలసేవాడేనా? ......వీడిమీది గౌరవంకొద్దీ చివరకు నాఅత్తా రితో కూడా పోట్లాట తెచ్చిపెట్టుకు వచ్చేశాను—"

తర్వాత కొంతసేపటి వరకూ ఏమీ వినరా లేదు. మళ్లా ఉమగొంతే వినవచ్చింది. కాని స్వరంలో ఆర్ద్రత వినవస్తోంది.

"ఎందుకో ఒకందుకు. మూలం మాత్రం నీకొడుకే"

మాటలు క్రమంగా అస్పష్టం అవటంమాస్తే ఉమ అక్కణ్ణుంచి వెళ్ళిపోయినట్టు స్పష్టమయింది.

రాజశేఖరం ఏమైనా మూర్ఖుడు మాత్రం కాడు. అతను కళ్లుమూసుకు ఆలోచనలో పడ్డాడు.

అకస్మాత్తుగా ఉమగొంతు వినవచ్చింది. వట్టింట—

"వినసీవమ్మా నాకేం భయంలేదు" అని కాస్త సేపాగి "వింటే యిప్పటికైనా కళ్లుతెరిచి చూస్తా రేమో" అంటూనే మళ్లా బయటకువెళ్లి పోయింది.

రాజశేఖరం అలానే ప్రక్కకు ఒత్తిగిలి పడు కున్నాడు,

* * *

ఉమ ఆరాత్రి తీరికగా పక్కమీద మేను వాల్చి ఆలోచించ సాగింది. తను తన జీవితంలో ఎదురుపడిన వారిలో ఎవ్వరితోనైనా ఎప్పుడో ఒక

ప్పుడు పోట్లాడకుండా విడిచిపెట్టిందా ? తను ప్రతీ వారితోనూ యిలా పోట్లాడటానికి ఏం హక్కు వుంది. వాళ్లు సంబంధాలు తెంచుకోలేక పడిఉంటు న్నారుకాని వాళ్లు నిజంగా తనకు బుద్ధివచ్చేటట్టు చేస్తే తను చేసేదేముందీ. చివరకు గయ్యాళిగంపనే బిరుదు ఏనాడో ఒకనాడు తన మీదపడి ఊరుకుం టుంది. తను చేజేతులా బంధువులా ఆత్మీయులూ చివరికి భర్తమనసు కూడా విరుచుకొంటోంది. ఉమ ఏడువసాగింది. అలా ఏడుస్తూనే ఎప్పుడో నిద్రపో యింది.

## ౧౪

మర్నాడల్లా ఉమ దుర్దినంగానే గడపింది. మూడవనాడుదయం ఉమ ప్రక్కవిూంచి లేచే సరికే వాతావరణంలో ఏదో మార్పు వచ్చినట్టు గమ నించసాగింది.

లేచి ఇవతలికి వచ్చేసరికి—వైశాఖ మేఘాలు వర్షించిన చిహ్నాలు కానవచ్చాయి.

ఆమె ఉత్సాహంతో దిక్కులు చూస్తూ తడిసిన పుటంతో స్నానంగా చలన రహితయై అపూర్వశోభ తోటి భూదేవిని గమనించింది.

ఆ వర్షానికి అదే తొలకరింపు.

ఉమ నూతి వద్దకు పోతూఉంటే ముఖం కడు క్కొనివస్తున్న జానకీ, సుమిత్రా ఎదురుపడ్డారు. సుమిత్ర—

"తెల్లవారుజామున వర్షం కురిసిందక్కయ్యా" అంటూ పలుకరించింది.

జానకిమాత్రం పైటచెరగుతో తుడిచిన ముఖాన్నే మళ్లా తుడుచుకుంటూ వదినను తప్పుక పోయింది. ఏదో కొత్తగా తడబడే పాదాలతో నడిచి పోయే ఆమెను చూస్తూ క్షణకాలం ఉమ అలానే నిలుచుండి పోయింది.

కాఫీ లయ్యాయి. జానకి తలదువ్వుకుంటూ ఉంటే సోమరిగా కూర్చుని ఆమెవంక చూస్తూ ఉన్న ఉమ అకస్మాత్తుగా లేచి పిన్నిదగ్గరకు వెళ్లి—

"సేనివాళ ఇంటికివెళ్తాను పిన్నీ"–అంది.

పిన్నిచేతిలోని పనివిడిచి నిచ్చరబోయి చూస్తూ—

"అదేమిటే...ఏమిటామాట?" —అంటూ అలానే నిలిచిపోయారు. ఉమ ఆమాటకర్థం అదే అంది. ఎంతచెప్పినా వినిదికాదు. 'పోనీ మాఛిన్నాన్న గారు ఊరునుండి వచ్చేవరకైనా ఆగవే' అన్నారు. కాని ఉమ మూర్ఖత్వం విడవలేదు. చివరకు సుంద రమ్మగారు కర్తవ్య విమూఢయై గదిలో ఉన్న కొడు కును పిలవనంపింది. కబురుతీసుకు వెళ్లిన సుమిత్ర తిరిగివచ్చి

"బండి దొరకదుట" అంది.

ఉమ కుటిల భ్రూకుటితో ఎవరితోనూ ఉద్దే శించకుండా అంది.

"బండి దొరకదూ—మహారాజులా దొరకు తుంది. అవసరమైతే నేను నడవగలను కూడా. నిన్న రాత్రి పొమ్మన్నవాడూ వీడే! ఇప్పుడు అటంకపెట్టే వాడూ వీడే!:"

సుందరమ్మగారి కదంతా అగమ్య గోచరంగా ఉంది. ముఖంచూస్తే ఉమ ఏదో నటిస్తున్నట్టే ఉంది. కాని ఆ నటన నిజంకు చాలా దగ్గరలా కూడా ఉంది. అందుచేత అంది—

"వాడు పొమ్మన్నాడా ?"

ఉమ జవాబిచ్చేలోగా రాజశేఖరం అక్కడకు వచ్చాడు. "అవున్నా ?" అంది తల్లి. రాజశేఖరం మాటాడలేదు. కాని ముఖం స్పష్టంగా చెపుతూనే ఉంది.

ఉమ ముఖాన్ని మరీ వికృతం చేసుకుంటూ అంది—

"కావలిస్తే నీకోడలనడుగు. అదే చెప్పింది"

సుందరమ్మ కోడలివంక చూసింది. జానకి అర్థంకాక తొట్రుపడుతూ నాకు తెలియదంది.

ఉమ చప్పునలేస్తూ "నీకంటే కృతఘ్నురాలీ లోకంలో ఉండబోదు" అంటూ అవతలికి వెళ్లిపో యింది.

ఆమె వెళ్లాక తల్లి మళ్లీ రాజశేఖరాన్నడిగింది. రాజశేఖరం ఒకవంక సిగ్గుతో, యింకోవంక చిరు నవ్వుతో తల్లి అమాయకతకు జాలికూడా కలియగా అన్నాడు—

"అది పుట్టినప్పటినుండీ చూస్తున్నావు. ఎన్న డైనా నిజమాడిందా అమ్మా ?

సుందరమ్మగారి గుండె అంతటుకుదుట పడింది. కాని జానకికిమాత్రం ఒకనాడు రాజశేఖరం అర్థం చెప్పించాకా ఉమ తనను కృతఘ్నురాలనటానికి కారణం బోధపడింది కాదు.

# కాలగమనంపై

## కొరియాపై పరిసర రాజ్యాల ప్రభావం

కొరియాభవిష్యత్తు, అమెరికా, రష్యా, చైనా జపాన్, ఈ యీ దేశాల స్వార్థప్రకోపనాలమీద ఆధారపడిఉన్నది. ఈ దేశాలన్నిటికీ, కొరియా అంతరంగస్థితి, చాలా కీలకమైన సమస్య. దూరప్రాచ్యరంగంలో కొరియాస్థానం అల్లాంటిది.

కొరియాయుద్ధంలో, ఆటుపోటులు రెండూ కల్గాక, ఐక్యరాజ్యసమితి అధ్వర్యపు సైన్యాలు, మంచురియా రష్యాసరిహద్దుకు సమీపిస్తూ యుద్ధం ముమ్మరంగా సాగుతున్నకొద్దీ కొరియా యుద్ధానికి ప్రపంచరాజకీయాలపై వుండే ప్రభావాన్ని అంచనా వేయటం మరింత క్లిష్టమవుతూంది.

దక్షిణకొరియాలో, కమ్యూనిస్టుసైన్యాల ఓటమివల్ల, రష్యా, చైనాలలో ఎట్టి సంచలనాలు కలుగుతున్నదో ఏమీ ప్రదర్శితం కాలేదు. ఉత్తరకొరియాలో, సమితిసేనల నెదిర్చేందుకు కమ్యూనిస్టు కొరియన్ బలం, ఇంకా తగినంత ఉండనేఉంది.

కొరియా అరువందల మైళ్ళ పొడుగున్న చిన్న ద్వీపకల్పము. జనాభా ౩౦,౦౦౦,౦౦౦. పెద్ద భాగ్యవంతమైన దేశం గాదు. అయినా పరస్పరవిరోధాలు గల కూటరాజ్యాల చూపు ఎప్పుడూ కొరియామీదే లగ్నమయి ఉంటూవచ్చింది.

కొరియా జపాన్‌దీవులకు అంటిపెట్టుకొని ఉన్నట్టుంటుంది. కొరియాసముద్రపు రేవులు కొంచెం సమశీతలపు రేవులు. దాదాపు పచ్చసముద్రాన్నంతా కొరియా ఆక్రమించుకొని ఉంటుంది.

మొన్న జూన్ ౨౫ దాకా, అమెరికాకు, కొరియావిషయంలో ఇంతటి ప్రాముఖ్యం ఉండేది కాదు. అమెరికారక్షణకు కొరియా పెద్ద కీలకం కాకపోయినా, కొరియాకోసం అమెరికా తన తయారీ సైన్యాల నన్నిటిని పంపించుకోవటం, దాదాపు ౨౫,౦౦౦ మంది అమెరికన్‌సైనికులను కొరియాగడ్డకు బలిఈయటం చాలా విషాదకరమైన విషయమే. పసిఫిక్‌లో అమెరికారక్షణకు కొరియా కీలకస్థానమని, అమెరికన్‌నాయకుల్లో చాలామంది నమ్మలేరు.

అయితే పసిఫిక్‌లో అమెరికాకున్న ద్వీపశ్రేణి స్థావరాలు, అల్యూషియన్‌దీవులతో మొదలిడి, జపాన్‌ద్వారా ఫిలిప్పైన్‌లదాకా విస్తరించుకొని ఉన్నాయి. వీటికి ఆధారంగా ఆసియాగడ్డపై కాలూనే స్థావరం దొరకాలంటే, కొరియాలోమాత్రమే వీలుంది. ఆసియా సైన్యాలదాడి నెదుర్కోవలసివచ్చినా, అమెరికా ద్వీపశ్రేణిస్థావరాలకు ఆధారంగా, ఈ భూస్థావరం అమెరికాకు ఆయువుపట్టే అవుతుంది.

కొరియాయుద్ధ ఆరంభగతీ తరువాతగతీ కూడా కొరియాలో అమెరికాకు మిలిటరీ, ఆర్థిక, లాభాలకన్నా నష్టమే ఎక్కువని చూపించాయి. అయితే కమ్యూనిస్టు ఆక్రమణలను అరికట్టటానికి అమెరికా పూర్తిగా సిద్ధంగా ఉందని కొరియాలో అమెరికాప్రవేశంవల్ల ఋజువయింది. రాజకీయంగా అమెరికా కొంత ఆత్మగౌరవం ఆర్జించుకొన్నట్లే భావిస్తున్నది. తనద్వారా ఐక్యరాజ్యసమితికికూడా ఈ నిండుతనాన్ని కొంత ఇచ్చి, పడిపోతున్న సమితిప్రతిష్టను నిలబెట్టగలిగాననే అమెరికా భావిస్తూంది.

తన సామ్రాజ్యానికీ, రష్యాకూ మధ్య, పోలండువంటి బఫర్‌స్టేటుగా కొరియా ఉంచగలదనే జపాన్ ఎప్పుడూ భావిస్తూవచ్చింది. గత అర్థశతాబ్దంలో జపాన్ నిర్మించుకొన్న పాశ్చ్యసామ్రాజ్యంలో ప్రప్రథమభాగము కొరియా. జపాన్ కొరియాలో పెట్టుకొన్న పెట్టుబడుల కృషివల్లకూడా జపాన్‌కు కొరియా ఆర్థికంగా చాలా ప్రముఖమయింది. కాని ద్వితీయ ప్రపంచసంగ్రామంతో ఈ సామ్రాజ్యము ఊడ్చిపెట్టుకొనిపోయింది. జపాన్ తన దీవుల మాత్రానికే పరిమితమైఉంది. నేడు జపాన్ ఆర్థికంగా స్వయంసమృద్ధం కాదు. ఆసియానడిగడ్డమీదనుంచి తెచ్చుకోగల ముడివస్తువుగాని, అమ్ముకొనేందుకు అక్కడ ఒక్కదుకాణంగాని జపాన్‌కు లేవు.



# విమర్శనము



## ఆంధ్రరచయితలు

[౧౮౦౬—౧౯౦౧]

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి : వెల ౬-౦-౦ పల్లిపర్సు, అడ్డేపల్లి అండ్ కో, సరస్వతీ పవర్ ప్రెస్. రాజమహేంద్రవరము.

ఈ గ్రంథంలో నూరుగురు రచయితల జీవిత చరిత్ర లున్నాయి. వీరందరు ౧౯వ శతాబ్దిలో జన్మించినవారే. ఈ గ్రంథం ౧౮౦౬ లో జన్మించిన పరవస్తు చిన్నయసూరి చరిత్రతో ప్రారంభిస్తుంది. ౧౯౦౧ లో జన్మించిన శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి జీవితచరిత్రతో ఆఖరవుతుంది. ౧౯వ శతాబ్దిప్రారంభంలో జన్మించిన కొంతమంది రచయితలు అప్పుడే విస్మృతిపథంలో పడిపోతున్నారు. శ్రీ సత్యనారాయణశాస్త్రిగారు వీరినిగురించిన అనేకమైన అమూల్యవిషయాలు సేకరించి ఈ గ్రంథం రచించారు. ప్రతిరచయితచరిత్రను మొదట సంగ్రహంగా ఇచ్చి తరవాత గ్రంథకర్తగారు ఆ గ్రంథాలను గురించి తమ అభిప్రాయం తెలియజేశారు.

నూరుగురు రచయితలను గురించి వ్రాసినా ఇంకా కొంతమంది ప్రముఖరచయితల జీవితాలు విడిచిపెట్టవలసివచ్చిందని గ్రంథకర్తగారు పీఠికలో తెలియజేస్తున్నారు. వీరిలో కాశీనాథుని నాగేశ్వరరావు, ముట్నూరు కృష్ణరావు, ఉన్నవ లక్ష్మీనారాయణగారలవంటి ప్రసిద్ధులు చేరి ఉండడం ఈ గ్రంథానికి ఒక పెద్దలోటే. అయితే అనివార్యకారణాలవల్ల ఇది సంభవించినదని. శ్రీసత్యనారాయణశాస్త్రిగారు వ్రాయడాన్ని బట్టి దీని విషయంలో ఇంతకంటే వ్రాయవలసిందేమీ లేదు.

ఇంచుమించుగా అధునాతనయుగం ప్రవేశించే వరకు ఆయా రచయితలనుగురించిన రచన సమంజసంగానే ఉన్నదని చెప్పవచ్చును. అయితే ఆధునిక యుగంలోని రచయితలలో ప్రముఖులపేరులు కాని దీనిలో చేరనేలేదు. నండూరి సుబ్బారావు, డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య. చింతా దీక్షితులు, బుచ్చిసుందరామశాస్త్రి, మొదలైన సుప్రసిద్ధ రచయితలపేరు లెన్నో ఇందులో కనబడడం లేదు. బహుశః కొంత పాండిత్యబలం ఉండి, బాగా సంప్రదాయమార్గం అనుసరించే రచయితలను తప్ప తదితరులను శ్రీశాస్త్రిగారు పరిగణించ దలచుకోలేదేమో!

అచ్చుకూర్పులో సర్దుకోవలసిన చిన్న మార్పొకటి చేస్తే ఈ పుస్తకం ఇంకా ఆకర్షణీయంగా ఉండేది. కవుల జన్మించిన తేదీలనుబట్టి ఆ క్రమంలోనే ఆయా రచయితల క్రమం ఏర్పాటు చెయ్యవలసింది. ప్రస్తుతం కొందరు రచయితల విషంలో ఇది జరగలేదు. బహుశః ముందుకూర్పులోనైనా ఇది సాధ్యపడగలదని ఆశిస్తున్నాము.

ఇంతేకాదు. ఈ రచయితలలో కొంతమంది వాఙ్మయ చరిత్రలో ప్రకాశించవలసినంత ప్రాశస్త్యం లేనివారుకూడా ఉన్నారు. ఇదికూడా ముందుకూర్పులో గమనించవలసినదే.

అయితే ఉన్నంతలో రచయితల చరిత్ర సమకూర్చడానికి శ్రీ శాస్త్రిగారు తీసుకున్న పరిశ్రమ చాలా ప్రశంసాపాత్రమయింది. ఈరోజుల్లో ఇంతగా శ్రమించి పరిశోధన చేసి గ్రంథాలు వ్రాసేవారు తక్కువ. వాటిని ప్రకటించేవారు తక్కువే. వ్యయప్రయాసలతో కూడిన ఈ మహాకార్యం సాధించిన గ్రంథకర్తలకు తత్ప్రకాశకులకు మా అభినందనాలర్పిస్తున్నాము.

ప్రకాశకు లన్నట్టు వీరేశలింగకవులచరిత్ర తరవాత మన భాషలో ఇంత చక్కని కవులచరిత్ర వెలువడలేదు. ౧౯వ శతాబ్దప్రారంభంలో జన్మించిన రచయితలను, ఇటీవల జన్మించిన రచయితలను అవగాహనచేసుకోదలిచినవారికి గ్రంథం చాలా సహాయపడగలదు. గ్రాంథికమైనా శాస్త్రిగారి రచన చాలా సరళంగాను హృద్యంగాను నడిచింది.

సరస్వతీముద్రణాలయాధిపతులు ఇంకా ఇలాంటి సాహిత్య చరిత్రాత్మక గ్రంథాలు ప్రకటించి భాషాసేవ చెయ్యగలరని ఆశిస్తున్నాము.

# శ్రీదేవీ భాగవతము

---

౧-౨-౩ స్కంధములు.

కవి శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు. సాహితీ సమితి, రేపల్లె. వెల. రు. ౫-౦-౦ లు.

దేవీభాగవతము,ములుగు పాపయారాధ్యుని మొదలు, త్రిపురాంతకరమ్మ నదొర, దాసు, శ్రీరాములుపంతులుగారు. తిరుపతి వేంకటకవులు, వలుగురిపీ వాల్లు తెలుగుదేవీభాగవతాలు వెలసి నాయి. అందు మూడు ముద్రణలందే ఉన్నాయి. శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు మరల దేవీభాగవతము తెలుగులో రచింప బూనటానికి ఆయన కున్న దేవీఉపాసన, భక్తి, ఆధ్యాత్మికదృష్టులు మాత్రమే ముఖ్యప్రోద్బలకాలని స్ఫురిస్తోంది ఈ గ్రంథమూలకంగా. కల్యాణానందభారతీపీఠంలో కవిసామ్రాట్టు పదవి వారికి అంకితమైనా, మునుపటి కవులను కవిత్వంలో మించుదామనే ప్రయత్నంతో ఈపని వారు ప్రారంభించిన ట్లగపడదు.

నిజానికి, నవలారచన, చిన్నకథ, మొదలైన తక్కిన సాహిత్యవీథులలో కృషికన్నా, నరసింహశాస్త్రిగారికి ఈవిధంగా పూర్వభక్కిని, పూర్వకావ్యాన్ని ఒకదాన్ని అనుకరించడమే ఎక్కువ తగి ఉందేమో నని అనుకోవచ్చు.

దేవీభాగవతము,విచిత్రమైన కావ్యము. భారత, భాగవత రామాయణాలలో చదువుకున్న పురాణకథ వంతనూ, మళ్ళీ సూక్ష్మంగా వివరిస్తూ, ఆ పురాణ కథాలాపంలో, అక్కడక్కడ కనుపించే పురాణ వ్యక్తుల నీరసగుణాల్ని, వారికి సంభవించిన దుర్దశలను, వారు స్వబుద్ధ్యా చేసిన దోషాలను అన్నిటిని ఉటంకిస్తూ, దేవీఉపాసనాపరంగా, వాటిని సమర్థించటమో, లేక ఖండించటమో, లేక దేవీభక్తులు కానందున వారికా ఆపదలుగాని కష్టాలుగాని నీరసగుణాలు గాని రాక తప్పలేదనో, ఉద్బోధిస్తూ ఉంటుంది. ప్రతి చిన్న అఖ్యాయికకూ, స్త్రీలవ్రతకథలకు చెప్పినట్లు, దేవీవ్రతం సలుపటంవల్ల కలిగే ఫలితాలు చెప్పబడుతాయి.

భారత రామాయణాల కథలు చెప్పేందుకు దేవీవ్రతం మూలకారణ మౌతుంది. ప్రజలను దేవీభక్త్యుపాసకులనుగా చేయటానికే పురాణం ఉద్దేశింపబడింది. అద్వైత, శాక్తేయాలు రెండూ షణ్మతస్థాపకులైన శంకరులే స్థాపించినట్లు, భారతభాగవతాలను భగవద్గీతనూ, చెప్పిన శ్రీ వ్యాసులే మళ్ళీ దేవ్యుపాసనాపరంగా దీన్ని రచించి యుండవచ్చును.

శ్రీపాదాంభోజపవిత్రతీర్థము గ్రహించే సమయంలో శ్రీదేవీభగవత్కథార్థము తెల్గున చెప్పాలని శ్రీనోరి నరసింహశాస్త్రిలవారికి స్ఫురించింది.

"సర్వం విద్ధి యహమ్మనుమిత్ర యనుచుం
 శ్రావ్యంబుగా స్పష్టికిం
బూర్వం బా వటపత్రశాయి శిశు
 సంబోధించు శ్రీమాతృవా
క్సార్వాణీశుభవాణిగా గొనగ వా
 సిన్ నాకు శ్రోత్రద్వయిన్
బర్వంబైనవి యష్టవారకృత ఘం
 టానాద సిద్ధశ్రుతుల్."

ఆవిధంగా భక్తిపరవశులై తెలుగుకావ్యం రచించారు శ్రీశాస్త్రిగారు. గద్యలలో కూడా "విజ్ఞానయోగ దర్పణ ప్రతిబింబితంగా నే" తననూ తన కావ్యాన్ని ఉటంకించుకొన్నారు తప్ప, కవిత్వపరంగా "కల్యాణానందభారతీ కరకమల ప్రసాదాసాదిత కవిసమ్రాట్ పట్టాభిషేకశ్రీ" తప్ప, ఉభయకవిమిత్రత్వమో, సహజకవితా శ్రీ లబ్ధియో, ఇత్యాది కవితా విశేషాన్ని దేన్నీ వారు ప్రముఖంగా చెప్పుకోదలచుకో లేదు.

శాస్త్రిగారిది పండితకవిత్వం. భాషాసౌష్ఠవం ఉంది. అర్థగాంభీర్యంకూడా కొన్నిచోట్ల పొందుపరచగలరు. సంస్కృతంలోని భావాలను చెక్కుచెదరనీయకుండా తెలుగులోకి తేగల అనువాదప్రజ్ఞ కూడా ఉందనే చెప్పాలి. తిరుపతి వేంకటకవులు సూక్ష్మంగా సంక్షిప్తంగా చెప్పిన ఘట్టాలలో చాలా చోట్ల శాస్త్రిగారు, మూలాన్ని యథాతథంగా అనుసరించట మూలానో, లేక కథావిస్తరణ కౌతూహలంతోనో బహువిపులంగా రచన సాగించారు. అనుమగతుల్లోనూ, సమగతుల్లోనూ, దుష్కరప్రాసలతోటీ, కఠినసమాసాలతోటీ, తేటమాటలతోటీ కూడా, పద్యాలు నడిపించి భాషమీద తమకున్న బలవంతపు అధికారాన్ని నిరూపించారు. తిరుపతి వెంకటకవులు మొదలైనవారి దేవీభాగవత అనుసరణలను పఠించి, వాటిపై తమకు కలిగే భావప్రతి భావాలను ఆకళించుకొని, తన రచనను శాస్త్రిగారు తీర్చి

ప్పుకొన్నట్లు వారి కథనంలోనూ, వీరి కథనం లోనూ ఉన్న సారూప్య విభేదాలను గమనించు కొంటే స్ఫురిస్తుంది. నరసింహశాస్త్రిగారి శైలి గంభీరంగా, కొంత పాండిత్యప్రకర్షతో కూడుకొన్నా, నిమ్నోన్నతాలు లేకుండా సమంగానే నడుస్తుంది. కాని పూర్వసాంప్రదాయంలో రచించిన గ్రంథం కాబట్టి, పూర్వకవులతో పోలిక తెచ్చి చూచు కొంటే దేవీతంత్రపరమైన వేదాంతవిజ్ఞానాది విష యాలు వారికన్నా చాలా సూక్ష్మబుద్ధితోనూ, జాగ్ర తతోనూ, ఔచితితోనూ వివరించుకొంటూ వచ్చినా, మూలాన్ని వారికన్నా యథాతథంగా అనుసరించి నట్లు స్ఫురించినా, ఇది కావ్యంగా వ్రాసిఉండటం వల్ల, కవిత్వపరంగా చూసుకొంటే, వారెవ్వరికన్నా కూడా, పద్యాలలో ధార, నుడికారం, కొంచెం తక్కువ స్థాయిలో ఉన్నాయనే అనిపిస్తుంది. ఉదా హరణకు తిరుపతి వెంకటకవులదీ, వీరిదీ ఒక చిన్న శ్లోకానికి అనువాదాలు.

"యా పశ్యతి న సా బ్రూతే.
యా బ్రూతే సా న పశ్యతి
అహో వ్యాధ స్వకార్యార్థిన్
కిం పృచ్ఛసి పునః పునః"

తిరుపతికవులు ఈ శ్లోకాన్నే యథాతథంగా కావ్యంలో ఇమిడ్చికూడా, ఎందుకైనా మంచిదని తాత్పర్యం వ్రాసినట్లు, తెలుగుపద్యాన్ని కూడా ఫుట్ నోట్ లో ఇమిడ్చారు.

ఏది చూచునో యది చెప్పదు,
విదితముగా బల్కు నేది వీక్షింపని ద
య్యది, సాకెసాకె నేమడి
గెదవు ఎవ్వరు చెప్పువా రొగిన్ జను మృగయా.

దీనికి నరసింహశాస్త్రిగారి తెలుగు,
"ఏది చూచునో యది పల్కలేదు, సుంత
యేది పలుకునో యది చూడలేదు నిక్క
మయ్యయో వ్యాధుడా! స్వకార్యార్థి వగుచు
నేల మరిమరి ప్రశ్నింతు విట్లు వృథయు"

శ్లోకానికి ప్రతిపదార్థము తిరుపతికవుల పద్యం లోకన్న ఈ పద్యంలోనే ఎక్కువ సూటిగా ఉండ వచ్చును. కాని కవిత్వానికి, ఈ పద్యంకన్నా పైప ద్యమే దగ్గిరేమో ననిపిస్తుంది.

అయితే ఇల్లా చిన్న చిన్న చోట్ల తారతమ్యా లవల్ల చూచుకొని నరసింహశాస్త్రిగారి కవిత్వాన్ని బేరీజు వేయటం సరికాని పనే—

శాస్త్రిగారి శైలి చాలా ప్రౌఢంగానే నడు స్తుంది.

అంశుమదుజ్జ్వలాంగు డఖి
    లాగమశాసనశీలి భారతీ
వంశవివర్ధనుండు జయ
    భారతకర్త పురాణవక్త వి
ష్ణ్వంశకృతావతారుడు మ
    హాత్ముడు రెండవకృష్ణ దీప్యతా
ప్రాంశుడు శ్రీప్రభావలిత
    భాగవతర్షి వెలింగె వ్యాసుడై—

అమృతాంభోనిధిమూతి శ్రీవనితతో
    డైపుట్టు శైవాత్మకుం
డమలజ్యోత్స్నల పామి దైవతసుధా
    హారాత్ముడుద్యత్కళా
సముపేతుండు సరోజనాభునకు పా
    త్రా నేత్రమాతిండు చం
ద్రముసుం డీవ్య నుతింపగా గుణలయా
    హ్లాదుండు రాజాద్యుడై—

నేటి మామూలుకవిత్వా లన్నిటికన్నా శ్రేష్ఠమైన కవిత్వమే వీరిది. పలుకుపటిమ, పాండితి, పురాణపఠనదక్షమై విశిష్టమైన కవితాధార, పూర్వ ప్రస్తుతకవులలోని విశిష్టమైన పోకడలు, వీరి గ్రంథంలో నిండుగా కనబడతాయి. కథను విస్తృతంగా చెప్పాలన్న కౌతూహలంతోపాటు వాక్యవిన్యాసంలో పదాలు చాలా ముక్తసరిగా వాడే కృషికూడా వీరిలో కనిపిస్తుంది.

ఉపాఖ్యానాలు నడిచే పట్టులలోకూడా, పాటిరచయితలు ఆ యా కథలు ఎల్లా నడిపారో చూచి నడిపే వివేచనకూడా వీరు చూపించారు. రామాయణకథ అరణ్యకాండవరకు కొంత విపులంగా నడుస్తుంది. విశ్వనాథసత్యనారాయణగారి రామాయణకల్పవృక్షంలాంటి విపులరామాయణాలలో తప్ప సూత్రంగా రామాయణకథను చెప్పినవారిలో కనబడని "త్రిజటునికి శ్రీరాముడు గోదాన మిచ్చిన ఘట్టం"కూడా వీరు స్పృశించారు. కాని కిష్కింధా ప్రవేశంతో శ్రీరాముడు దేవీవ్రతమాహాత్మ్యం తెలుసుకొని వ్రత మాచరించడంతో, తక్కిన కథనంతా "కట్టి, కొట్టి, తెచ్చె" అనె మూడు మాటలతో, ఒక్క పద్యంలోనే రామాయణకథ ముగిసిపోతుంది. అవిధంగా సమకాలికరచనలకుకూడా ప్రతిబింబకంగానే కొంతవరకు ఈ గ్రంథం భాసిస్తుంది.

దేవీభాగవతము భక్తి, జ్ఞానయోగాలకు ఆకరంగా ఆ అధ్యాత్మశాస్త్రవిజ్ఞానాన్ని ఎక్కువ విపులీకరించటంలో, దేవీభక్తులైన శ్రీ నరసింహశాస్త్రిగారు, ఈ గ్రంథంలో చాలా కృషి చేసి సఫలీకృతులయ్యారు. వారి మిత్రులు మాధవరామశర్మగారు పీఠికలో ఆంధ్రభాషలో పారాయణయోగ్యగ్రంథ మింతవరకు ఉదయింపలేదని వ్రాశారు. అచ్చుమొగం ఎరుగకుండా తెలుగులో వందలాదివేండ్లు బతికిన పురాణాలన్నిటి చరిత్ర ఎరిగుండి ఇల్లా అనడం, కేవలం "అతిశయోక్తి" అనుకోలేము. వేరేదో అర్థాంతర ఉక్తి అయి ఉండాలి. లేదా పారాయణయోగ్యత అంటే వారి దేవో విశిష్టార్థ ముండి ఉండాలి. బహుశా ఆ విశిష్టార్థానికి అన్వయంగా "నరసింహశాస్త్రి యిట్టి గ్రంథముదయింపచేసినాడని" వారని ఉండవచ్చును. నరసింహశాస్త్రిగారి గ్రంథం అల్లాంటిదే కాగలదని విశ్వసిద్దాం.




Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad